















భావయామి వేంకటేశం

శ్రీరస్తు

శుభమస్తు అవిఘ్నమస్తు

# భావయామి వేంకటేశమ్

## సంపుటి-III

## ఎన్నుకోబడిన
## అన్నమాచార్యుల సంకీర్తనలకు
## మున్నుడి

మరియు

## భావామృతం వివరణ

రచన
**అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు**
M.Tech.

# భావయామి వేంకటేశమ్

**సంపుటి-III**

మొదటి ప్రచురణ
**మార్చి 2011**

రచన
**అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు**
M.Tech.
**Cell: 9393021360**

వెల : అమూల్యం

ప్రతులకు :
ఫ్లాట్ నెం. 5, ప్లాట్ నెం.61, సిద్ధార్థ నగర్,
హైదరాబాద్ - 38. ఫోన్ : 093930 21360

డి.టి.పి. & ప్రింటింగ్ :
కె. మురళీ కృష్ణ
9848 51 51 09





**అన్నమాచార్యులవారి**
**602వ జయంతి సందర్భంగా భక్తితో**

ఆ.వె॥ ఇష్టదేవతలను యెల్లర భావింతు
'వేంకటేశ్వరునిగ, వేడుకొనెద
అన్నమయ్య కృతికి అత్యంత సులువైన
వివరమీదలంతు విజ్ఞులార!

- రచయిత



**అంకితము**

చం॥
హరివెలయింపగా నరిగి ఆయన నందక ఖడ్గ మీభువిన్
వరముగ రూపుదాల్చి నుతి బాడెను కమ్మని కీర్తనంబులన్
వరదుడు "అన్నమయ్య" హరి భక్తుడు యందరి మోక్షదాతయున్
గురువుగనెంచి అంకితము కోరిక తీరగ నిత్తు నీకృతిన్.

# భావయామి వేంకటేశమ్

## సంపుటి III

### అన్నమయ్య కీర్తనల విషయ సూచిక

భావయామి వేంకటేశం

# ప్రార్థన

కం॥ శ్రీమన్నారాయణునిన్
నామది అన్నయ్యవోలె నయముగ తలతున్
నీమముగ తెలుపుచుంటిని
ఈ 'మున్నుడి', 'భావములను' ఇంపుగ వినరో!

కం॥ శ్రీవల్లభునిన్ పొగడుచు
ఆవల అన్నయ్య తాను అలరించ హరిన్
భావించి వేల కీర్తన
లా వరదుడు భక్తిమీర ఆలాపించెన్

చం॥ ఘనుడగు వేంకటేశ్వరుని కామితదాయకుడైన శ్రీపతిన్
అనఘుడు అన్నమయ్య మనసార భజించెను వేల కీర్తనల్
అనుపమ లీలతో వినిచె, ఆయన స్ఫూర్తి తరింప నెంచితిన్
కనులకు కానరాని 'సిరికాంతుని' నామది నిల్పికొల్చితిన్

ఆ.వె॥ వేంకటేశుడొకడె వెలకట్టలేనట్టి
దైవమనుచు నమ్మి దీనుడనని
'భావయామి' అంటి బరువంత దిగిపోయె
అన్నమయ్య దారి నెన్నుకొంటి

కం॥ మున్నెరుగ నన్నమయ్య
ఎన్నుచు కీర్తనలు భావమిటు తెలుపుటయున్
మున్నుడి పద్యము జెప్పుట
ఇన్నియు చేసినది వేంకటేశుడె సుండీ!!!

## ముందు మాట (సంపుటి-III)

"మాయా మేయ జగంబు నిత్యమని సంభావించి"....అని హరిశ్చంద్రుడు కాటికాపరియై వేదాంతం తెలుపుతాడు. మన మాతృభాష అయిన ఈ తెలుగు ఎంత అద్భుతమైన భాష అంటే, ఎంత చెప్పినా తక్కువే అవుతుంది. పై వాక్యంతో నా ముందుమాట ఎందుకు మొదలు పెట్టానంటే....

భగవానుడు తిప్పుతున్న ఈవిశ్వాన్ని మాయ ఆవరించి, సత్యం అసత్యంగాను, అసత్యం సత్యంగాను గోచరిస్తుంది. మిధ్య అయిన వన్నీ నిజాలుగా భావించి మనకు మనమే 'ధనం' అన్నదాన్ని సృష్టించుకొని దానితో పొందగలిగే సుఖాలన్నీ నిజంగా సుఖాలు కాదని, నివురు కప్పిన నిప్పులా,దుఃఖమే సుఖమనే వేషంలో వచ్చినదని, దానిని నమ్మరాదని పెద్దలు ఏనాడో చెప్పారు. పంచమ వేదమయిన భారతంలో చెప్పినదే 15 వ శతాబ్దిలో తాళ్ళపాక అన్నమాచార్యులవారు అద్భుతమైన తెలుగు కీర్తనలలో చెప్పారు.

తెలుగులో ఆ మహానుభావుడెందుకు చెప్పారంటే...తెలుగులో ఒక చిన్నమాటలో ఎంతో గొప్పభావం తెలుపవచ్చును. ఒకే అక్షరాన్ని రకరకాలుగా పలికి రకరకాల అర్థాలు వచ్చేట్లు చేయువచ్చును. ఉదాహరణకి 'ఆ' అనే అక్షరం గమనించండి. 'ఆ' అంటే 'అది' అని అర్థం. ( 'ఆ' పుస్తకం ఇటివ్వు). 'ఆ' అంటే 'ఏమిటి'? అని అర్థం ('ఆ' ఏమన్నావు ఇంకోసారి చెప్పు).'ఆ' అంటే 'అవును' అని అర్థం. ('ఆ' నేనూ సభలో వున్నాను). ('ఆ') అంటే ప్రశ్నార్థకం ('ఆ' అలా అయిందా?)

మళ్ళీ ఇంకొక్కసారి ఈ ముందుమాటలోని మొదటి వాక్యం గమనించండి. 'వేదాంతం తెలుపుతాడు'-అన్న వాక్యంలో తెలుపుతాడు అంటే తెలియజేస్తాడు అనే కదా! అర్థం. తెలుపు ఒక రంగు. తాడు, కట్టటానికి ఉపయోగపడే ఒకనూలు. రెండూ కలిపితే తెలుపుతాడు (తెలియజేస్తాడు) అయింది.





ఇంత విశాల పరిధి వున్న భాష కాబట్టే తాళ్ళపాక అన్నమాచార్యుల వారు తన కీర్తనలకు ఈభాషనెన్నుకొన్నారు. అన్నమయ్య సంకీర్తనలలో దైవస్తుతి కీర్తనలు కొన్ని సంస్కృతంలో వున్నా అవి సంఖ్యలో చాల తక్కువ, జన ప్రియత్వంలో ఎక్కువ.

దేశభాషలందు తెలుగులెస్స- అని శ్రీ కృష్ణ దేవరాయలు ఊరకనే అనలేదు. సంస్కృతం నుంచి ఆవిర్భవించినా తనదైన శైలిలో జాను తెలుగుగా రూపు దిద్దుకొని పల్లెల్లో నాట్లు వేసుకొని నేటికీ అజరామరంగా ఉన్నది జానపదుల తెలుగు. కాకపోతే నేటి ఇంగ్లీషు వ్యామోహం వల్ల బలహీనమై నాబోటి వాడి పద్యానికే తాత్పర్యం వ్రాయాల్సిన అగత్యం ఏర్పడింది.

అన్నమయ్య కీర్తనలకు భావం వ్రాయాలని నేను నిశ్చయించుకొని ఒకరి సలహా అడిగితే. తెలుగు కీర్తనలకి వివరణ అవసరమా అన్నట్లు మాట్లాడారు. పరమాత్మ దశావతారములను అచ్చతెలుగులో పాడిన అన్నమయ్య కీర్తనలు చూడండి. దీనికి సరి అయిన అర్థం (భావం) 'నాకు తెలుసా' అని ఎవరికి వారు మనస్సులో ప్రశ్నించుకోండి. దీక్షితులు నిజమే చెబుతున్నాడని మీకు తప్పక అనిపిస్తుంది. అన్నమాచార్యులవారి కీర్తనలు అంతతేలికగా కొరుకుడు పడవు.

సంస్కృత, తెలుగు నిఘంటువుల సహాయంతో మాత్రమే నేను ఈ నా సంకల్పం నెరవేర్చానని చెప్పటానికి నేనేమాత్రం సిగ్గు పడటం లేదు.

"ఎందరో మహానుభావులు అందరికీ వందనములు" ...అని అన్నారు త్యాగరాజ స్వామి. అన్నమాచార్యుల వారి సంకీర్తనలను సంరక్షించి, పరిశోధించి, పరిశ్రమించి, తగిన రాగములను కట్టి, సంకీర్తనలుగా పాడి, తాము ధన్యులవుటే కాక కోట్లాది మంది నాబోటి సామాన్య సంగీత ప్రియులను నిత్యమూ ఆనందపరుస్తున్న పెద్దలైన వారందరికీ పాదాభివందనలు. పిన్నలైన వారికి ఆ పెద్దవారంతటి వారు కావాలని శుభాశీస్సులు.

ఒకమాట... నిష్ణాతులు, వాగ్గేయకారులు, సంగీత విద్వాంసులు, సాహితీవేత్తలు, ఎవరో ఒకరి వారు కారు. వారు అందరివారు. అట్లాగే వారి కీర్తిప్రతిష్ఠలు వారివే కాదు అందరివీ. మా అన్నమయ్య, మా ఘంటసాల, మా బాలమురళి, మా లతా మంగేష్కర్, మా మహమ్మద్ రఫీ,... వీరికి జాతి కుల మత వయో బేధాలతో పని లేదు. కీర్తిశేషులైనా వీరు మాహృదయాలలోనే వున్నారు. రేపు మేములేకపోయినా వారు మా హృదయాలలోనే వుంటారు.

అందుకని నేను ఈ నా ప్రయత్నంలో ఎవ్వరెవ్వరి శ్రమనో, కష్టార్జితాన్నో, ఈ రచనను మెరుగు పెట్టటానికి ఆ'శ్రమ' ఉపయోగించుకొని వుంటే, వారికివే నాకృతజ్ఞతలు. వారందరి సహకారంతోనే ఈకృతి సాధ్యమయిందని మనస్పూర్తిగా చెబుతున్నాను.

నా రచనలు పుస్తకంగా నా మిత్రుల కివ్వటంలో నాకు అది భగవత్సేవ అనే భావనే కాని వేరే చింతన లేదు. డబ్బుకి నేనెన్నడూ సరస్వతిని అమ్మలేదు, అమ్మనుగాక అమ్మను.

నాలాగే ఇతరులుకూడ ఆలోచించక పోవచ్చు. వారి కష్టాన్ని వారు ప్రతిఫలరూపంలో ఆశించవచ్చును. నేను ఉపయోగించుకొన్న అన్నమయ్య కీర్తనలు వారి శ్రమ ఫలంగా వెలుగులోకి వచ్చి ఉండవచ్చును. అప్పుడు వారికి ఇందులో నేను వారి కష్టాన్ని దోచుకున్న భావన కలుగవచ్చును. మనందరికి గురువైన తాళ్లపాక గురుపుంగవులను చూచి నన్ను మన్నిస్తారని నా ఆకాంక్ష, విన్నపము కూడా. ఈ రచన చేయాలనే ఆలోచన పుట్టించిన బ్రహ్మ, శ్రీ ఎమ్.వి.ఎల్.ఎన్. మూర్తి గారు. ప్రోత్సాహాన్నిచ్చింది డా॥ బి.వి.ఎస్.ఆర్. మూర్తిగారు. సహకరించింది ఎందరో మహానుభావులు. అందరికీ నా కృతజ్ఞతాభివందనలు.





ఇకపోతే మున్నుడి ప్రతికీర్తనకి కావాలా? దాంట్లో పద్యం ఎందుకు? అనే ప్రశ్నలుత్పన్నమయ్యాయి. మున్నుడి అంటే ఉపోద్ఘాతం లేక అవతారిక. మున్నుడి తెలుగు మాట కాబట్టి దాన్నే ఎన్నుకొన్నాను. కీర్తన వైశిష్ట్యం తెలిపే ఉద్దేశ్యంతోనే ప్రతికీర్తనకి మున్నుడి చెప్పాను. ఇక ప్రతి కీర్తనకి ఒక పద్యం చెప్పటానికి కారణం మాత్రం పద్యాలపై నా ప్రేమ స్ఫురింప చేయటమే కాక, అన్నమాచార్యుల వారిని నా ఇష్ట దైవమైన వేంకటేశ్వరుని కీర్తించటమే.

భావామృతంలో కీర్తనని ప్రతి చరణంలోని ప్రతిమాటను వివరించాలని నా ఆశయం. అందుకనే పేరా లుగా విడివిడిగా వ్రాశాను. ఏ చరణాన్నయినా తేలికగా అర్థం చేసికొనవచ్చును.

నాకు ఆత్మానందం కలిగించిన ఈ నా ప్రయత్నం అనంతంగా సాగుతూనే ఉంటుంది. నా తుదిశ్వాసదాకా. ఎందుకంటే రోజుకి ఒకకీర్తన చేసినా అన్నమయ్య కీర్తనల కన్నీ భావం వ్రాయాలంటే నా జీవితకాలం చాలదు. అలా చాలకూడదనీ, ఈ నా అన్నమాచార్యారాధనలోనే వేంకటేశ్వరుని కీర్తిస్తూనే నా కలంతో పాటు శ్వాస కూడా ఆగిపోవాలని నా నిరీక్షణ.. నా ఆకాంక్ష.

నా వెబ్‌సైట్ **www.geetadeeksha.com** లో నా ఇతర రచనలు చదివి ఆనందించి నన్ను ఆశీర్వదిస్తారని ఆశిస్తాను.

**Note :** ప్రతి సంపుటిలోను ముందుమాట అంకితం యథాతథంగానే ఉంటాయి.

## ప్రత్యేక కృతజ్ఞతలు

సర్వశ్రీ....

1. డా॥ మంగళంపల్లి బాలమురళీకృష్ణ

2. డా॥ సముద్రాల లక్ష్మణయ్య గారు

3. నేదునూరి కృష్ణమూర్తి గారు

4. గరిమెళ్ల బాలకృష్ణ ప్రసాద్ గారు

5. గరికపాటి వెంకట్ గారు

6. గురు కొండవీటి జ్యోతిర్మయి గారు

7. శోభారాజ్ గారు (అన్నమయ్య ప్రేరణ వీరివల్లనే)

8. ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం గారు

9. శంకర చంద్ర పవన్

ఇంకా ఎందరో, మరెందరో... వారందరికీ









**3-1**

## మున్నుడి

శ్రీవేంకటాద్రిమీద వెలసి, పోడిమితో (సౌందర్యముతో) కనిపించే పొడగాటి దైవమని, వరములిచ్చేదైవమని కీర్తిస్తున్నారు అన్నమాచార్యులవారు. ఆయన ఒక్కొక్క వెంట్రుకలో ఒక్కొక్క బ్రహ్మాండంవుందిట. ఒక బ్రహ్మాండంలోనే అంతులేని నక్షత్రాలు. వాటికి మళ్లీ గ్రహాలు. మన భూమండలం సూర్యుడనే నక్షత్రానికి ఒకగ్రహం. ఆ భూమిలో మనం వుండే చోటెంత? అసలు మన వునికి యెంత? మనం ఎంత అల్పులమైనా ఆ దేవదేవుని శరణు అంటే కాపాడుతాడు. ఎవరెవరో దేవతలెందుకు? వారందరినీ పుట్టించిన శ్రీనివాసుడు శాశ్వతుడు ఉండగా ఇంకే భయం? అంటున్నారు.

**ఉ॥ వాడె వరాలనిచ్చుటకు వాసముగా తిరువేంకటాద్రిపె**
**పోడిమి తోడ గన్పడె నపూర్వముగా పొడవాటి దైవమై**
**వేడుక వీని గొల్వుడనె ప్రీతిగ పాడుచు నన్నమార్యుడున్**
**చూడగ జన్మజన్మముల జొప్పిన భాగ్యము శ్రీనివాసుడా!**

**రాగం : వసంత**

వాడె వేంకటాద్రిమీద వరదైవము
పోడిమితో పొడచూపె పొడవైన దైవము ॥వాడె॥

వొక్కొక్క రోమకూపాన నొగి బ్రహ్మాండ కోట్లు
పిక్కటిల్ల వెలుగొందే పెను దైవము
పక్కనను తనలోని పదునాలుగు లోకాలు
తొక్కి పాదాన గొలచే దొడ్డ దైవము ॥వాడె॥

వేదశాస్త్రాలు నుతించి వేసరి కొనగలేని
మోదపు పెక్కుగుణాల మూలదైవము
(పొ)పోది దేవతల నెల్ల పుట్టించ రక్షించ





ఆదికారణంబైన అజుగన్నదైవము ॥వాడె॥
సరు(ర)స శంఖ చక్రాలు సరిబట్టి అసురుల
తరిగి పడవేసిన దండి దయివము
సిరి వురమున నించి శ్రీవేంకటేశుడయి
శరణాగతులగాచే సతమయిన దయివము ॥వాడె॥

**భావామృతం :**

అదిగో వాడే శ్రీవేంకటాద్రిపై వెలసిన వరదైవము. (వరములిచ్చే దేవుడు). ఎంతో సౌందర్యముతో గానవచ్చుచున్న ఆ పొడవైన దేవుని చూడండి. చూచి తరించండి.

ఆ స్వామి ఒక్కొక్క వెంట్రుకలో ఒక బ్రహ్మాండం చొప్పున కోట్లాది బ్రహ్మాండాలను తనలో నింపుకొని వెలుగొందుచున్న అనంతుడైన దైవము. తన సమీపముననే (తనలోనే) పదునాలుగు లోకములను తనపాదములతోనే కొలిచి తొక్కి చూపించిన (బలి చక్రవర్తికి) గొప్ప దైవము (త్రివిక్రముడు).

నాలుగు వేదములు, ఆరు శాస్త్రములు ఆయనను కీర్తించి యెంత శ్రమ నొందినా ఆయనను వివరించలేక పోయాయి. అంతులేని మంగళకరములైన గుణముల ప్రోవు ఆ స్వామి. దేవతా సమూహముల నెల్ల పుట్టించి, వారిని రక్షించుచున్న ఆదికారణము ఆ చతుర్ముఖ బ్రహ్మ. ఈ మహానుభావుడు ఆ బ్రహ్మదేవునే కన్నయట్టి దైవము (తండ్రి).

అతి సమీపముగా శంఖ చక్రములను యుక్తముగా ధరించి రాక్షసులను నరికి పారవేసిన దండి దయివము (గొప్పదైవము). శ్రీమహాలక్ష్మిని తన హృదయంలో నిలిపి శ్రీవేంకటేశ్వరుడై తనను శరణు జొచ్చినవారిని రక్షించుచున్న శాశ్వతుడైన దైవము ఈ తిరుమల నాధుడు.

**3-2**

## మున్నుడి

శ్రీవేంకటేశ్వరుని పట్టపురాణి అలమేల్మంగపై అన్నమాచార్యుల వారు చెప్పిన అద్భుత కీర్తన ఇది. పరమాత్మ దేవేరి, బ్రహ్మయ్యను కన్నతల్లి, చంద్రుని తోబుట్టువు, క్షీరసాగర కన్య అసంఖ్యాకమైన వేంకటపతి బంట్లకు ఇహము పరము ఇచ్చే తల్లిని కాస్తమాబోటి భూలోకంలోని నిర్భాగ్యులని కూడా విచారించు తల్లీ! అని వేడుకొంటున్నారు. శ్రీమహాలక్ష్మి సిరులనిచ్చే తల్లియే, కాని మనం అంతా గమనించాల్సిన విషయం ఏమంటే "నీమగని పంపునను నిజసిరులిచ్చితివి" అంటున్నారు. స్వామి తలవూపితేకాని అమ్మ మనకేసి చూడదు. అదీ సంగతి.

**చం॥ కమలకు, విష్ణురాణికిని, కాముని తల్లికి, కామధేనుతో**
**విమలపు జన్మనెత్తిన పవిత్రకు మొక్కిరి అన్నమార్యుడున్**
**రమ యని పేరునొందిన లలామకు వేంకటనాథుడే తగున్**
**అమరుల కన్నతల్లికిది అద్భుత కీర్తన మెంచి చూడరో**

**రాగం : శుద్ధధన్యాసి**

పరమాత్ముడైన హరి పట్టపు రాణివి నీవు
ధర మమ్ము విచారించదగు నీకు నమ్మా ॥పరమాత్మ॥

కనులజు గన్నతల్లి కాముని గన్నతల్లి
అమరుల గన్నతల్లి ఆదిమ లక్ష్మి
విమలపు నీపతికి విన్నపము సేసి మమ్ము
నెమకి యేలితి దయ నీకే తగునమ్మా ॥పరమాత్మ॥

కామధేను తోబుట్టుగ కల్పకము తోబుట్టుగ
దోమటి చల్లని చంద్రు తోబుట్టుగ
నీ మగని పంపునను నిజసిరులిచ్చితిని
నేమపు వితరణము నీకే తగునమ్మా ॥పరమాత్మ॥





పాలజలధి కన్యవు పద్మాసనివి నీవు
పాల పండే వేంకటపతి దేవివి
యేలిన ఇతని బంట్లకు ఇహపరాలిచ్చి మా
పాలగలిగితివి సంబంధము మేలమ్మా ॥పరమాత్మ॥

**భావామృతం :**

పరమాత్మునిగా సన్నుతింపబడుచున్న శ్రీహరికి పట్టపురాణివి తల్లీ! నీవు. ఆయన యేలుబడిలో వున్న ఈ భూమిపై నున్న మమ్ము రక్షించి మా బాగోగులు చూడవలసిన అమ్మవు నీవే.

నీకు నీవేమన్నా తక్కువా తల్లీ? నీవెవరివో తెలుసా? స్వయంగా చతుర్ముఖ బ్రహ్మగారి కన్నతల్లివి. భావనలోనే పుట్టి అలరించే కాముడు(మన్మథుని) అమ్మగారివి. దేవతలందరికి జననివి. ఆదిలక్ష్మివి. నిర్మలుడైన నీమగని కాస్త మాకొరకు అభ్యర్థించి మేం యెక్కడ వున్నా వెదకి పట్టుకొని దయచూపించమని చెప్పగల దానివి నీవొక్కదానివే. నీకే తగును. కాస్త దయచూడు తల్లీ!

ఇక నీ సోదరులు యెంత గొప్పవారో తెలుసునా తల్లీ! కామధేనువు అందరి కోరికలను తీర్చే సంగతి జగత్ప్రసిద్ధమే. కల్పకము (కల్పవృక్షం) యెక్కడ వుంటే అక్కడ కొఱతయే వుండదు. చంద్రుడు చల్లని చందమామయ్యేగాక, దోమటి (అన్నము) పెట్టే సస్యదాత. నీ మగడు అంగీకరిస్తేనే మాకు నిజమైన సౌభాగ్యములనిచ్చెదవు. అందుకని 'ఈవి' (దానగుణం) మీ వంశంలోనే వున్నది. కాస్తమాపై కూడ నీదయ చూపించు తల్లీ!

నీవు క్షీరసాగరకన్యవు. కమల నివాసినివి. పాలపండే (నైపుణ్యంగల) వేంకటేశ్వరుని దేవేరివి. ఆ స్వామి బంట్లము అయినందువల్ల మా యేలిక ప్రోద్బలమున మాకు ఇహము పరమునిచ్చే యజమానురాలివి. అందుచే నీవు మా పాలినుండు సంబంధముచే మమ్ము పరిపాలించి రక్షించు తల్లీ!

3-3

## మున్నుడి

'ఎందెందు వెదకి చూచిన అందంద గలడు హరి' అన్నాడు ప్రహ్లాదుడు. అయితే వెదకవలసినది మనమే. ఆరాటంతో, భక్తితో శరణాగతితో వెదకాలి. అప్పుడు తప్పక కనబడతాడు. లోకాల యేలిక నెక్కడ వెదకం? అని నిరుత్సాహపడరాదు. జలధిలో చేపలా కనబడలేదా? పాతాళంలో కూర్మంలా.. ఆఖరికి ఆవుల మందలలో రామకృష్ణులుగా... నేటికీ జీవులందరిలోనూ అంతర్యామియైన శ్రీవేంకటేశ్వరునిగా నున్నాడు. అన్నమాచార్యులవారు హరి అవతారాలను చాలా కీర్తనలలో నర్మగర్భంగా చెప్పారు. కాని ఇందులో చాల తేటతెల్లంగా చెప్పారు.

**కం॥ ఇతనిని మించిన దైవము**
**'వెతికిన' కనరాడు ఘనుడు వేంకటపతియే**
**ఇతనివె పదిరూపములన్**
**నుతియించిరి అన్నమయ్య నోరూరంగన్**

**రాగం : మోహన**

ఇతనికంటే మరిదైవము కానము యెక్కడ వెదకిన నితడే
అతిశయమగు మహిమలతో వెలసెను అన్నిటికాధారము తానె ॥ఇతని॥

మదిజలధులనొకదైవము వెదకిన మత్స్యావతారంబితడు
అదివో పాతాళమందు వెదకితే ఆది కూర్మమీ విష్ణుడు
పొదిగొని యడవుల వెదకి చూచితే భూవరాహుని కంటిమి
(బె)చెదరక కొండల గుహల వెదకితే శ్రీ నరసింహంబున్నాడు ॥ఇతని॥

తెలిసి భూనభోంతరమున వెదకిన త్రివిక్రమాకృతి నిలిచినది
బలువీరులలో వెదకి చూచితే పరశురాముడొకడైనాడు
తలపున శివుడును పార్వతి వెదకిన తారక బ్రహ్మము రాఘవుడు
కెలకుల నావుల మందల వెదకిన కృష్ణుడు రాముడునైనారు ॥ఇతని॥





పొంచి అసుర కాంతలలో వెదకిన బుద్ధావతారంబైనాడు
మించిన కాలము కడపట వెదకిన మీదటి కల్క్యావతారము
అంచెల జీవుల లోపల వెదకిన అంతర్యామై మెరసెను
యెంచుక ఇహమన వెదకిన యీతడే శ్రీవేంకట విభుడు ॥ఇతని॥

**భావామృతం :**

నరులారా! ఎక్కడ వెదకినా, మనకు ఇతనిని మించిన దైవము కానరాదు. ఈయనే అన్నిటికీ ఆధారమైన ఆది దైవము. అతిశయించిన దివ్య మహిమలతో ఈయన అనేక చోట్ల 'అవతరించి' దుష్టశిక్షణ శిష్టరక్షణ చేశాడు.

ఆ కథలన్నీ విన్నాం కదా!

మహాసముద్రంలో మత్స్యరూపంలో కనబడ్డాడు. మనస్సు అనే సముద్రంలో వెదకితే నేటికీ కనిపిస్తాడు. అదిగో చూశారా పాతాళంలో వెదకితే ఆదికూర్మమైన విష్ణువుగా కనిపించాడు. పొదిగొని (భారము వహించి) వెదకితే అడవులలో భూదేవితో నున్న వరాహమైనాడు. భయపడకుండా కొండలలో వెదకితే శ్రీనృసింహమూర్తిగా కనిపించాడు.

ఆయన మహిమను గ్రహించి వెదకితే "భూనభోంతరాల"లో (అంటే భూమిలోపల, భూమిమీద ఆకాశంలోను) సర్వమూ వ్యాపించి త్రివిక్రమునిగా (వామనావతారం) కనిపిస్తాడు. మహాపరాక్రమ వంతులలో వెదకితే పరశురామునిగా కనబడతాడు. శివపార్వతులకు కూడా భావించి వెదకితే తారక బ్రహ్మరూపంలో రఘురామునిగా కనిపించాడు. అంతెందుకు దిక్కులన్నింటిలోనూ (కెలకులలో) ఆవుల మందలలో వెదకితే బలరామకృష్ణులుగా కనిపిస్తాడు. కాకపోతే వెదకాల్సిన బాధ్యత మనదే.

పొంచియుండి వెదకితే రాక్షస స్త్రీలతో కూడా బుద్ధుని వలె కనబడతాడు. కలియుగం మించిన కాలంలో కూడా వెతికితే ఈ యుగాంతానికి కల్కి అవతారంలో కనిపిస్తాడు. అప్పటికి మనమెలాగూ వుండము, కాబట్టి నేడే అంచెలలో (వరుసగా) జీవులలో వెదకితే అంతర్యామిగా దేదీప్యమానంగా వెలిగిపోతూ కనిపిస్తాడు. ఇహపరములలో వెదకితే ఆయనే వేంకటాద్రిపై శ్రీవేంకటేశ్వరునిగా కనిపిస్తాడు.

**3-4**

## మున్నుడి

అన్నమయ్య కీర్తనలను పూర్తిగా అర్థం చేసికొనుట మహామహా పండితులకే అసాధ్యమని నా నమ్మకం. నేను విన్న చాలా కీర్తనలలో ఇదమిద్ధంగా అర్థం తెలియని పదములు తారామండలంలో నక్షత్రాలవలె అనేకం వున్నాయి. 'ఏకాంగవీరుడు' హనుమంతు 'ఏకాంగి' అంటే విరక్తుడైన విష్ణుభక్తుడు లేక ఒంటరివాడు అని అర్థం. విష్ణువు వారందరికి ఆరాధ్యుడు కావున 'ఏకాంగ వీరుడు' అంటే విష్ణుమూర్తి. అసహాయశూరుడు అని కూడా అర్థం. ఇంకొకపదం 'జలధి పుటమెగసి చంద్రుడు' అయ్యాడు. అంటే సముద్రాన్ని దాటాడు కాబట్టి చంద్రుడు అని. చాలా చిక్కులున్నాయి. చదవండి మరి... మంగాంబుధి హనుమంతునిపై అద్భుత కీర్తన.

**ఆ.వె॥ ఒకడు హరియె జగతి 'ఏకాంగవీరుడు'**
**అట్లె హనుమయనిరి అన్నమయ్య**
**బలిమి వేంకటేశు బంటీతడంచని**
**ఎదురు లేనివాడు ఈతడనిరి.**

**రాగం : తోడి**

ఒక్కడే ఏకాంగవీరుడుర్వికి దైవమౌనా
యొక్కడే హనుమంతుని కెదురా లోకము ॥ఒక్కడే॥

ముందట నేలే పట్టమునకు బ్రహ్మాయినాడు
అందరు దైత్యులజంపి హరిపేరైనాడు
అంది రుద్రవీర్యము తానై హరుడైనాడు
యెందు నీ హనుమంతునికెదురా లోకము ॥ఒక్కడే॥

చుక్కలు మోవ పెరిగి సూర్యుడు తానైనాడు
చిక్కుపాతాళము దూరి శేషుడైనాడు
గక్కున వాయుజుడై జగత్ప్రాణుడైనాడు
ఎక్కువ హనుమంతుని కెదురా లోకము ॥ఒక్కడే॥





జలధి పుటమెగసి చంద్రుడు తానైనాడు
చెలగి మేరువు పొంత సింహమైనాడు
బలిమి శ్రీవేంకటేశు బంటై మంగాంబుధి
ఇలయా హనుమంతుని కెదురా లోకము ॥ఒక్కడే॥

## భావామృతం

జగత్తునకంతటికీ ఏకాంగ వీరుడు విష్ణుభక్తుల కొక్కడే ఇలవేల్పు శ్రీహరి. హరి(వానరము) శ్రేష్టుడైన హనుమంతుడు కూడా ఏకాంగవీరుడే కదా! ఇక ఆయనను కూడా ఎదురు అనేదేలేదు. అందుకే అసహాయ శూరుడు, అంటే హనుమంతుడే.

ముందు రాబోవు కాలంలో ఆయన బ్రహ్మ పట్టము పొంది 'బ్రహ్మ' అవుతాడు. దానవ మర్దనుడు కాబట్టి ఆయనకు హరి (వానరము మరియు విష్ణువు) అనే పేరు తగినదే. శివుని వీర్యసంజనితుడు కావున రుద్రుడు (శివుడు మరియు రౌద్రంకలవాడు) అయ్యాడు. ఇక ఈ హనుమంతునికి ఎదురు ఎక్కడుంటుంది.

లంకలో సీతమ్మకు తనపై నమ్మకం కలుగుటకు సూర్యమండలమంత ఎత్తునకు ఎదిగి ఈయన ఇంకొక సూర్యుడు అనిపించాడు. మైరావణుని సంహరించడానికి పాతాళలోకంలోనికి చొరబడి ఈయన ఆదిశేషుడా ఏమిటి అనిపించాడు. వాయునందనుడు గావున జగత్తునకు త్రాణ (ప్రాణం) యై కాపాడుతున్నాడు. అందుకే ఈయన అందరికంటే ఎక్కువయైన హనుమ అయ్యాడు. ఇక ఈయనకి ఎదురేలేదు.

సముద్రమును రాత్రివేళ దాటి (లోకమాత సీతమ్మకు చల్లని రామయ్య వార్త చెప్పాడు) చంద్రుడైనాడు. మేరు పర్వతము చెంత నివసిస్తాడు. కాబట్టి సింహము (సింహరాశి) యైనాడు. ఇవన్నీ ఇలావుండగా సర్వసమర్థుడైన బలవరి శ్రీవేంకటేశ్వరుని బంటు అయినందువలన మంగాంబుధి అనే ఈ వూరిలో వెలసి లోకములోనే ఎదురులేని హనుమంతుడు ఈ స్వామి అనిపించాడు.

**3-5**

## మున్నుడి

జ్ఞానులకు మోక్ష సాధనకు మార్గమేది? అమృతం యెక్కడ వున్నది? సుఖము అనేది యెక్కడ వున్నది? వేదాంతులను, భక్తులను నిరంతరం వేదించే ప్రశ్నలే ఇవి. వీటికి ఇదమిత్థంగా జవాబు చెప్పటం కూడా కష్టమే. కాని అతి సులువుగా అన్నమాచార్యులవారు ఈ ప్రశ్నలకి జవాబిస్తున్నారు. వృద్ధాప్యంలో నున్న ఆచార్యులవారి ఆలోచనల జలపాతం ఎంత గొప్పగా వున్నదో గమనించండి. వైష్ణవం స్వీకరించి ముద్రాధారులైన వారికి సర్వం శ్రీహరే.

**తే॥ తెలిసియున్న వారల కిదే తెరువు సుండి!!**
**లేదు మరియొక మార్గంబు వెదకి చూడ**
**నళినదళ నేత్రు పొగడెడి నామమందె**
**ఉన్నదనినారు దృఢముగా నన్నమయ్య**

**రాగం : బౌళి**

తెలిసిన వారికి-తెరువిదే మరి లేదు
నళినాక్షు బొగడెడి-నామములో నున్నది ॥తెలిసిన॥

ఆకసాన లేదు మోక్ష-మటు పాతాళమున లే
దీకడ భూలోకమందు-యెందు లేదు
పైకొని ఆసలెల్ల-పారదోలి వెదకితే
శ్రీకాంతు బొగడేటి-చిత్తములో నున్నది ॥తెలిసిన॥

సురలవద్దలేదు-సోదించ నమృతము
సరి దిక్కులందు లేదు-జలధిలో లేదు
శరణాగతుల పాద-జలములు చేర్చుకొనే
హరిదాసుల బూజించే-అరచేత నున్నది ॥తెలిసిన॥





రాజసాన సుఖమేది-రాసికర్మమందు నేది
వోజతోడ నియతుడై-వుండినా నేది
సాజాన శ్రీవేంకటేశ-సరిముద్రలు ధరించే
తేజముతో విజ్ఞాన-దేహములో నున్నది ॥తెలిసిన॥

**భావామృతం :**

నరులారా! తెలిసినవారికి (జ్ఞానులకు) తెరువిదే (మార్గం ఇదే) మరిలేదు. (ఇంకొకటి లేదు). ఇది (మోక్షము) నళినీ కాంతుని (శ్రీకాంతుడైన శ్రీహరిని) పొగడెడి (కీర్తించెడి) నామములోనే (నామసంకీర్తనములో) నున్నది. ఇంకా మరిదేనిలోనూ లేదు.

ఓ మానవులారా! మోక్షమనేది ఎక్కడో ఆకాశంలో లేదు. అటు పాతాళలోకంలోనూ లేదు. పోనీ ఇక్కడే భూలోకంలో వున్నదా అంటే అదీ నిజం కాదు. మరెక్కడున్నది? ఆక్రమించుకొని భ్రమింపజేసే 'ఆశ' లను విడనాడి వెదకితే రమాకాంతుని ఏ మనస్సు కీర్తిస్తుంటుందో ఆ స్వామి ఆ మనస్సులోనే వుంటాడు.

ప్రజలారా! సాగరమధనం చేసి అమృతం పొంది దేవతలు అమరులు అయినారని విన్నాం. కాని అమృతం దేవతలవద్ద వున్నదనుకొంటున్నారా? వెతికి చూస్తే అది వారివద్దలేదు. సరిసంఖ్యలోనున్న దిక్కుల యందు వున్నదా? లేదు. అనంతమైన సముద్రంలో వున్నదా? లేదు. మరెందులో వున్నది? శ్రీహరిని శరణుజొచ్చినవారి పాదజలములతో పవిత్రులైన వారిని పూజించే అరచేతులలో వున్నది.

ఓ భక్తులారా! నిజమైన సుఖము యెక్కడ నున్నదో తెలుసునా? రాజభోగములనుభవించు నృపతులవద్ద లేదు. కర్మిష్ఠులు చేసే కర్మలయందు లేదు. ఉత్సాహముతో నియమపాలకుడై నిష్టాగరిష్ఠుడై వుంటే సుఖమున్నదా అనుకోడానికి లేదు. శోభతో నున్న ఓ శ్రీవేంకటేశ్వరా! శంఖ చక్ర ముద్రలు ఇరు భుజములపై ధరించి తేజస్సుతో వెలుగొందే విజ్ఞానులైన వారి దేహములలో వున్నది.

**3-6**

## మున్నుడి

ఇది గీర్వాణ భాషలో అన్నమాచార్యులవారు చేసిన చక్కని భజన. శ్రీమన్నారాయణునిపై ఆయన అసంఖ్యాకమైన భజన కీర్తనలు చెప్పారు. శ్రీహరి భక్తుల కత్యంత ప్రీతిపాత్రం స్వామి భజన. 'భవ్యనిర్మల పాదపంకజ' అంటే శుభప్రదమైన మలినములేని పాదపద్మములు గల స్వామియని అర్థం. 'పరమ పరాత్పరు'డంటే శ్రేష్ఠులలోకెల్ల అత్యంత శ్రేష్ఠుడని అర్థం. ఈ పదములను మనం నిత్యం వాడుతూనే వుంటాం. కాని పట్టుకొని అర్థం చెప్పమంటే... ఇబ్బంది పడతాం.

**కం॥ నందుని నందనుడీతడు**
**మందర గిరిధరుడు తొల్లి మధుసూదనుడున్**
**సుందరుడు వేంకటేశుడు**
**అందముగా నన్నమయ్య హరిభజియించెన్**

**రాగం : బిలహరి**

మందరధర మధుసూదన
నంద గోపనందనా ॥మందర॥

నరసింహ గోవింద నవనీతానంద
హరి ముకుంద నయనారవిందా
కరివరద గరుడగమనరూప
గురుచాపా యదుకుల దీపా ॥మందర॥

భవదూర భయహర పరిపూర్ణామృత
భువనపాలన సురపాలన
భువనభూషణ పరమపురుష పురాతన
నవభోగా కరుణాయోగా ॥మందర॥





పంకజాసననుత భవ్యనిర్మలపాద
పంకజ పరమ పరాత్పర
వేంకటశైలనివేశ శు-
భంకరా క్షేమంకరా ॥మందర॥

**భావామృతం :**

క్షీరసాగర మథనము వేళ కూర్మావతారంలో మందర పర్వతమును నీ వీపుపై వహించి అమృత సాధనకు తోడ్పడిన దేవదేవా! నీకు వందనము. మధు అను రాక్షసుని మర్దించిన ప్రభూ! వందనము. నందగోపుని నందనుడివై (పుత్రుడివై) అనుగ్రహించిన గోపాలా! నీకు జయము.

ఓ నరసింహావతారా! ఓ గోవిందా! వెన్నతినుటయందు మిక్కిలి ప్రీతి కలిగిన దేవా! ఓ శ్రీహరీ! ముకుందా! పద్మనయనా! గజేంద్ర రక్షకా! గరుత్మంతుడు వాహనమైనవాడా! రూపము కలవాడా అనగా శ్రీరామచంద్రా!) యదువంశమునకు దీపము వంటి మహానుభావా! నీకు నమస్కారములు.

ఓ భవదూరా! (పుట్టుకలేకుండ చేయు ప్రభూ!) భయమును నిర్మూలించువాడా! సంపూర్ణ అమృత స్వరూపా! పదునాల్గు భువనములకు ఏలికయైనవాడా! దేవతలను కాపాడు దేవదేవా! విశ్వమునకు అలంకారమైన ప్రభూ! ఓ పురుషోత్తమా! ఓ సనాతనా! విశిష్టమైన భోగములను ప్రసాదించు వాడా! అందరికీ కరుణ ప్రసాదించు సర్వోత్తమా! నీకు అనేక వందనములు.

బ్రహ్మదేవునిచే సన్నుతింపబడు ప్రభూ! శుభప్రదమైన నిర్మలం పాదపద్మములుగల స్వామీ! శ్రేష్ఠులలోకెల్ల అత్యంత శ్రేష్ఠుడా! స్వామీ! శ్రేష్ఠులలో కెల్ల అత్యంత శ్రేష్ఠుడా! శ్రీవేంకటగిరి నిలయా! అనేక శుభములను ప్రసాదించు దేవా! సర్వులకు రక్షణ కల్పించు బాధ్యత స్వీకరించిన శ్రీమన్నారాయణా! నీకు శతకోటి వందనములు.

**3-7**

## మున్నుడి

రఘుకుల తిలకుడైన శ్రీరామచంద్రునిపై అన్నమాచార్యుల వారు చెప్పిన చక్కటి కీర్తన ఇది. మనుజరూపమున మనియెడి (జీవించిన), బ్రహ్మము (పరబ్రహ్మ స్వరూపం) అని కీర్తిస్తున్నారు. "మరగిన సీతా మంగళ సూత్ర"ముల శ్రీరాముడు. మరగిన అంటే వేడిచేసి మరగబెట్టడం అనుకోకండి. జానకికి తాళిగట్టిన భర్తగా మరగిన (పరిచయమైన) వాడు అని అర్థం. వికసించిన శ్రీవేంకట (గిరి) నిలయుడే శ్రీరాముడట. ఆ..హా...

**చం॥ కొలచిన వారలందరికి కొంగునగట్టిన పైడి యీతడున్**
**బలిమిని మోక్షదాతయని బ్రహ్మముతానని సన్నుతించుచున్**
**చెలువముతోడ గొల్చెనిటు శ్రీగిరి వాసుని శ్రీనివాసునిన్**
**నళిని దళాక్షుడైన తిరునాయకుడే రఘురాముడంచనెన్**

**రాగం : కాంభోజి**

కొలిచిన వారల కొంగుపైడి ఇతడు
బలిమి తారక బ్రహ్మమీతడు ॥కొలిచిన॥

ఇనవంశాంబుధి నెగసిన తేజము
ఘనయజ్ఞంబుల గల ఫలము
మనుజ రూపమున మనియెడి బ్రహ్మము
నినుపుల రఘుకుల నిధానమితడు ॥కొలిచిన॥

పరమాన్నము లోపలి సారపు చని
పరగిన దివిజుల భయహారము
మరగిన సీతా మంగళసూత్రము
ధరలో రామావతారం బితడు ॥కొలిచిన॥





చకిత దానవుల సంహార చక్రము
సకల వనచరుల జయకరము
వికసితమగు శ్రీవేంకట నిలయము
ప్రకటిత దశరథ భాగ్యంబితడు ॥కొలిచిన॥

**భావామృతం :**

ఈ శ్రీరామచంద్రుడు తనను సేవించిన వారికి కొంగుపైడి (పంచె లేక చీరె కొంగులో కట్టి దాచిపెట్టిన బంగారం). అంటే ఎక్కడికో వెళ్లి ఎంతో ప్రయత్నంతో స్వాధీనం చేసికొనే భాగ్యం కాదు. మన ఆధీనంలో మన దగ్గరే ఉన్న బంగారం. మోక్షము నొసగే ఘనమైన పరబ్రహ్మ స్వరూపం, ఈయన.

సూర్యవంశార్ణవమున వర్ధిల్లిన తేజస్వరూపము ఈ శ్రీరాముడు. ఘనమైన పుత్రకామేష్టి యాగము వలన ప్రాప్తించిన ఫలము ఈయన. మనుష్యుని రూపములోనున్న పరబ్రహ్మయే ఈ రాఘవుడు. ఈయన రఘుకులమున నిండిన నిధానము (పాతరవంటివాడు).

యజ్ఞపురుషుడిచ్చిన పాయసము లోపలి సారముతో కూడిన మాధుర్యము ఈ శ్రీరాముడు. భయ విహ్వలులైన దేవతల అభయ ప్రదాత. జానకీదేవికి తాళిగట్టిన ఈయన సుపరిచితుడు. భూమినవతరించిన శ్రీమన్నారాయణుని రామావతార మీ స్వామి.

శ్రీరాముడు బాణములు ప్రయోగించే వేగం ఎంతటిదంటే ఆయన అంబులపొదిలో నుంచి బాటంతీసి వింటికి సంధించి లక్ష్యంపై ప్రయోగించి అదిలక్ష్యాన్ని ఛేదించడం, కంటికి కనబడదట. (ఈనాటి పరిభాషలో మైక్రో సెకండు లోపల అయిపోతుందన్నమాట), అంతవేగంతో ఆయన రాక్షస సంహారం (ఖరదూషణాదులను) చేశాడు. తండోపతండాలుగా నున్న వానరసేనకు ఈయన జయరాముడు. వర్ధిల్లిన శ్రీవేంకటాద్రి నిలయముగా నున్న శ్రీవేంకటేశ్వరుడు కూడ ఈ రఘుపతియే. ఈయన దాశరథిగా ప్రకటించబడి జగద్విఖ్యాతుడైనాడు, అందరి భాగ్యం అయినాడు.

**3-8**

## మున్నుడి

సృష్టి స్థితిలయంలను నిర్వహించే పరమాత్ముని వైభవం వర్ణిస్తున్నారన్నమాచార్యులవారు. గొప్ప, కొద్ది అనే తారతమ్యాలు పరమాత్మకు లేవు. భూమ్మీద గోకులంలో గోపెమ్మయైన యశోదకు గారాల కూచి ఇతడే. సత్యలోకంలో సృష్టికర్తయైన చతుర్ముఖ బ్రహ్మగారికి తండ్రి, సూర్యచంద్రులకు కాంతినిచ్చినవాడు, తన వూపిరిలోంచి వేదములను పుట్టించినవాడు, అవి నీటి పాలైతే (నీటగు) రక్షించాడు. మావంటి శరణు జొచ్చిన అనాథలకు నాథుడు, అంగము (దేహము) నిచ్చినవాడు సర్వాత్మయైన ఈ వేంకటేశ్వరుడే.

**ఉ॥ చేరియశోదకున్ శిశువు చింతన జేయచు యెంచి జూడగా**
**ధారుణి, బ్రహ్మదేవునకు తండ్రియునీతడు సూర్యచంద్రులన్**
**తీరుగ జిన్నబుచ్చుఘన తేజుడు, పాడెను అన్నమార్యుడున్**
**కోరిక తీర శ్రీహరిని గొల్చెడి కీర్తన తేనెజల్లురా.**

**రాగం : మోహన**

చేరియశోదకు శిశువితడు
ధారుణి బ్రహ్మకు తండ్రియు నితడు ॥చేరి॥

సొలసి చూచినను సూర్యచంద్రులను
లలివెద చల్లెడి లక్షణుడు
నిలిచిన నిలువున నిఖిల దేవతలు
కలిగించు సురల గనివో యితడు ॥చేరి॥

మాటలాడినను మరియజాండములు
కోటులు వొడమేటి గుణరాశి
నీటగు నూర్పుల నిఖిల వేదములు
చాటువ నూరేటి సముద్ర మితడు ॥చేరి॥





ముంగిట పొలసిన మోహన మాత్రల
పొంగించే ఘన పురుషుడు
సంగతి మావంటి శరణాగతులకు
నంగము శ్రీవేంకటాధిపు డితడు ॥చేరి॥

**భావామృతం :**

ఈ ఆదిదేవుడే భూమ్మీద చేరి (అవతరించి) యశోదకు శిశువు (పాలుతాగే పాపాయి) యైనాడు. మరి ఈయనే సత్యలోకంలో బ్రహ్మదేవునికి తండ్రి అయినాడు.

బాగుగా ప్రయత్నించి కనుగొంటే సూర్యచంద్రులకు, కాంతిని ప్రసాదించిన విలక్షణుడీయన. దేవతలందరికీ నిలిచి దిక్కై, గని వలె నిరంతరం అండగా నిలిచినవాడు ఇతడే. అందుకే ఈయన దేవదేవుడైనాడు.

పరమాత్ముడైన ఈయన మాట్లాడితే ఆ మాటలలోనుంచి సమస్త విశ్వము ఉద్భవించింది. గుణములన్నీ ఈయనలోంచే పుట్టాయి. సోమకాసురుడు వేదములన్నింటిని సముద్రంలో దాచివేస్తే, నీటగు (నీటిపాలైన) ఆ వేదములనన్నింటినీ రక్షించి, తన ఊపిరిలో నిలుపుకొని, లోకానికి చాటించి వాటిని నూరేట్లు చేశాడు. (అంటే వేదములు వ్రాతలో కాక వల్లెవేసి కంఠతాపట్టేట్లు వేదపండితుల 'నియమించి' సముద్రము వలె నిరంతరం ఉండేట్లు నిలిపాడు).

ముంగిట పొలసిన (ఎదురుగా ప్రకటించబడిన) మోహనము, ఆత్మతత్త్వము మొదలైన విద్యలను సగర్వంగా వెలయించిన పురుషోత్తముడు ఈ మహానుభావుడు. ఇక వీటన్నిటినీ మించి, మాబోటి శరణార్థులకు సంగతియై (సమీపించి) ఈ శ్రీవేంకటేశ్వరుడే అంగము (ప్రాణమున్న దేహము) అయినాడు. మా అంగరక్షకుడే కాదు, జీవనాధారము కూడా ఈ ఏడుకొండలవాడే.

**3-9**

## మున్నుడి

తొలినాళ్లలో అన్నమయ్య భావనాకాశంలో మెరిసి అలరించిన శృంగార కీర్తన అయివుంటుంది ఈపాట. అలమేలు మంగమ్మ విరహపు రాజుగారైన శ్రీవేంకటేశ్వరుడు విడిదికి (అమ్మవారి ఇంటికి) రాంగానే ఆమె సింగారములే స్వామికి వైభవములై అలరారినవట. ఒక విన్నపమేమంటే తళతళ మెరిసే వజ్రం సూర్యకిరణాలను ప్రతిఫలింపజేసి అనేక రంగుల కాంతి కిరణాలు వెదజల్లుతుంది. నేను నీలం అనుకొంటే, నీవు ఎఱుపు అనుకొంటావు. నేను భావించిందే అన్నమయ్య ఆలోచన అని చెప్పలేం...

**కం॥ విరహము రేపెడి రాజదె**
**దరిజేరగ సిరుల జేసె తరుణియు ఆపై**
**నెరపెను సింగారములను**
**పరవశుడై అన్నమయ్య పాడెను వినుడీ**

**రాగం : తోడి**

విరహపు రాజదె విడిదికి రాగా
సిరుల జేసె నిదె సింగారములు ॥ విరహపు ॥

నెలత నుదుటిపై నీలపు కురులనె
తొలుతనె గట్టెను తోరణము
మొలక చెమటులవె ముత్యపు ముగ్గులు
అలరించె మదనుండదె చెలిమేన ॥విరహపు॥

దట్టముగ ఇచింతాలతనే వడి
బెట్టి చప్పరము పెనగొనగా
పట్టినె మైతావులు పరిమళములు
కట్టించెను చెంగట వలరాజు ॥విరహపు॥





విందగు వేంకట విభుని ప్రేమచే
పొందగు (పొందుగ) బెట్టెను బోనాలు
ఇందువదనకి ఇందిరావిభునికి
కందుదేర నలుకలు చవిజేసె ॥విరహపు॥

**భావామృతం :**

విరహము ముప్పిరిగొనునట్లు చేయగల శ్రీనివాసుడు అలమేల్మంగమ్మ విడిదికి విచ్చేయగానే ఆమె సింగారములే స్వామి వారికి వైభవములైనవి, (సిరులజేసినవి). ఆ విశేషం వినండి.

స్వామివారు రాంగానే మొట్టమొదట ఆ జవ్వని నుదుటిపై నల్లని ముంగురులు స్వాగతం పలుకుతూ 'తోరణము' కట్టినవి. మన్మధుడు కలిగించిన అలజడి వల్ల మేనిపై కమ్మినట్టి లే చెమటలు ముత్యాల ముగ్గులై భాసిల్లినవి.

కిక్కిరిసిన చింతాలతనే (వలపు తీగెనే) పందిరి (చప్పరము) వలె పెనవేసుకొని శరీరపు మైపూతలు మదన తాపము పెంచి ఆయన యెట్టయెదుటనే వున్నంత అలజడి కలిగించుచుండెను. ఇక ఆమె ఆరాటము వర్ణించుటెట్లు?

విందైన శ్రీవేంకటేశ్వరుని ప్రేమలనే ఆ దేవి భోజనములుగా వడ్డించినది ఆ తరువాతఆ చంద్రవదనకు ఇందిరా రమణునికి మధ్య ప్రణయ కలహముల కందుదేరి (జాడ తెలియుగా) అవి ఆ స్వామి భక్తులకి చవిజేసినవి, (మధురమైన చవులూరించినవి). ఓ శ్రీవేంకటేశ్వరా! ఇంతకన్నా వివరించే శక్తి నాకు లేదు తండ్రీ!

## మున్నుడి 3-10

క్షణభంగురమైన జీవితం గురించి చక్కటి కీర్తనలో హెచ్చరిస్తున్నారు అన్నమాచార్యులవారు. అంతా హరిమాయ. చావు పుట్టుకలు సుఖదుఃఖాలు అన్నీ బూటకాలే. ఏవీ శాశ్వతం కాదు. ఆత్మజ్ఞానంతో వేంకటేశ్వరుడు అప్రతిహతుడని కొలిచినవారిని ద్వంద్వములు బాధించలేవు. ఇది నిజం.

**సీ॥ పుట్టెడి దంతయూ బూటకమే జుమ్మి!!**
**గట్టిదీ హరిమాయ కాననీదు**
**ముక్కున నుండెడి ముందటి ప్రాణంబు**
**ఏతీరు నమ్ముట ఇంకదాని**
**తోలు తిత్తిది యిందు తెలియని బ్రతుకాయె**
**గడుపుట యింకెట్లు కాలమెల్ల**
**ఆత్మలోనున్నది అఖిల జ్ఞానంబంత**
**కనుటెట్లు ఇక నేను ఘాతుకమును**

**ఆ.వె॥ శ్రీ తరుణి విబుడిని శ్రీవేంకటేశుని**
**కొలిచినాను నేను నిలిచి నాకు**
**అడ్డమగున దేది అన్నమయ్యనెనురా**
**ఏమి కీర్తనంబు!! ఏమి శైలి!!**

**రాగం : శివరంజని**

పుట్టెడిదింతా బూటకంబులే
గట్టిమాయ హరి కానగ నీదు ॥పుట్టెడి॥

ముక్కున నున్నది ముందట ప్రాణము
యెక్కడ నమ్మేదిక తనువు
చుక్కలు మోచీ చూపులెదుటనే
నెక్కొను మతికిని నిలుకడయేదీ ॥పుట్టెడి॥





నాలుక నున్నవి నానా రుచులును
వేళా వేళకు వెరవేదీ
తోలుననున్నది దొరకని బ్రతుకిది
కాలంబటువలె గడచేది ॥పుట్టెడి॥

ఆతుమ నున్నది అఖిల జ్ఞానము
ఘాతలు నెటువలె గనియేది
శ్రీతరుణీపతి శ్రీవేంకటపతి
ఆతని కొలిచితి అడ్డంబేది ॥పుట్టెడి॥

**భావామృతం :**

మానవుని పుట్టుక యెంత మాయతో కూడినదో ఆలోచించారా? ఇది వుక్కిరిబిక్కిరి చేసే 'హరిమాయ'. ఇది తెలుసుకొనే అవకాశాన్నివ్వదు. దీని నెరుగుట అసాధ్యం.

మనమందరం ప్రాణంతో వున్నట్లు యెదురుగా కనిపిస్తున్నా, ఈ ప్రాణం ముక్కున బెట్టుకొన్నట్లు వున్నది. లోపలికి పీల్చిన శ్వాస బయటకు రాకపోయినా, బయటకు వచ్చిన నిశ్వాస తిరిగి లోపలికి పోకపోయినా అంతే సంగతులు. ఇక దీనినెట్లా నమ్మేది? శరీరమన్నా వుండేదా అంటే, చుక్క పొడిచాక ఎదుటనున్నది కాదు. చుక్కలు పోయాక వుంటుందో లేదో తెలీదు. మనస్సు చూద్దామా అంటే నిలకడలేని చంచల స్వభావం కలది. వీటిని నమ్ముకొని నేనేం చేయగలను?

నా నాలుక నానారుచులు కావాలంటుంది. క్షణక్షణానికి దానికో క్రొత్తరుచి కావాలి. దానికి భయభక్తులే లేవు. నవరంధ్రములున్న ఈ తోలు సంచీలో బ్రతుకు గడుపుతున్నాను. ఏ రంధ్రం ఎప్పుడు మూసుకుపోతుందో తెలీదు. ఇట్లా ప్రతిక్షణమూ భయపడుతూ కాలం ఎట్లా గడిపేది? దీనికి గత్యంతరమేమిటి?

అనంతమైన, శాశ్వతమైన జ్ఞానము నా ఆత్మలో వున్నమాట నిజమే. కానీ నాపై నా మనస్సు మొదలైన ఇంద్రియాలు చేసే ఎదురు దాడిని ఎట్లా తట్టుకొనేది? దీని నెలా గమనించగలను? శ్రీలక్ష్మీపతియైన శ్రీవేంకటేశ్వరుడు శరణని కొలిచాను. ఇక సరి, నాకు అడ్డమే లేదు. నన్ను ఏ మాయా ఏమీ చేయలేదు.

**3-11**

## మున్నుడి

శ్రీవేంకటేశ్వరుని బ్రహ్మోత్సవం మొదలవుతోంది. బ్రహ్మగారిచే ప్రారంభించబడి, అన్నమయ్యచే అతిశయమంది, నేడు తిరుమల పాలకమండలిచే సంప్రదాయ బద్ధంగా కొనసాగుతున్న ఆ బ్రహ్మ వేడుకలను చూడటానికి ప్రజలు తండోపతండాలుగా వస్తారు. వయస్సుతోనూ, స్థితి గతులతోను, భాష, జాతి వర్ణములతోను నిమిత్తం లేదు వారికి. వారి వారి తాహతుకు తగ్గ కానుకలతో ముడుపులు తీసికొని వస్తున్నారు. అందరికీ కావలసింది ఒక్కటే. స్వామివారి కృప. సరిగ్గా ఐదు సెకన్లు లభించే ఆయన మూర్తి దర్శనానికే ఎంత ఆరాటం!!

**ఉ॥ వానలలోననే తడిసి వత్తురు చూడగ అన్నమయ్యనెన్**
**మానవులందరున్ కలిసి వారల కోర్కెల దీరనమ్మెయిన్**
**కానుకలన్ కరంబులను గైకొని గుంపుగ రాజుపేదలున్**
**పూనుచు వేంకటేశ్వరుని బ్రోవగ వేడుచు బ్రహ్మవేడుకన్**

**రాగం : ఆహిరి**

నానాదిక్కుల నరులెల్లా
వాలన లోననె వత్తురు గదలి ॥నానా॥

సతులు సుతులు సరిసరులు బాంధవులు
హితులు కొలువగా ఇందరును
శతసహస్రయోజనవాసులు సు-
వ్రతములతోడనె వత్తురు కదలి ॥నానా॥

ముడుపులు జాళెలు మొగి తలమూటలు
కడలేని ధనము కాంతలను
కడుమంచి మణులు కరులు తురగములు
వడిగొని చెలగుచు వత్తురు కదలి ॥నానా॥





మగటవర్ధనులు మండలేశ్వరులు
జగదేకపతులు చతురులును
తగు వేంకటపతి దరుశింపగ బహు
వగల సంపదల వత్తురు కదలి ॥నానా॥

**భావామృతం :**

నలుదిక్కులనుండి ప్రజలు వానలలో తడిసి ముద్దయిపోతూ కూడా కదిలి వస్తున్నారు. తండోపతండాలుగా ఈ బ్రహ్మోత్సవాలను సందర్శించటానికి వస్తున్నారు.

తమతమ భార్యలతోను, సంతానంతోను, తమ పరిసరాలలో నివసించే వారితోను, బంధువులతోను, హితులతోను, తమను సేవించే వారితోను కలిసి వస్తున్నారు.

వారంతా తమ ముడుపులు (ధనము, బంగారము ముడిచి దాచిన మూటలు) తీసికొని వస్తున్నారు. గుఱ్ఱములపై కొందరు, తమ తలమీద మూటలు మోస్తూ కొందరు, అంతులేని ధనరాసులతో కొందరు, స్త్రీలతోను (దాసీ జనములతో), బాగా శ్రేష్ఠమైన మణులతోను, ఏనుగులతోనూ, మంచి వేగముగల అశ్వములపైనను భక్త ప్రజలు తరలివస్తున్నారు. ఎంత అద్భుతంగా వున్నది ఆ దృశ్యం!!

సామంతరాజులు, వీరాధివీరులు మండలాధిపతులు, రాజులు, చక్రవర్తులు, చతురత కలిగినవారు శ్రీవేంకటేశ్వరుని దర్శించుటకు అనేకమైన విలాసములతో కొందరు, అనేకమైన సంపదలతో కొందరు వచ్చెదరు.

ఆనాడే కాదు ఈనాడు జరుగుతున్నది ఇదే. కానీ... ఈ తారతమ్యాలన్నీ మనకే కాని ఆ వేంకన్నకు అందరూ ఒకటే... అవునా?

**3-12**

## మున్నుడి

కంభము (స్తంభము) నుండి వెలువడి ఘనుడైన నరసింహుడు హిరణ్యకశిపుని సంహరించి ప్రహ్లాదుని రక్షించాడు. భయంకరమైన ఆ రూపాన్ని ఈ కీర్తనలో అన్నమాచార్యులవారు వర్ణిస్తున్నారు. నమ్మిన భక్తునిగాచే నరసింహుని రౌద్రాకారాన్ని ఆయన చేసే భీభత్సాన్ని వర్ణిస్తున్నారు. ఆ భీభత్సాన్ని కీర్తనలో దర్శింపచేయటం అనితర సాధ్యం. దేవతలు ఆదిలక్ష్మీ కూడ గడగడ వణికిపోయారు. ప్రహ్లాదుని స్తుతి తనను శాంతపరచగా దేవతల భయం తీర్చి, శ్రీలక్ష్మికి తన అంకెమున చేరిక ననుగ్రహించారట స్వామి.

**మ॥ వెడలెన్ కంభమునుండి రౌద్రుడగుచున్ భీతిల్లగా దేవతల్**
**అడిచెన్ దైత్యుని చీల్చివాని వుదరంబానారసింగం బహో!!**
**మెడలోపేగులు దాల్చెజందెమటులన్, వేనోళ్ల కీర్తించెరా**
**విడువన్ జాలడు అన్నమయ్య తలచెన్ వేంకన్న నా స్వామిగా**

**రాగం : హరి కాంభోడి**

కంభమున వెడలి ఘన నరసింహము
కుంభిని హిరణ్యు గూలిచెను ॥కంభము॥

తొడికి దైత్యు తన తొడపై దిగిచి
కడుపు చించి రక్తము చల్లి
జడియక పేగులు జందెంబులుగా
మెడ దగిలించుక మెరసీ వాడే ॥కంభము॥

పెదవులు చింపుచు పెనుగోళ్ళనదిమి
వుదుటు పునుకకొరి కుమియుచును
సదరపు గుండెలు చప్పరించుచును
మెదడు గందముగ మెత్తీవాడే ॥కంభము॥





దేవతల భయము దీర్చి అంకెమున
శ్రీవనితను కృపసేయుచును
పావనపు టహోబల గిరిదైవము
శ్రీవేంకటగిరి చెలగీవాడే ॥కంభము॥

**భావామృతం :**

ఘనుడైన ఆ ఉగ్రనరసింహుడు స్తంభమునుండి వెలువడి భూమిపై హిరణ్యకశిపుని అతి భీకరంగా సంహరించాడు. ఆ వివరం వినండి.

ఆయన ఆ రాక్షసుని తొడికి (ఒడిసి బట్టుకొని) తన తొడపై పెట్టుకొని (దిగిచి), వాని కడుపును చించి వేశాడు. అప్పుడు వాని రక్తం వెదజల్లబడింది. ఆ నృసింహుడు ఏమాత్రము జడియక (చలించక) వాని పేగులను తన జందెముగా వేసికొనినాడు. కొన్ని తన మెడలో హారంలాగ ధరించాడు. వాడిని చూశారా భీకరంగా మెఱసిపోతున్నాడు.

ఇంకా ఏం చేశాడో చూశారా! ఆ దానవుని యొక్క పెదవులను తన పెద్ద పెద్ద గోళ్లతో అదిమి చీల్చివేశాడు. వాడి కపాలంమీద (పునుక) ఒక్క వుదటున (అమాంతం) కుమ్మినాడు. సదరు గుండెలలోనుంచి వచ్చిన రక్తాన్ని చప్పరించాడు. వాడి మెదడును బయటకు లాగి గంధములాగ మెత్తుకున్నాడు. బాబోయ్! ఎంత భీకరంగా వున్నాడో చూడండి. అప్పుడేం జరిగిందో తెలుసా? దేవతలే కాక, అమ్మవారు శ్రీలక్ష్మికూడా భయంతో గడగడా వణికిపోయారు. ప్రహ్లాదుడు కూడా తాళలేక వణికిపోయి ఆయనను కీర్తించాడు). కరుణాంతరంగుడైన ఆ స్వామి కరిగి పోయాడు.

ఆయన దేవతల భయమును తీర్చి ఆదరించాడు. శ్రీలక్ష్మి అమ్మవారిని కృపజూచి తన అంకెము (చేరిక) ను అనుగ్రహించి ఆ దేవిని కూడి పుణ్యనిలయమైన అహోబల గిరి మీద వెలసి అందరినీ రక్షించాడు. ఆ మహానుభావుడే శ్రీవేంకటాద్రిపై నెలకొన్న శ్రీవేంకటేశ్వరుడు కూడా. ఆయన శరణు పొందండి.

**3-13**

## మున్నుడి

అన్నమాచార్యులవారు ఆనాడు ఆదిదేవునికి అమలుజేసిన నిత్య కళ్యాణ సేవ నేటికీ ఆ విధంగానే కొనసాగుతున్నది. అటువంటి ఒక కళ్యాణ మహోత్సవంలో అన్నమయ్య స్వయంగా పాడి పేరంటాండ్లను, దేవతలను, మునులను పిలుస్తున్నారు. రండర్రా! బంగారు అక్షింతలు పట్టుకొని దేవుని పెండ్లిని చూడటానికి రండి. వేంకటేశ్వరుడు అలమేల్మంగమ్మా తలంబ్రాలు పోసికొంటున్నారు, పరుగు పరుగున రండి బోలెడు వరాలిస్తారు మీకు. రండి, రండి... త్వరగా...

**ఆ.వె॥ పసిడి అక్షతలను పట్టరో! వడిరారొ!**
**వేంకటేశుడాయె పెండ్లికొడుకు**
**అమ్మలక్ష్మి వధువు అన్నమార్యుని గీతి**
**తేనెలూరు మనసు తేలిపోవు.**

**రాగం : శంకరాభరణం**

పసిడియక్షింతలివె పట్టరో వేగమే రారో
దెసల పేరంటాండ్లు దేవుని పెండ్లికిని ॥పసిడి॥

శ్రీవేంకటేశ్వరునికి శ్రీమహాలక్ష్మికి
దైవికపు పెండ్లి ముహూర్తము నేడు
కావించి భేరులు మ్రోసె గరుడధ్వజంబెక్కె
దైవతలు రారో దేవుని పెండ్లికిని ॥పసిడి॥

కందర్పజనకునికి కమలాదేవికిని
పందిరి లోపల తలబాలు నేడు
గంధము విడెమిచ్చేరు కలువడాలు గట్టిరి
అందుక మునులు రారో హరి పెండ్లికిని ॥పసిడి॥





అదె శ్రీవేంకటపతికి అలమేలు మంగకును
మొదలి తిరునాళ్లకు మొక్కేము నేడు
యెదుట నేగేరు వీరె యిచ్చేరు వరములివె
కదలిరారో పరుషఘనుల పెండ్లికిని ॥పసిడి॥

**భావామృతం :**

నానాదిక్కులనున్న పేరంటాండ్లూ! త్వరగా పరుగుపరుగున రారేమర్రా! దేవుని పెండ్లి జరుగుతున్నది. బంగారు అక్షింతలను చేతిలో ధరించి వచ్చేయండి.

శ్రీవేంకటేశ్వరునికి, శ్రీమహాలక్ష్మికి ఇక్కడ దైవజ్ఞులు నిర్ణయించిన పెండ్లి ముహూర్తము నేడే కాబట్టి దుందుభులు మ్రోగుతున్నాయి. గరుడధ్వజము (గరుత్మంతుడు మోయుచున్నట్లు చేయబడిన ధ్వజస్తంభము) నిటారుగా లేచియున్నది. ఓ దేవతలారా! దేవుని పెండ్లికి పిలువ నవసరంలేదు. మీరూ విచ్చేయండి.

ఇక్కడి పెండ్లికొడుకెవరో తెలుసా? స్వయంగా మన్మధునికే తండ్రిగారైన నారాయణుడు. పెండ్లికూతురు కమలాదేవి. వాళ్లు పెద్ద పందిరికింద పెండ్లి తలంబ్రాలు పోసికొనుచున్నారు. ఓ మునులారా! మీరంతా విచ్చేయండి. ఇప్పుడే గంధము, తాంబూలము ఇస్తున్నారు. కలువడాలు (ధ్వజస్తంభముపై వ్రేలాడగట్టు కలువపూలదండ) కట్టారు. త్వరగా దయచేయండి. జాగు చేయకండి.

అదిగో శ్రీవేంకటపతికి, అలమేలు మంగకు జరుగుచున్న మొదటి తిరునాళ్ళు (దేవుని మహోత్సవము) ఇది. నేడు మీరంతా మ్రొక్కండి. ఎదురుకోలు (ఆడపెండ్లివారు మొగపెండ్లివారిని ఎదురు వెళ్లి ఆహ్వానించుట జరుగుతోంది) మనమంతా అమ్మవారి చుట్టాలం ఆడపెళ్లివారం. మనందరికీ వరుడు కానుకలిస్తాడు. కావలసిన వరాలు కోరుకుందాం. కదలిరండి. పరుష ఘనుల పెండ్లికి (బహుశా పురుష ఘనుని పెండ్లికి అయి వుంటుంది) అనగా పురుషోత్తముని వివాహానికి కదలిరండి.

**3-14**

## మున్నుడి

వైష్ణవ మతదీక్ష స్వీకరించిన అన్నమయ్య ఆ మత వ్యాప్తికి ఎంతో కృషి చేశారు. ఆయన అన్నమాచార్యులై వైష్ణవ వైశిష్ట్యం ఎన్నో కీర్తనలలో కొనియాడారు. ఇదీ ఇటువంటి కీర్తనే. ఆ గురువులకి నిరతితో (మిక్కిలి ఆసక్తితో) మ్రొక్కుతారు. అదే భాగ్యమంటే అని పాడుతున్నారు. బ్రహ్మపదవి ఇచ్చినా మేరు,పర్వతం (బంగారు కొండ) ఇచ్చినా వాళ్లకి కోట్లాది వైష్ణవుల సంగము తప్ప అన్యం అక్కరలేదట. శ్రీవేంకటేశ్వరుని శరణాగతియే వారి తుదిపదము (అంతిమలక్ష్యం) అంటున్నారు.

**తే॥ పరమ వైష్ణవులందరి భాగ్యమిదియె**
**నిరతి మ్రొక్కెద వారికి నిత్యమేను**
**ఉల్లమున వేంకటేశుని ఉన్నతముగ**
**దాల్చి శరణు కోరెదననె 'తాళ్ళపాక'**

**రాగం : షణ్ముఖ ప్రియ**

పరమవైష్ణవుల భాగ్యం బిదివో
నిరతి వారలకె నే మ్రొక్కెదను ॥పరమ॥

తలచరొకప్పుడు ధరణి భోగములు
తలచరితర మతదైవముల
తలతు రొకటి హరిదాసుల దాస్యము
తలపు మోక్షముల తగులమి(మె)గాన ॥పరమ॥

కోరరు బ్రహ్మాది గురుతర పదములు
కోరరు మేరువు కొన సుఖము
కోరుదురు తదియ్య కోట్ల సంగము
కోరిక భక్తితో గూడీగాన ॥పరమ॥





వొల్లరు కర్మములు ఒల్లరు పుణ్యములు
వొల్లరహంకార మొకపరియు
వుల్లము శ్రీవేంకటోత్తము శరణని
యెల్లందు తుదిపద మెక్కిరిగా ॥పరమ॥

## భావామృతం

వైష్ణవ దీక్షా తత్పరులైన వారి భాగ్యమే భాగ్యము. ఇదిగో నేను వారికి నిరతితో (మిక్కిలి ఆసక్తితో) మ్రొక్కెదను. ఆ విధంగా నేను కూడా తరించెదను.

వారు ఒక్కసారికూడా ఇహములోని భోగముల గురించి ఆలోచించరు. పరాయి మతం గురించిగానీ ఆ మతం ప్రబోధించే దైవముల గురించి గానీ ఆలోచించరు. వారు తలచేది ఒక్కటే, హరిదాసులైన వారికి దాస్యము చేయుట. ముక్తి, మోక్షము వంటి ఆలోచనలు వారికి తగులమే (ప్రతిబంధకమే).

ఆ పరమవైష్ణవులకు బ్రహ్మత్వం వంటి పదములు కూడా వ్యర్థమే. వారికి మేరు పర్వతంలాంటి బంగారు కొండను ఇచ్చినా తృణీకరిస్తారు. వారు కోరేది కోట్లాది వైష్ణవ భక్తుల సాంగత్యం మాత్రమే భక్తితో వారి కలయికనే ఆపేక్షిస్తారు.

పరమవైష్ణవులైన ఆ మహానుభావులు ఏవేవో కర్మల ద్వారా మోక్షం వస్తుందంటే ఒప్పుకోరు. పుణ్య కార్యాలు చేసి ముక్తి పొందుట సాధ్యంకాదు అంటారు. (పుణ్యం స్వర్గప్రాప్తి, విశిష్టమైన జన్మనిస్తుంది, అంతే) కించిత్తు అహంకారం కూడా వారు ఒప్పరు. చిత్తమును శ్రీవేంకటేశ్వరునిపై లగ్నం చేసి శరణు బొందిన వారికి ఎక్కడనైన చివరికి తుదిపదమైన విష్ణుసాంగత్యమే దక్కింది కదా! (అటువంటి పరమవైష్ణవునికి విష్ణువే తనదగ్గర చోటిస్తాడు. వారు కోరనక్కరలేదు.

**3-15**

## మున్నుడి

శ్రీకృష్ణుని ఆగడాలు భరించలేక గోపెమ్మలు యశోద దగ్గరకు వచ్చి మొత్తుకుంటున్నారు. కొన్ని పదాలు నేటి తెలుగు భాషలో వాడుకలో లేవు. వాటిని ఆ సందర్భాన్ని బట్టి 'భావించుట' కన్నా చేయలేకపోయాను. ఉదాహరణకి 'కంచపుటుట్లు' అనే మాట. ఉట్టి అంటే పాలు, పెరుగు, నెయ్యి దాచటానికి త్రాటితో ఎత్తుగా వ్రేలాడ కట్టిన బంధనం అని ఇదివరలో విన్నాం. మరి 'కంచపుటుట్లు' అంటే... ఉట్టిలో కంచము బిగించి కట్టిన ఉట్టి. దాంట్లో మట్టికుండలు కూడా భద్రంగా వుంటాయి కాబోలు. ఇది నాభావన. అన్నమయ్య వాడిన పదాలకోసం ఒక పదకోశము కావాలి. పెద్దలు ఆ ప్రయత్నంలోనే ఉన్నారు.

**మత్తకోకిల:చూడవమ్మ! యశోద! చూడవె సుంత న్యాయము జేయుమా**
**వాడవాడల వెల్లువాయెను వాగులాయెను చూడుమా**
**వీడి అల్లరి సైపజాలము పేరినేతుల చోరుడే**
**పాడి అన్నయ కృష్ణలీలలు బాగుగా వినిపించెరా.**

**రాగం : మిశ్రమాళవగౌళ**

చూడవమ్మ యశోదమ్మ
వాడల వాడల వరద లివిగో ॥చూడవమ్మ॥

పొంచి పులివాలు పెరుగు
మించు మించు మీగడలు
వంచి వారలు వట్టిన
కంచపుటుట్లు కాగులివిగో ॥చూడవమ్మ॥

పేరీ పేరని నేతులు
చూరల వెన్నల జున్నులను
ఆరగించి యట సగబాళ్లు
పారవేసిన బానలివిగో ॥చూడవమ్మ॥





తెల్లని కనుదీగెల సోగల
చల్లలమ్మేటి జవ్వనల
చల్లినట్లనే శ్రీవేంకటపతి
కొల్లలాడిన గురుతులివిగో ॥చూడవమ్మ॥

### భావామృతం

ఓ యశోదమ్మా! ఇదిగో... ఇటు చూడవమ్మా! వాడల వాడల (ప్రతి పేటలోనూ) వరదలై పొర్లి పారుతున్నా ఈ పెరుగు, పాలు, నెయ్యి చూశావా? ఇదంతా ఎవరి ఘనకార్యం అనుకున్నావు? (మీ అల్లరి పిల్లాడు కృష్ణయ్యవే) ఈ వివరం వినవమ్మా!

పొంచియున్న పులి దూకినట్లు పెరుగు కాగుల మీద దూకుతాడు. వాటిలో బాగుగా మీగడలు కట్టిన పెరుగును వదలడు. మేము ఆ కాగుల్ని క్రిందకూడా పెట్టలేదు. ఎత్తుగా కంచములతో బిగించిన వుట్లలో అమర్చిన కాగుల్లో దాచుకొన్నాం. వారలు (మీ కృష్ణుడు, వాడి అల్లరిమూక) అట్లా పెట్టుకొన్న కాగుల్ని వంచి అన్నీ నేలపాలు చేశారు. ఏమిటమ్మా! ఈ ఆగడం?

బాగుగా పేరిన నెయ్యి అయితే పారబోయలేదు అనేమో కానీ, మీవాడు పేరీపేరని నెయ్యి (ఇంకా గట్టిపడని నెయ్యి) ని, కొల్లగొట్టిన వెన్నలను జున్నులను సగంతిని సగం పారబోస్తాడు. వాడి అఘాయిత్యానికి సాక్ష్యంగా వున్న ఈ బానల్ని చూడవమ్మా! దీనికి నీ సంజాయిషీ ఏమిటి? చెప్పవమ్మా!

సరే ఇవన్నీ ఒక యెత్తయితే మీవాడు మాకన్నె పిల్లల్నేం చేశాడో చూశావా? ఇదిగో చూడు. తెల్లని సోగకన్నులున్న జవ్వనులు (యువతులు) మధురానగరంలో చల్లలు అమ్ముకోడానికి పోతుంటే వదిలిపెట్టడు (అవ్వ!! చెప్పుకొంటే సిగ్గుచేటు)ఇదిగో శ్రీవేంకటపతి అయిన మీవాడు వాళ్లను కొల్లలాడిన (చెఱచిన) గుర్తులు చూడు. చిందరవందరగా నున్న వీళ్లని చూస్తే తెలీటం లేదూ? మీవాడి ఘనకార్యం? ఇంకేం చెప్తావు? (యశోదకు ఒళ్లు ఎంతమండిపోయి వుంటుందో వూహించండి...)

**3-16**

## మున్నుడి

అన్నమయ్య పెద్దకుమారుడు పెద తిరుమలాచార్యుల వారు చెప్పిన రమణీయమైన భజన ఇది. అనునిత్యం వేలాది భక్తులు గానం చేసి తరిస్తున్న చక్కటి కీర్తన. భాష సంస్కృతం కావటం వలన మనం చెప్పుకొన్న విభక్తిని బట్టి అర్థం మారుతుంది. ఉదాహరణకి ఈ కీర్తనలో "దినకర సన్నిభ దివ్యాభరణా". "దినకర సన్నిభ' అనే మాట ఆభరణాలకు అన్వయించుకోవాలి. అంతేకాని స్వామికి కాదు. ఎందుకంటే దినకరుని తేజం స్వామితేజం ముందు అతి స్వల్పం. భావన బట్టి విభక్తి. నేను భావించినదే మీరు భావించనక్కరలేదు. యద్భావం తద్భవతి.

**కం॥ పెదతిరుమలయ్య చెప్పిన**
**మృదు మధురంబైన గీతమే ఇది, తలతున్**
**ముదమున తిరుమల నాథుని**
**మదిపులకించేను సుండి!! భజనను వినుడీ**

**రాగం : బహుదారి**

గోవిందాశ్రిత గోకులబృందా
పావన జయ జయ పరమానందా ॥గోవిందా॥

జగదభిరామా సహస్రనామా
సుగుణధామా సంస్తుత నామా
గగనశ్యామా ఘనరిపు భీమా
అగణిత రఘువంశాంబుధిసోమా ॥గోవిందా॥

జననుత చరణా శరణ్య శరణా
దనుజహరణ లలితస్ఫురణా
అనఘాచరణాయుత భూభరణా
దినకర సన్నిభ దివ్యాభరణా ॥గోవిందా॥





గరుడతురంగా కాదోత్తుంగ
శరధిభంగ ఫణి శయనాంగా
కరుణాపాంగా కమలాసంగా
వర శ్రీవేంకటపతి రంగా ॥గోవిందా॥

## భావామృతం

ఓ గోవిందా! గోకులము చేత ఆశ్రయించబడిన మహానుభావా! బృందావనమును పావనము చేసిన ప్రభూ! పరమానంద స్వరూపా! నీకు జయమగు గాక! జయమగు గాక!

జగత్తునంతటికీ మనోజ్ఞమైన (అభిరామా) ప్రభూ! సహస్ర (వేలకొలది) నామములు కల దేవా! సుగుణములకు నిలయమైన వాడా! ఎప్పుడూ నామసంకీర్తన జరుపబడువాడా! గగన నీలవర్ణా! ఉద్దండులైన శత్రుభయంకరా! ఎన్ననసాధ్యమైన రఘువంశమనెడి సాగరమున జన్మించి చంద్రమా! నీకు జయమగు గాక!

సర్వజనులచే నుతించబడు పాదపద్మములు గల ప్రభూ! శరణన్నవారికి శరణముననుగ్రహించు దేవా! దానవ నిర్మూలకా! మనోజ్ఞమైన రూపముతో స్ఫురించువాడా! సదా దోషరహిత కార్యములే చేయువాడా! సుదీర్ఘమైన భూభారమును నిర్వహించిన స్వామీ! సూర్యుని వంటి దివ్య తేజస్సుతో మెరయుచున్న ఆభరణములను ధరించిన మహానుభావా! నీకు జయమగు గాక!

గరుత్మంతుడు వాహనము వలెనున్న దేవా! చెరసాలలో ఉత్తుంగ తరంగము వలె జన్మించిన ప్రభూ! సాగరుని గర్వ భంగము నొనరించిన మహాత్మా! ఆదిశేషునిపై పవ్వళించు వాడా! కడకన్నులతో (అపాంగ) కరుణ చిలికించు సర్వేశ్వరా! లక్ష్మీదేవి సాంగత్యముచే అనేక దివ్యవరములననుగ్రహించు వేంకటేశ్వరా! ఓ శ్రీరంగనాథా! సదా నీకు జయమగు గాక!

## 3-17

## మున్నుడి

"ఓ వేంకటేశ్వరా! నీవెక్కడ? నేనెక్కడ? నక్కకు నాకలోకానికి (నాగలోకం కాదు) వున్నంత తేడా ఉన్నది మనమధ్య. నీవు పురుషోత్తముడివి. నేను పురుషాధముడిని" అంటూ తమ ఇద్దరి మధ్య వ్యత్యాసాన్ని వివరిస్తున్నారు. అన్నమాచార్యులవారు. నిన్ను లక్ష్యపెట్టని నీచుణ్ణి నేను అయినా నీవు నన్ను విడువని దయాగుణ రాశివి అన్నారు. ఈ కీర్తనలో "నేరమింతయును నాది నేరుపింతయును నీది" అంటున్నారు. 'నేరమింతా నాది' అని భావించకండి 'నేరమి' యింతయును నాది అని చెప్పుకోవాలి. అంటే... 'తెలివితక్కువతనం అంతా నాది' అని అర్థం.

**చం॥ పురుషులలోన యుత్తముడ వోమధుసూదను యెంచి చూడనే**
**పురుషులలోన వ్యర్థుడనువుర్వికి భారము నాదుబోంట్లు ఈ**
**ధర నను యెంచ 'మంచి' దరిదాపున లేదుర వేంకటేశ్వరా!**
**కరుణరసాత్మకంబయిన గానము పాడెను అన్నమార్యుడున్**

**రాగం : శుద్ధవసంతం**

పురుషోత్తముడ వీవు -పురుషాదముడ నేను
ధరలో నాయందు మంచి-తన మేది ॥పురుషోత్తముడ॥

అనంతాపరాధములు - అటు నేను సేసేవి
అనంతమయిన దయ-అది నీది
నిను నెరుగ కుండేటి- నీచగుణము నాది
నను నెడయకుండేగు-ణము నీది ॥పురుషోత్తముడ॥

సకల యాచకమే - సరుస నాకు బని
సకల రక్షకత్వము -సరి నీపని
ప్రకటించి నిన్ను దూరే -పలుకే నాకెప్పుడును
వెకలివై నను గాచే-విధము నీది ॥పురుషోత్తముడ॥





నేర మింతయును నాది-నేరు పింతయును నీది
సారెకు నజ్ఞాని నేను - జ్ఞానివి నీవు
ఈరీతి శ్రీవేంకటేశ-యిటనన్ను నేలితివి
ధారుణిలో నిండెను ప్ర-తాపము నీది ॥పురుషోత్తముడ॥

**భావామృతం :**

ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు పురుషోత్తముడవని జగత్తు కీర్తిస్తున్నది. మరి నేనో? పురుషులలో అధముడను, వ్యర్థుడను. ఈ ప్రపంచంలో నాయందు మంచితనమన్నది లేనేలేదు.

అటువైపు చూస్తే నేను చేసిన అపరాధములు అనంతములు (అంతులేనివి) మరి నీవో? అనంతమైన దయగలవాడవు. నీ మహిమను గుర్తించని నీచ స్వభావుడను నేను. అయినా నన్ను విడిచిపెట్టక అనుక్షణం కాపాడే కరుణాంతరంగుడవు నీవు. (నీసహజ గుణం వలన నన్ను కంటికి రెప్పవలె కాపాడుతూనే వుంటావు)

ప్రతిదానికీ చెయ్యిచాచి పరులను యాచించడమే నావృత్తి. మరి నీపనో? జగన్నాథుడవై సర్వులను రక్షించుట, అడిగింది ఇచ్చి కాపాడుట. ఇదే నీ పని. పనిగట్టుకొని నా తప్పులకు నీవే బాధ్యుడవైనట్లు నిన్ను నిందించే పరమ నీచుడిని నేను. నా నోట్లో నీ నిందా వాక్యములే వుంటాయి. నామీద వెకలివై (ఆసక్తికలవాడవై) నన్ను కాపాడే విధానం నీది. (ఎప్పటికైనా నేను మారగలనా?)

ఇన్ని తప్పులను చేస్తున్నవాడిని కావున నేనేదో తెలివిగలవాడినా? కాదు ప్రభూ! తెలివిలేని నా తెలివితక్కువతనం గోడకి వెల్లవేసినట్లు కనబడుతూనే వున్నది. నీవు బహు నేర్పరివి. నేను ప్రతిసారీ అజ్ఞానినని నిరూపించుకొంటూనే ఉన్నాను. నీవు జ్ఞాన స్వరూపుడవు. ఓ ఇందిరా రమణా! ఏడుకొండలవాడా! ఈ విధముగా నన్ను పాలించుచున్న నీ గొప్పతనముతో ప్రపంచమంతా నిండిపోయింది ప్రభూ!

**3-18**

## మున్నుడి

రేపల్లెలో చిలిపి వేంకటకృష్ణయ్యకు, పరువాల చిన్నది గొల్లభామకు సంవాదం జరుగుతోంది. నన్ను వదలిపెట్టొద్దని వేడుకొంటున్నాడు ఆ సరసుడు. నీకు మొక్కుతాను గానీ నన్ను నీ ముద్దు మాటలతో మైమరపించకయ్యా అంటోందామె. చివరికి ఆయన నిజం బయటపెట్టాడు. నేను వేంకటగిరి పైనున్న నీ చెలువుడను (ప్రియుడిని) అన్నాడు. నన్ను నీ కౌగిట్లో నింపుకో ప్రభూ! అని స్వాధీనురాలైపోయిందామె. ఆమెనే తననుగా భావించిన అన్నమాచార్యులవారి అద్భుత సృష్టి ఇది.విని తరించండి...

**ఆ.వె॥ వదలబోకు నన్ను వద్దు ఓ గొల్లెతా!**
**ముద్దు మాటలాపు మ్రొక్కుదాన**
**గొల్లభామతోటి గోవిందు సరసము**
**ఆలపించినారు అన్నమయ్య**

**రాగం : బృందావని**

వద్దే గొల్లెత వదలకువే నీ
ముద్దుమాటలకు మొక్కేమయ్యా ॥వద్దే॥

ఏలే ఏలే ఏలే గొల్లెత
నా లాగెరగవు నన్ను నేచేవు
చాలు చాలునిక చాలు నీ రచనలు
పోలవు బొంకులు పోవయ్యా ॥వద్దే॥

కానీ కానీ కానీ (లే) గొల్లెత
పోనీలే నీవెందువోయినను
మాని మాని పలుమారు చెనకుచు మా-
తో నిటు సొలయక తొలవయ్యా ॥వద్దే॥





రావా రావా రావా గొల్లెత
శ్రీవేంకటగిరి చెలవుడను
నీవే నీవే నను నించితి కౌగిట
కైవసమైతిని కదవయ్యా ॥వద్దే॥

**భావామృతం :**

ఓ గోపికా! నన్ను విడనాడకే, వద్దే.
పోవయ్యా! నీకు దండం పెడతాను.
నీ ముద్దు ముద్దుమాటలు చాలు. ఇక ఆపు.

ఎందుకే ఏలే గోపిక! నాకు నీపైనున్న ప్రేమ ఎందుకు తెలుసుకోవు? నాపై ఎందుకు ఆ విసురుబాటు?

చాలు చాలు పోవయ్యా నీ మాటల గారడి ఇక చాలు. నీ అబద్ధాలు నీ చేతలతో పోలవు. అయిందిక చాలు.

ఓ గోపికా! కానీ కానీ పోనీలే. నీవెక్కడికి పోతావో నేనూ చూస్తాను.

పో పో స్వామీ! ఇకనైనా మానెయ్యవయ్యా! మాతో అనేక మార్లు చీటికీ మాటికీ ఏదో నెపంమీద తాకుతావెందుకు? నీకు జంకూ గొంకూ లేదు. ఇక్కడి నుంచి తొలిగిపోవయ్యా!

ఓ గోపికా! ఒకపరి ఇటు చూడవా? ఇటు రావా! నేనెవరనుకొనినావు? నేను శ్రీవేంకటగిరిపై నున్న నీ ప్రియుడను నన్ను గుర్తించలేదా?

ఆహా! నిజం. నీవు సత్యమే చెబుతున్నావు ప్రభూ! నీవే నా వేంకట విభుడవు. నన్ను బిగియార కౌగిలించి నన్ను ధన్యురాలను చేయుము స్వామీ! నా స్వాధీనమైతివి కదా! దేవా!

## 3-19

## మున్నుడి

అన్నమాచార్యులవారి అద్భుత సృష్టి అమరములో నున్న ఈ సంకీర్తన. ఆది పురుషుడైన పురుషోత్తముడు మనందరిలోనూ అంతర్యామిగా మనందరి అంతరంగాలలో తిష్టవేసుకుని ఉన్నాడు. జీవుడి రూపంలో ఆ సర్వాంతర్యామి మనని వదిలిన మరుక్షణం పనికి రాని ఈ శరీరాన్ని "నిర్మూలించేస్తారు". భూకాంతుడైన ఆ శ్రీహరి పన్నగేంద్రునిపై పవళించి పాలసముద్రంలో ఉంటాడని భావించారు పెద్దలు శ్రీవేంకటేశ్వరుడే భవరోగ వైద్యుడు అని కీర్తిస్తున్నారు. సింధు భైరవి రాగం వింటే కలిగే ఆనందం చెప్పలేను.

**ఆ.వె॥ ఆదిపురుషుడైన అఖిలాంతరంగుని**
**సన్నుతించినారు అన్నమయ్య**
**భూరమణుని హరిని భోగీంద్ర శయనుని**
**ఇటుల కొలవకున్న యేమి జన్మ?**

**రాగం : సింధుభైరవి**

ఆదిపురుషా అఖిలాంతరంగా
భూదేవతా రమణ భోగీంద్రశయనా ॥ఆది పురుషా॥

భవపాథోనిధి బాడబానల
భవజీమూత ప్రభంజనా
భవపర్వత ప్రళయ భయదనిర్ఘాతదు-
ర్భవ కాలకూట భవ బహువిశ్వరూప ॥ఆది పురుషా॥

భవఘోర తిమిర దుర్భవకాలమార్తాండ
భవభద్ర మాతంగ పంచాననా
భవ కమలభవ మాధవరూప శేషాద్రి
భవన వేంకటనాథ భవరోగవైద్య ॥ఆదిపురుషా॥





### భావామృతం

శ్రీవేంకటేశ్వరా! నీవు ఆది పురుషుడవు. (నీముందు ఎవ్వరూ లేరు). ఆ సమస్త జీవుల అంతరంగములలో నీవు ఆత్మరూపంలో నేలకొని యున్నావు. ఆది వరాహమూర్తిగా భూకాంతను చేబట్టిన నాథుడవు. అంతేకాదు నీవు పన్నగేంద్రుడైన ఆదిశేషునిపై పవళించియుండు విష్ణుమూర్తివి.

ఓ ప్రభూ! ఈ భవసాగరమున (సంసార సాగరమున) నీవు ఘోరమైన బడబానలము దహించివేతువు. అద్భుత ప్రభంజనం (ఝంఝామారుతం) వలె ఈ సంసార కారు మేఘాలను పటాపంచలు చేసివేతువు. భవ పర్వతములను సమూలంగా నిర్మూలించగల నిర్ఘాతము వంటివాడు. (అనగా పిడుగువలె పొడి పొడి చేయగలవాడు). కాలకూట విషమువలె భవమును రూపుమాపు మహానుభావుడవు. విశ్వరూపుడై అనంతరూపుడై అనేకవిధముల నుండువాడు.

సంసారమును ఘోరాంధకారమునకు ఈ స్వామి ప్రచండ మార్తాండుడు, (జ్వలించు సూర్యుడు). సంసారమను భద్ర గజమును చీల్చి చెండాడు మృగరాజు (సింహము). సంసార కమలంలో నుంచి పుట్టిన బ్రహ్మ రూపుడు కూడా ఈ ప్రభువే. లక్ష్మీకాంతుడైన శ్రీమన్నారాయణుడు ఈయనే. శేషాచలమనే దివ్యసదనంలో శ్రీవేంకటేశ్వరుని రూపంలో ఈ భవరోగాన్ని సమూలంగా రూపుమాపే వైద్య శిఖామణి ఈ దేవదేవుడే.



## 3-20

## మున్నుడి

శరణాగతితో అన్నమాచార్యులవారు తననీ భవ బంధాలనుంచి విముక్తుణ్ణి చేసి రక్షించమని అంతర్యామియైన శ్రీవేంకటేశ్వరుని ప్రాధేయపడుతున్నారు. నేను అలసిపోయాను. సొలసిపోయాను. ఇకనీవే దిక్కు అంటున్నారు. శ్రీవేంకటేశ్వరుని గుండె ద్రవించి తనకిష్టం లేకున్నా అన్నమయ్య కోరిక మన్నించాడని పెద్దలు భావించారు. శివరంజని రాగం రాళ్లగరగించు రాగం. కోర్కెలు కోయనికట్లు అంటున్నారు. ఆ కోరిక తీరేదాకా, చచ్చేదాక (కొంతమందికి చచ్చినా) విముక్తి వుండదు. అవే, పునర్జన్మహేతువై 'పుట్టి' ముంచుతుంది.

**కం॥ అంతర్యామీ! అలసితి**
**ఇంతటు నీ శరణ మేను ఇదెజొచ్చితి నా**
**చింతలు మదిలో బాపుము**
**అంతా నీ కరుణ యనెను అన్నయ వినుడీ**

**రాగం : శివరంజని**

అంతర్యామీ అలసితి సొలసితి
యింతట నీ శరణిదె జొచ్చితిని ॥అంతర్యామి॥

కోరిన కోర్కెలు కోయనికట్లు
తీరవు నీవవితెంచక
భారపు బగ్గాలు పాపపుణ్యములు
నేరుపుల బోనీవు నీవు వద్దనక ॥అంతర్యామి॥

జనుల సంగముల జక్క రోగములు
విను విడవవు నీవు విడిపించక
వినయపు దైన్యము విడువని కర్మము
చనదది నీవిటు సం(శాం)త పరచక ॥అంతర్యామి॥





మదిలో చింతలు మయిలలు మణుగులు
వదలవు నీవవి వద్దనక
యెదుటనే శ్రీవేంకటేశ్వర నీవదె
అదన గాచితివి అట్టిట్టనక ॥అంతర్యామి॥

## భావామృతం

అంతర్యామిగా మాలోనే చరిస్తూ మా నీడలా వున్న ఓశ్రీవేంకటేశ్వరా! నేను బాగా అలసిపోయాను, తండ్రీ! సొలుపు వచ్చేసింది. ఇక నాకు వేరే దిక్కులేదు. నీవే నన్ను రక్షించాలి. నీ శరణు జొచ్చాను. నన్ను ఆదుకో, ప్రభూ!

మేము కోరే కోర్కెలే తెగని బంధనములై ఎన్నటికీ మమ్మల్ని విడిపింపని చిక్కులవుతాయి. మేము ఎలాగూ వాటిని తెంచుకోలేం. నీవు తెంచకపోతే మాగతి అంతే. మేము చేసికొన్న పాపపుణ్యాలే బరువైన పగ్గములై నీవు వద్దని వాటిని తెంచకపోతే అవి మమ్మల్ని సమర్ధవంతమైన ముక్తుల్ని జేయవు.

ఇతర జనులతో మేము పెట్టుకొనే సాంగత్యాలే సౌఖ్యం కలిగే భ్రమ నిచ్చే వ్యాధులు. ఆ వ్యాదే సుఖం అని మురిసిపోతుంటాం మేము. నీవు కృప జూపి విడిపించక పోతే ఆ రోగం మమ్మల్నెప్పుడూ విడువక వినయంతో దీనులమై ఆ కర్మబంధాలలో నలిగి అశాంతులమై తపిస్తుంటాం. నీవే మమ్మల్ని శాంత పరచాలి. లేకపోతే మాకు గడవదు తండ్రీ! మాకు వేరే దారిలేదు.

మా మనస్సుల్లో ఉన్న విచారములే మలినములైన మా లొంగుబాట్లుగా మారి మమ్మల్ని వదలవు. నీవే వద్దని మమ్మల్ని ఆ లొంగుబాటునుంచి రక్షించాలి. ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు మా యెదుటనే నిలిచి, సమయానికి అట్టిట్టనక (ఏవేవో సాకులు చూపించక) రక్షించావు. నీకు శరణార్ధిని, కృతజ్ఞుడను.

**3-21**

## మున్నుడి

అన్నమాచార్యులవారి కీర్తనలు నర్మగర్భంగా వుంటాయి. వాటి భావ వివరణ అనుకొన్నంత తేలిక కాదనటానికి ఈ కీర్తన పల్లవే అద్భుతమైన ఉదాహరణ. శ్రీహరి కొక్కనికే ఈ జగత్తులో ఎవరికైనా ఏదానమైనా ఈయడానికి అర్హత ఉన్నదట. ఎందుకంటే భూకాంతను ఆయన దానంగా సర్వహక్కులతో పుచ్చుకొన్నాడట (ఎప్పుడు?), ఆ సౌభాగ్యలక్ష్మి మాత్రమే కాక జయలక్ష్మి, వీరలక్ష్మి, సంగ్రామ లక్ష్మి, వరలక్ష్మి, ఆదిలక్ష్మి, కళ్యాణ లక్ష్మి మొదలైన సర్వలక్ష్ములకు మగడైన ఆయనకు తప్ప ఎవరికైన ఏదైనా అనుగ్రహించాలంటే సాధ్యమా?

**మ॥ తగునయ్యా హరి! నీకు యొక్కనికెయే దానంబు నీయంగ ఈ**
**జగమందున్, వినిపింతు కారణము ఆ సౌభాగ్య లక్ష్మీసతిన్**
**తగగైకొంటివి దానమట్లు బలిచే ధాత్రీలలామన్ అహో!!**
**మగడైనాడవు సర్వ లక్ష్ములకు సౌభాగ్యంబు అన్నయ్యనెన్.**

**రాగం : కళ్యాణి**

తగునయ్య హరి నీకు దానము దెచ్చుకొనిన
జగములో భూకాంత సౌభాగ్యలక్ష్మి ॥తగునయ్య॥

కిమ్ముల శిశుపాలుని గెలిచి చేకొంటివిగ
సమ్మతించి రుక్మిణి జయలక్ష్మి
అమ్ముమొనను జలధినడచి లంక సాధించి
కమ్మరచేకొన్న సీతే ఘన వీరలక్ష్మి ॥తుగనయ్య॥

నరకాసురు నడచి నవ్వుతా చేయివేసితివి
సరిగా సత్యభామే పో సంగ్రామలక్ష్మి
హిరణ్యకసిపుగొట్టి యింద్రాదులకు నీచే
వరమిప్పించిన యాకే వరలక్ష్మి ॥తగునయ్య॥





నిండిన వురము మీద నిఖిల సంపదలతో
అండనుండే యాకే పో ఆదిలక్ష్మి
మెండగు శ్రీవేంకటాద్రి మీద నీ సరుస నేగే
గండుమీరె కళలతో కళ్యాణలక్ష్మి ॥తగునయ్య॥

**భావామృతం :**

ఓ శ్రీహరీ! నీకొక్కనికే తగును. నీకే హక్కు. ఏ సౌభాగ్యమునైనా నీవీయగలవు. దానముగా నీవు తెచ్చుకొనిన ఈ జగములో భూకాంత నీది అయిన సౌభాగ్యలక్ష్మి (వామనావతారంలో ఆయన జగత్తులోని లోకాల నన్నింటిని త్రివిక్రముడై బలి చక్రవర్తినుంచి సర్వ హక్కులతో దానంగా స్వీకరించాడు)

ప్రభూ! కిమ్ముల శిశుపాలుని (అంటే అల్పముగా భావించు శిశుపాలుని) గెలిచి, తన సమ్మతిని బ్రాహ్మణుని ద్వారా తెలిపిన రుక్మిణీదేవిని స్వీకరించితివి. ఆమెయే నీకు స్వంతమైన జయలక్ష్మి. బాణమును సంధించి జలధిని అణచి వారధి నిర్మించి లంకలో రావణుని తుదముట్టించి, కమ్మర (కమ్మర అంటే మరల అని అర్థం) సీతాదేవిని చేకొనినావు. ఆమే నీకు స్వంతమైన వీరలక్ష్మి.

ప్రభూ! నీవు మూర్ఛిల్లితివని ఆగ్రహించి నరకాసురుని తుదముట్టించిన సత్యభామపై నవ్వుతూ నీచేతిని వేసినావు. ఆమెయే పో నీ సంగ్రామలక్ష్మి. హిరణ్యకశిపుని చీల్చి నరసింహరూపమున నీవు ఆగ్రహోదగ్రుడవై యుండగా నిన్ను శాంతపరచి ఇంద్రాదులకు అనేక వరములిప్పించిన ఆ దేవియే వరలక్ష్మి వలె మమ్మనుగ్రహించుచున్నది.

ప్రభూ! సువిశాలమైన నీవురముపై ఆవాసమై సమస్త సంపదలను అనుగ్రహించి అండయై నిలిచే ఆ తల్లినే పో మేమందరమూ ఆదిలక్ష్మిగా కీర్తిస్తున్నాం. ఇకనేడు అతిశయించిన వేంకటాచలం మీద ఓ వేంకటేశ్వరా! నీ సరసనే వుండి నీతో వూరేగుతూ కళల కాణాచియైన ఈ జగజ్జననియే నీ నిత్యవధువు అయిన అలమేలు మంగమ్మ. ఆమెయే కళ్యాణ లక్ష్మి.

## 3-22

### మున్నుడి

అన్నమాచార్యులవారి జానపద కీర్తన ఇది. తన యజమానురాలిని కూడా సెబాస్ అని మెచ్చుకొనే అమాయకులు వారు. అన్నమయ్య నాటి వాడుకపదం 'చాంగుభళా'. ఈ రెండు పదములు నేటి కాలంలో 'భలే భలే' గా మారి ఉంటాయి. అలమేల్మంగమ్మ మన తల్లి, యజమానురాలు. ఆమె అందం అసాధారణం. ఆమె మధురాధరం, చూపులు, స్తనయుగ్మం, నడుము, ఒయ్యారపు నడక, చిరుకోపము ఇత్యాది సమస్తం "చాంగుభళా" అంటున్నారు. అన్నమయ్య మధుర భావనలు ఈ కీర్తనలో ప్రతిఫలించినవి. వాటిని సవివరంగా చెప్పే సత్తా నాకు లేదు... బహుశా రాదేమో... కూడ.

**ఉ॥ చక్కని తల్లికిన్ పలికి చాంగుభళాయని అన్నమార్యుడున్**
**చక్కెరమోవినిన్ పొగడె చాంగుభళాయని యెంచిచూడరో**
**చక్కదనాల కీర్తనిది స్వామికి యుల్లము ఝల్లు మన్నదో**
**ఎక్కువ నర్మగర్భముగ యాకృతి భావము నెంచి జెప్పితిన్**

**రాగం : పాడి**

చక్కని తల్లికి చాంగుభళా తన
చక్కెర మోవికి చాంగుభళా ॥చక్కని॥

కులికెడి మురిపెపు కుమ్మరింపు తన
సలుపు చూపులకు చాంగుభళా
పలుకుల సొలపుల పతితో కసరెడి
చలముల యలుకకు చాంగుభళా ॥చక్కని॥

కిన్నెరతో పతి కెలన నిలుచు తన
చన్ను మెఱుగులకు చాంగుభళా
ఉన్నతి పతిపై నొరగి నిలుచు తన
సన్నపు నడిమికి చాంగుభళా ॥చక్కని॥





జందెపు ముత్యపు సరుల హారముల
చందనగంధికి చాంగుభళా
విందయి వేంకట విభు పెనచిన తన
సందిదండలకు చాంగుభళా ॥చక్కని॥

**భావామృతం :**

చక్కదనాల మాయమ్మ అలమేల్మంగకు చాంగుభళా! ఆమె మధురాధరమునకు కూడ చాంగుభళా!

సంతోషముతో ఆమె కులుకుచున్నప్పుడు, విలాసమును ఆమె కుమ్మరించుచున్నది. చురచురపోట్లు పొడుచునట్లు ఆమె చూపులకు చాంగుభళా! పరవశించి మాటలాడు తన పతిని చిరు కోపముతో కసిరి, మచ్చరము ప్రదర్శించు (పైకి మాత్రమే) ఆ అలుకకు చాంగుభళా!

చేతిలో కిన్నెర (వాయిద్యము) ధరించి తన భర్త పక్కన నిలుచున్నప్పుడు మెఱయుచున్న ఆమె స్తనయుగ్మమునకు చాంగుభళా! పతితో శృంగార కళావిన్యాసములో ఉన్నతి యందున్నప్పుడు ఆయనపై నొరగిన సన్నని జఘనమునకు చాంగుభళా!

ముత్యాల సరములున్న ఆమె హారములు మధ్య మధ్య జందెములవలె వ్రేలాడుచుండినవి. అది అత్యంతాకర్షణీయమై ప్రశంసనీయముగా నున్నది. అట్టి చందన పరిమళ విరాజమానమైన ఆ జవ్వనికి చాంగుభళా! ఆనందముగా తన విభుడయిన వేంకటేశ్వరుని బిగియార కౌగలించిన ఆ తల్లి ధరించిన సంది దండలకు (కేయూరాభరణములకు) చాంగుభళా!

3-23

## మున్నుడి

విష్ణునామ సంకీర్తనా వైభవాన్ని వివరిస్తున్నారు అన్నమయ్య. నారాయణ అని పలికినంత మాత్రమున అజామీళుడు నరకాన్ని తప్పించుకొని వైకుంఠం చేరినట్లు భాగవతం చెబుతున్నది. అంత్యకాలమున నారాయణా అనాలంటే నేటి 'ఆధునికులకు' అంత తేలిక కాదు. సంపాదించిన ఆస్తులేమైపోతాయోననే దిగులుతోనే సగం మంది 'శ్రీహరీ' అనకుండా 'హరీ' అని పోతారు. దానికి తరుణోపాయమొక్కటే అలవాటుగా 'రామా' అనో, నారాయణా అనో 'శ్రీహరీ' అనో అనటం మొదలు పెట్టండి. వెన్నుని నామమే వేదం. ఎంత గడించినా, ఎన్ని పదవులు పొందినా, ఎంత చదివినా నామమే గతి.... ఇది సత్యం.

**కం॥ వెన్నుని నామం బొకటే**
**ఇన్నిటికిని ఇంతటికిని ఇరవైనది పో**
**ఎన్నగ వేదంబాయెను**
**అన్నాడా అన్నమయ్య అలరించె హరిన్.**

**రాగం : అభోగి**

ఇన్నిటా నింతటా నిరవొకటే
వెన్నుని నామమే వేదంబాయె ॥ఇన్నిటా॥

నలినదళాక్షుని నామకీర్తనము
కలగి లోకమున కలదొకటే
యిల నిదియే భజియింపగ పుణ్యులు
చెలగి తలప సంజీవని ఆయె ॥ఇన్నిటా॥

కోరిక నచ్యుత గోవిందా యని
ధీరులు తలపగ తెరువొకటే
ఘోర దురితహర గోవర్ధనధర
నారాయణ యని నమ్మగ కలిగె ॥ఇన్నిటా॥





తిరు వేంకటగిరి దేవుని నామము
ధర తలపగ నాధారమిదే
గరుడధ్వజుని సుఖప్రద నామము
నరులకెల్ల ప్రాణము తానాయె ॥ఇన్నిటా॥

**భావామృతం :**

ఇన్నిటికి, ఇంతటికీ అత్యుత్తమమైన స్థానము ఏదో తెలుసునా? ఒక్కటే. శ్రీమన్నారాయణుని నామ సంకీర్తనమొక్కటే. అదే వేదం వలె అందరికీ ముక్తినిస్తున్నది.

ప్రపంచము అని పిలువబడే ఈ లోకమున అరవింద- దళనేత్రుడైన ఆ శ్రీహరి నామమొక్కటే గతిగా కలదని గ్రహించండి. పుణ్యాత్ములైన భక్తులు ఇది గ్రహించి, విజృభించి ఆ నామ సంకీర్తన జరుపగా అది సంజీవని వలె వారికి మేలు చేసింది. మీరెందుకు అట్లు చేయరు?

ధీరోదాత్తులైన వారు ఇష్టపూర్వకముగా ఓ అచ్యుతా! ఓ గోవిందా! అని ధ్యానిస్తూ జీవించుటకు ఆ నామసంకీర్తనయే మార్గం అయింది. అది వారు చేసిన ఘోర పాపములను నిర్మూలించివేసింది. గోవర్ధనగిరి ధారియైన శ్రీకృష్ణ పరమాత్మయే, నారాయణుడే దురితదూరుడని నమ్మిన సర్వమూ నెరవేరుతుంది. ఆ నామము అంతగొప్పది.

తిరుమలనాథుడైన శ్రీవేంకటేశ్వరుని నామమే ఈ భూలోకంలో ఆధారముగా నిలిచినది. గరుత్మంతుని తన ధ్వజమున కలిగిన ఆ మహానుభావుని సుఖప్రదమైన నామము తానే ప్రజలందరికీ ప్రాణమువలె జీవనాధారమైనది.

**మున్నుడి** **3-24**

అన్నమయ్య జీవిత చరిత్ర రాసిన ఆయన మనుమడు 'చిన్నన' ఈ కీర్తన గూర్చి ఇలా ప్రస్తావించాడు. తనపై ఒక శృంగార కీర్తన వ్రాయమని సాళ్వ నృసింహరాయలు అడిగితే "హరిపై దక్క అన్యులపై కీర్తన చెప్ప"నని అన్నమయ్య నిరాకరించగా రాజు ఆగ్రహించి సంకెలలతో చెఱలో బెట్టించాడట. అన్నమయ్య ఈ కీర్తన పాడగా సంకెలలు తెగిపోయినవట. ఈ సంగతి విన్న రాయలు మఱొకమారు తనయెదుట సంకెలలు వేయించాడట. అవికూడా రాజు చూస్తుండగానే తెగిపోయాయట. నిశ్చేష్టుడైన రాజు అన్నమయ్య కాళ్లపై బడి క్షమను వేడాడట. అన్నమయ్య రాజును క్షమించుటయే గాక "నిన్ను శ్రీహరి రక్షించును" అని దీవించారట కూడా...

**ఆ.వె ॥ ఆకలైన వేళ అలసిపోయిన వేళ**
**"తేకువా" సగజాలు దిక్కుయేది?**
**అన్నమయ్య తెలిపె హరినామమొక్కటే**
**వేరు దారిలేదు విబుధులార!**

**రాగం : ముఖారి**

ఆకలివేళల-నలపైన వేళలను
తేకువ హరినామమే- దిక్కు మరి లేదు ॥ఆకలి॥

కొఱమావియున్నవేళ-కులము చెడినవేళ
చెఱవడి యొరుదులచే-జిక్కినవేళ
ఒఱపైన హరినామ-మొక్కటే గతిగాక
మఱచి తప్పిననైన-మఱి లేదు తెఱగు ॥ఆకలి॥

ఆపదవచ్చిన వేళ - ఆఱడి బడినవేళ
పాపపు వేళల -భయపడిన వేళ
ఓపినంత హరినామ-మొక్కటే గతిగాక
మాపు దాక బొరలిన-మఱిలేదు తెఱగు ॥ఆకలి॥





సంకెళబెట్టిన వేళ - చంప బిలిచినవేళ
అంకిలిగా నప్పులవా-రాగిన వేళ
వేంకటేశు నామమే - విడిపించ గతిగాక
మంకు బుద్ధి బొరలిన- మఱిలేదు తెఱగు ॥ఆకలి॥

**భావామృతం :**

ఆకలితో బాధపడుతున్నప్పుడు, అలసి శ్రమపడి యున్నప్పుడు, మానవులకు తేకువ (ధైర్యము) నొసగునది యేది? శ్రీహరి నామము ఒక్కటే దిక్కు కాని మరింకేదీ లేదు (అని గ్రహించండి). కొఱమావియున్నవేళ (ఎందుకూ కొఱగాని స్థితియందు), కుల భ్రష్టత్వము చెందినప్పుడు, ఇతరుల చేతిలో జిక్కి చెరసాలలో బంధింపబడినప్పుడు, ఒఱపైన (చక్కటి) హరినామమొక్కటే గతి. పొరబాటుగానైనా ఇంకొకటి దిక్కు కాదని గ్రహించవలెను. అసలింకొక దారియే (తెఱవు) లేదు, ఉండబోదు.

మనకు అనుకోకుండా ఆపద సంభవించినప్పుడు, నిందకు గురియైన వేళలయందు, పాపము జరుగుచున్న వేళలయందు, భయకంపితులైయున్న సమయములలోను చేతనయినంత హరినామమొక్కటే దిక్కు. అంతేగాని చివరిదాక ఎంత బొరలినా(శ్రమించినా) ఇంకొకమార్గం లేదు.

నీపై వైరభావం కలిగినవారు సంకెళ్లతో బంధించి బాధించుచున్నప్పుడు, సంహరించుటకు సిద్ధపడినప్పుడు, అప్పులవాళ్లు అంకిలిగా (అడ్డుపడి) నిలబెట్టిన వేళ, ఆ శ్రీవేంకటేశ్వరుని నామమొక్కటే దిక్కు. అదొక్కటే నిన్ను విడిపించగలదు. అట్లుగాక మంకుబుద్ధితో (మూర్ఖత్వంతో) శ్రమిస్తే ఏమి ఉపయోగం? ఇంకొకదారి లేదు అని గ్రహించి ఆ ఏడుకొండల వాడిని "అన్యథా శరణం నాస్తి, త్వమేవ శరణం మమ" అని వేడుకోండి. మిమ్మల్ని తప్పక రక్షిస్తాడు.

**3-25**

## మున్నుడి

అన్నమాచార్యులవారు కలశాపురం (నేటి అనంతపురం జిల్లాలో వున్నది) దర్శించి అక్కడ వెలసిన 'హనుమంతుని' పై ఈ కీర్తన చెప్పారు. హనుమంత రాయుడని అభివర్ణిస్తూ ఆయన ప్రతాపాన్నీ శ్రీరామునికి ఆయన చేసిన సేవను గుర్తుచేస్తున్నారు. 'నీరు' అంటే అల్పమైనది (అల్పము) అని అర్ధమున్నది. లంకను నిమిషాన నీరు సేసి-అంటే స్వర్ణలంకను క్షణంలో అల్పమైన బూడిద చేసి అని అర్థం. 'సహజాన నొక జంగచాచి' అంటె, స్వభావ సిద్ధంగా తన ఒక పిక్కనుచూచి యుంచి అని అర్ధం. కొత్తచోటికి ఎగిరి దూకాలంటే అదే చేయాలి కదా! అన్నమయ్యకు రాముడే వేంకన్న.

**కం॥ కలశాపురమందున తా**
**నలరుచు నున్నాడు వాడె హనుమంతుడు ఆ**
**నళినీకాంతుని కొలుచుచు**
**అలయని బంటనెను అన్నమయ్యను వినుడీ.**

**రాగం : వసంత**

కలశాపురము కాడ కందువ సేసుకొని
అలరుచున్నవాడు హనుమంత రాయుడు ॥కలశా॥

సహజాన నొకజంగ చాచి సముద్రము దాటి
మహిమ మీరగ హనుమంత రాయుడు
ఇహమున రాముబంటై యిప్పుడు నున్నవాడు
అహరహమును దొడ్డ హనుమంతరాయుడు ॥కలశా॥

నిండు నిధానపు లంక నిమిషాన నీరు సేసె
మండిత మూరితి హనుమంత రాయుడు
దండితో మగి(గు)డి వచ్చి తగ సీత శిరోమణి
అండ రఘుపతికిచ్చె హనుమంత రాయుడు ॥కలశా॥





వదలని ప్రతాపాన వాయుదేవు సుతుడై
మదియించినాడు హనుమంతరాయుడు
చెదరక యేప్రొద్దు శ్రీవేంకటేశు వాకిట
అదివోకాచుకున్నాడు హనుమంతరాయుడు ॥కలశా॥

**భావామృతం :**

కలశాపురమునందు కందువ (జాడ) సేసుకొని (తెలియజేయుచు) విలసిల్లుచున్న ఈ మహానుభావుడే హనుమంతరాయుడు. (ఈయనను సేవించండి).

ఆకాశమున కెగిరి దూకి లంకజేరుటకు సంకల్పించిన వాడై, ఆ హనుమంతరాయుడు స్వభావ సిద్ధముగా ఒక పిక్కను చాచియుంచి మహిమను జూపుతూ సముద్రమును దాటినాడు. నేటి కలియుగమున కూడ అహరహము (రాత్రింబవళ్ళు) రామబంటువలె ఈ పెద్ద హనుమంతుడు నెలకొని యున్నాడు.

నిండు నిధానము (పూర్తిగా స్వర్ణమయం) అయిన లంకను నిముషంలో నీరు (అల్పమైనది) గా చేసి పారవేశాడు. ఈ మండితమూర్తి (అలంకరింపబడిన స్వామి). శౌర్యముతో మగుడివచ్చి (తిరిగివచ్చి) సీతాదేవి శిరోమణిని నాధుడైన శ్రీరామునికిచ్చి ఆ రఘుపతిని ఆనందపరచినవాడు ఈ హనుమంతరాయుడు. (ఈయనకు చేతకానిదేదీ వుండదు)?వాయునందనుడైన ఈ పరాక్రమశాలి ఎన్నడూ వీడని ప్రతాపము గలవాడు. అందుచే ఈ హనుమంతరాయుడు మదియించి వున్నాడు. (మదించి యున్నాడని అర్ధం చేసికొనరాదు. ఇక్కడ మదియించి అంటే మనసులో ధ్యానము చేయుచూ వున్నాడని అర్థం) వున్నాడు. ఏ వేళలోనైనా ఈయన చెదరక (పరాకులేక) శ్రీవేంకటేశ్వరుని వాకిటిలో (అనంతపురం తిరుమల యెదుటనే వున్నదని భావన) అదిగో కాచుకొని సిద్ధముగా నున్నాడు. ఈ హనుమంత రాయుడు. (ఈ స్వామిని సేవించి తరించండి.

## 3-26

### మున్నుడి

అన్నమాచార్యుల వారి సరస శృంగార కీర్తన ఇది. 'అంత్యప్రాస' రకరకాల విన్యాసాలు చేసిన అద్భుత కవిత. వివరించి జెబితే సీమంతులు సిగ్గుల మొగ్గలయ్యే సామంతం. సమరతి అనుభవంలేని వారికి "చచ్చినా అర్థం కాని చమత్కారం". వేంకటేశ్వరుడు పులకరించి అమ్మవారిని ఆటపట్టించే తేట తెలుగు తేనెజల్లు. అర్థం కాని పరమార్థం. 'తములము' అంటే తాంబూలం అని తెలియని వారికి చెప్పి లాభంలేదు....

**సీ॥ చిరుచెమటల తోటి చెమరగ చెక్కిళ్లు**
**మొలక నవ్వులు నవ్వె మోహనాంగి**
**సొలపుల వేడ్కల చొక్కెను జవ్వని**
**తొలగని ఆసల తొక్కిడాయె**
**నెఱవగు చూపుల నిక్కిళ్లు మెరయగా**
**తమకంబు మించెనా తరుణి కపుడు**
**గుక్కిళ్లు మెఱసెను గురుతైన అధరంబు**
**వలపులు దక్కెనా వనిత కపుడు**

**ఆ.వె॥ అమరె నేడు తనకు అన్ని సొబగులును**
**సమరతి గురుతులును సతికి గలిగె**
**అన్నమయ్య పాటనలరె శృంగారంబు**
**వేంకటేశు కదియె వేడుకాయె**

**రాగం : దేవగాంధారి**

అమరె గదె నేడు అన్ని సొబగులును
సమరతి చిన్నలు సతి నీ మేను ॥అమరె॥





చెలపల చెమటలు చెక్కిళ్ళ
మొలకల నువ్వులు మొక్కిళ్ళ
సొలపుల వేడుక చొక్కిళ్ళ
తొలగని ఆసలు తొక్కిళ్ళా ॥అమరె॥

నెఱవగు చూపులు నిక్కిళ్ళ
మెఱసెను తమకము మిక్కిళ్ళ
గుఱుతగు నధరము గుక్కిళ్ళ
తఱచగు వలపులు దక్కిళ్ళా ॥అమరె॥

నునుగోరి కొనలు నొక్కిళ్ళ
పొనుగని తములము పుక్కిళ్ళ
ఘనుడగు శ్రీవేంకటపతి కౌగిట(ళ్ళ)
యెనసెను పంతము లెక్కిళ్ళు ॥అమరె॥

**భావామృతం :**

తల్లీ! అలమేల్మంగా! నేడు అన్ని విధములైన అందములు నీకు సమకూడినవి. సమకూటములలో సొలసిన నీ మేనిలో ఆ చిహ్నములన్నియూ పొడజూపుచున్నవమ్మా! అవి స్వామికి వేడుక గనుక ప్రస్తావిస్తాను తల్లీ! ఆలకింపుము.

అందమైన నీ చెక్కిళ్ళు చెమటతో చెమరించినవి. నీ చిరునవ్వులలో కొంటెతనములు తొంగిచూచినవి. వెనుదీయని వేడుకలతో నీవు పరవశించిపోతివి. తీరని ఆశలతో సంకటములే మిగిలినవి.

విస్తరించిన నీ చూపులు నలుదిక్కుల గమనించుచున్నవి. ఆ చూపులలో యొకింత గర్వము తొంగిచూచుచున్నది. మిక్కిలియైన తన్మయత్వము కూడ మెఱసినది. అధరములపై గురుతైన దంతక్షతములు అలంకరణములైనవి. పలుమార్లు ప్రణయానుభవములు ఆమెను అలరించినవి. ఆమె స్థితి వర్ణనల కందకున్నది.

లేత కొనగోటి నొక్కిళ్ళు స్వామి శృంగార విభవమును చాటుచున్నది. విరామములేని తాంబూల సేవనముచే బుగ్గలు అలిసినను అలరినవి. ఘనుడైన శ్రీవేంకటేశ్వరుని పరిష్వంగములలో లెక్కకు మిక్కుటములైన పంతములు పరిఢవిల్లినవి.

**3-27**

## మున్నుడి

అన్నమాచార్యులవారి వైరాగ్య సంకీర్తన ఇది. కనులముందు కరిగిపోయే కాలం తిరిగి రమ్మంటే వస్తుందా? రాదు. ఇక్కడ 'బూడిదలో హోమం' అనే క్రొత్త పోలిక చెప్పారు అన్నమయ్య. హోమం చేయాలంటే జ్వలించే అగ్ని కావాలి కాని బూడిదలో నెయ్యిపోసి హోమం చేస్తారా యెవరైనా? కాలం పొంచియున్న మృగమట. ఏక్షణాన గుటుక్కుమని మింగుతుందో!! అగ్ని దగ్గరున్న వెన్న కరిగిపోకుండా వుంటుందా? పుక్కి పురాణం అంటే బుగ్గల్లో పెట్టుకొన్న పురాణ గాథలు. అంటే అప్పటికప్పుడు (కల్పించి) చెప్పిన ఇతిహాసం. భక్తి తక్కువ రక్తి ఎక్కువ. అది హరినెట్లు చూపగలదు?

**ఉ॥ ఏడ చనెన్ గదా! తెలివి ఏడకు పోయెను జ్ఞానమంతయున్**
**బూడిదలోన హోమమయిపోయెను క్రుంగిరి అన్నమార్యుడున్**
**వేడిమి సోక అగ్గికడ వెన్నయిపోయెను కాలమంతయున్**
**కూడక వేంకటేశ! నిను కోరితి వ్యర్థుల కూటముల్ హరీ!**

**రాగం : బౌళి**

ఏడ సుజ్ఞానము యేడ తెలివి నాకు
బూడిదలో హోమమై పోయె కాలము ॥ఏడ సుజ్ఞాన॥

ఇదె మేలయ్యెడి నాకదె మేలయ్యెడి నని
కదిసిన యాసచే గడవలేక
యెదురు చూచి చూచి యెలయించి యెలయించి
పొదచాటు మృగమై పోయె కాలము ॥ఏడ సుజ్ఞాన॥

ఇంతట దీరెడి దుఃఖ మంతట దీరెడి నని
వింత వింత వగలచే వేగి వేగి
చింతయు వేదనల చిక్కువడుచు నగ్గి
పొంతనున్న వెన్నయై పోయె కాలము ॥ఏడ సుజ్ఞాన॥





ఇక్కడ సుఖము నాకక్కడ సుఖంబని
యెక్కడికైనా నూర కేగి యేగి
గక్కన శ్రీతిరువేంకటపతి గానక
పుక్కిపురాణమయి పోయె కాలము ॥ఏడ సుజ్ఞాన॥

**భావామృతం :**

అయ్యో!! కాలమంతా బూడిదలో చేసిన హోమము వలె వ్యర్థమైపోయినదే!! నాకు తెలివి ఏమై పోయింది? నా సుజ్ఞానమంతా ఏమయిపోయింది?

ఇది నాకు మేలు చేస్తుంది, అది నాకు మేలు చేస్తుంది అని నమ్మివానిపై అనేక ఆసలు పెట్టుకొని నన్నుపెనవేసుకొన్న ఆసలతో గడపలేక పోయాను. ఇక కాలమేమో పొదచాటున చేరి దాగియున్న మృగము వలె ఎదురు చూచి ఎదురుచూచి నన్ను కబళించాలని ప్రయత్నిస్తోంది. ఇప్పుడు నేనేం చేయాలి? దారేమిటి?

అనంతమైన నా దుఃఖము ఇంతటితో వదలి పోతుందిలే అంతటితో పోతుందిలే అనుకొని వింత వింత వేదనలతో వేగిపోయాను. అంతులేని ఈ చింతలలో చితికిపోయి చిక్కువడిపోయి నిప్పు సమీపంలో వున్న వెన్నవలె నా వునికే మారింది. స్థిరంగా గట్టిగా వుండాల్సిన నేను నీరుగారిపోయాను.

నాకు ఇక్కడ సుఖమున్నది, అక్కడ సుఖమున్నదని భ్రమపడి ఊరకనే యెక్కడెక్కడికో పోయాను. సమయమంతా వృథా చేసికొన్నాను. శ్రీవేంకటేశ్వరుని తక్షణం దర్శించక పనికిరాని పుక్కిట పురాణాలయందు ఆశ కనబరిచి ఆ పురాణాలవలెనే కాలయాపనతో ఆ ఏడుకొండలవాడు నాకిచ్చిన కొద్దికాలాన్ని వ్యర్థం చేసికొన్నాను.

**3-28**

## మున్నుడి

హంపీ విజయనగరంలో వెలసిన వీరరామునిపై అన్నమాచార్యులవారు అనేక అత్యద్భుత సంస్కృత సంకీర్తనలు వినిపించారు. ఆ కోవలో ఈ కీర్తన కూడా ఒకటి. "తరణి తనూజాది తరుచర పాలక" అంటే సూర్యపుత్రుడైన సుగ్రీవుడు మొదలైన వానరులను పాలించిన వాడని అర్థం. 'హరకోదండహర' అంటే శివుని వింటిని విరిచినవాడని తెలియవలెను. తేలికగా కనిపించే తేలిక కాని కీర్తన చెప్పటం అన్నమయ్య ప్రత్యేకత. నామాట నమ్మాలంటే... పరిశీలించండి.

**తే॥ హంపి విజయనగరమున అలరియున్న**
**వీరరాముని గొలిచిరి పరవశించి**
**'అమర' గానము వినిపించి రన్నమయ్య**
**పూజ యిదియని పాడుడీ సుజనులార!**

**రాగం : నాటు**

నమో నమో రఘుకుల నాయక దివిజవంద్య
నమో నమో శంకర నగజానుతా ॥నమో నమో॥

విహిత ధర్మపాలక వీరదశరథ రామ
గహన వాసినీ తాటక మర్దన
అహల్యాశాప విమోచన అసురకుల భంజన
సహజ విశ్వామిత్ర సవన రక్షకా ॥నమో నమో॥

హరకోదండ హర సీతాంగనా వల్లభ
ఖరదూషణారి వాలి గర్వాపహా
తరణి తనూజాది తరుచర పాలక
శరధి లంఘన కృత సౌమిత్రి సమేత ॥నమో నమో॥





బిరుద రావణ శిరోభేదక విభీషణ
వరది సాకేతపురివాస రాఘవ
నిరుపమ శ్రీవేంకట నిలయ విజయనగర
పుర విహార పుండరీకాక్షా ॥నమో నమో॥

**భావామృతం :**

ఓ రఘు కులాగ్రణీ! నీకు వందనము దేవతలచే నుతింపబడు రామచంద్రా! నీకు నమస్కారములు. శివపార్వతులచే నుతింపబడు వీరరామా! నీకు వందనములు.

ఏ సమయమున యెట్టి ధర్మము పాటించాలో అట్టి ధర్మమును పరిపాలించిన వాడవు. వీరాధి వీరుడైనవాడవు. దశరథాత్మజుడవు. గహనవాసిని (కారడవులలో నివసించునది) యైన తాటకను సంహరించినవాడవు. అహల్యాదేవిని శాపమునుండి విడిపించిన వాడవు. అసురకులాన్ని అంతమొందించినవాడవు. సహజ (తమ్మునితో) విశ్వామిత్రుని యాగమును రక్షించిన వాడవు. అట్టి నీకు వందనములు.

శ్రీరామా! శివధనస్సును విరిచిన నీవు సీతాదేవికి భర్తవు. ఖర దూషణాది రాక్షసుల శత్రువా, అజేయుడైన వాలి గర్వమును నిర్మూలించి తుదముట్టించితివి. సూర్యనందనుడైన సుగ్రీవాది వానరులను పరిపాలించిన వాడవు. హనుమంతునిచే సముద్రమును దాటింప చేసినవాడవు. ఎల్లప్పుడు సుమిత్రానందనుడైన లక్ష్మణుని తోడైన వాడవు.

బిరుద (సమర్థుడైన) రావణాసురుని శిరస్సును భేదించి సంహరించిన వాడవు. విభీషణుని రక్షించిన వాడవు. సాకేత నగరాధీశుడైన రాఘవుడవు. సాటిలేని తిరుమలాధీశుడైన శ్రీవేంకటేశ్వరుడవు. విజయనగర పురాధీశుడైన వీరరామచంద్రుడవు. పద్మదళ నేత్రుడవైన మహానుభావుడవు. అట్టి నీకు వందనములు.

**3-29**

## మున్నుడి

సంస్కృతంలో అన్నమాచార్యులవారు చెప్పిన చక్కటి కీర్తన ఇది. పట్టుమని ప్రతిపదార్థం చెప్పవయ్యా వింటాను అంటే పండితులకే తికమక కలిగే కీర్తన అని చెప్పగలను. పెద్దల సహాయంతో ఒక మోస్తరు వివరణ ఇవ్వగలిగాను. ఇట్లాంటి కీర్తనలు చదివాక అన్నమయ్య భాషాపాండిత్యానికి ముగ్ధులం కాకుండా వుండగలమా? కుందహాసుడంటే మొల్ల పుష్పముల మొగ్గల వంటి చిరునవ్వులు కల శ్రీకృష్ణుడు. "చిర చిర ఘన శ్రీవేంకటేశ్వర" అంటే ఏమిటి? చిరచిరలాడే శ్రీనివాసుడనుకోకండి... చదవండి.

**కం॥ నందుని నందన! నీకా-**
**నందము వేణు స్వనంబు నవనీత హరా!**
**అందముగ పాడి అన్నయ**
**కుందపు దంతాల సౌరు కొనియాడిరిగా**

**రాగం : అభేరి**

నందనందన వేణు నాద వినోద, ము
కుంద కుంద దంతహాస గోవర్ధనధరా ॥నంద॥

రామ రామ గోవింద రవిచంద్ర లోచన
కామ కామకలుష వికారవిదూర
ధామ ధామ విభవత్ప్రతాపరూప దనుజ ని-
ర్ధామధామకరణచతనర భవభంజన ॥నంద॥

కమల కమలావాస కమలారమణ దేవో
త్తమ తమోగుణ సతత విదూర
ప్రమదత్ప్రమదాను భవ భావకరణ
సుముఖ సుధానంద శుభరంజనా ॥నంద॥





పరమ పరాత్పర పరమేశ్వరా
వరద వరదామల వాసుదేవ
చిర చిరఘన నగ శ్రీవేంకటేశ్వర
నరహరినామ పన్నగ శయనా ॥నంద॥

**భావామృతం :**

ఓ నందనందనా! వేణుగాన వినోదా! ఓ ముకుందా! మొల్ల మొగ్గవంటి లేత చిరునవ్వుగల మనోహరా! గోవర్ధన పర్వతమునెత్తిన మహానుభావా! (నీకు వందనములు).

ఓ పరశురామా! రఘురామా! గోవిందా! సూర్యచంద్రులు నేత్రములైన ప్రభూ! మాయొక్క కామనలను, కామనలవలన జనించిన దోషములను పరిహరించువాడా! మోక్షమునకు స్థానమై ముక్తి వైభవము యొక్క ప్రతాపము రూపుదాల్చినవాడా! రక్కసి మూకను సమూలముగా కంపింపజేయువాడా! నేర్పరితనము ద్యోతక మగునట్లు భవబంధములను సడలించు మహానుభావా! నీకు వందనములు.

కమల (బ్రహ్మ)కు ఆవాసమైన (స్థానమైన) కమల (నాభియందు) గలదేవా! లక్ష్మీవల్లభా! దేవతలందరిలో శ్రేష్ఠుడా! ఎల్లప్పుడూ తమోగుణమును నిరసించి నిర్మూలించువాడా! ప్రమదానుభవమును (బ్రహ్మానందమును), ఆనందస్వరూపిణియైన లక్ష్మిని చేపట్టిన భావస్వరూపా! ప్రసన్నత చేకూర్చు మోక్షానందము కలిగించే శుభరంజనుడా! (నీకు అనేక వందనములు).

ఓ సర్వోత్తమా! పరాత్పరా! (సర్వశ్రేష్ఠా!) ఓ పరమేశ్వరా! వరములనొసంగు దేవదేవా! ఓ వరదామల! (నిర్మల లక్ష్మీనివాసా!) వాసుదేవా! శాశ్వతుడా! నిరంతరం వేంకటాద్రి ఆలయముగాగల వేంకటేశ్వరా! నరహరి నామముతో శేషతల్ప శాయియైన దేవాది దేవా! (నాకు శరణాగతియే ఆధారము తండ్రీ! నన్ను రక్షింపుము)

## 3-30

## మున్నుడి

"కూచిపూడి" సంప్రదాయంలో నాయిక (సత్యభామ) ఆగమనాన్ని సూచిస్తూ వైతాళికులు 'భామనే సత్యభామనే...' అంటూ పాడుతారు. వారందరికీ అన్నమాచార్యులవారి ఇటువంటి కీర్తనలే స్ఫూర్తి అయివుంటాయి. అలమేల్మంగమ్మ రాకను ప్రకటిస్తున్నారు ఆచార్యులవారు. అమ్మవారి సౌందర్యాన్ని రమణీయంగా వర్ణిస్తున్నారు. పచ్చల కడియాల 'పణతి' చెలంగ... అంటే మరకతములు తాపిన చేతి కడియములతో ఆ పడతి విరాజిల్లగా... అని అర్థం. రంభాది అప్సరసలు వారినటనారంభాన్ని ప్రదర్శిస్తూ అమ్మవారిని సేవిస్తున్నారట. ఏమి భావన!!

**ఉ॥ వచ్చెను వేంకటేశ్వరుని భామినియౌ అలమేలుమంగ ఈ**
**పచ్చల తాపదంబుగల బంగరువౌ కడియాల్మెరంగ తాన్,**
**మచ్చికయైన కీరముల మాటలు మైమరపించె జవ్వనిన్**
**మెచ్చెడి కీర్తనంబు వినిపించెను మేలుగ అన్నమార్యుడున్**

**రాగం : హిందోళం**

వచ్చెను అలమేలు మంగ ఈ
పచ్చల కడియాల పణతి చెలంగ ॥వచ్చెను॥

బంగారు చేదివిటీలు పూని
శృంగారవతులు వేవేలు రాగా
రంగైన వింజామరలు వీవ
మాంగల్య లీల సొంపగు జవరాలు ॥వచ్చెను॥

పలుకుల తేనియ లొలుక చెంత
చిలుకలు కలకల పలుక రవల
గిలుకు పావలు ముద్దు గులుక మేటి
కలికి చూపుల మొనలు తళుకని చిలుక ॥వచ్చెను॥





రంభాది సతులెల్ల చేరి ఎదుట
గంభీర గతులను మీర నటనా
రంభములను మేలు కోరి కొలువ
అంభోజాక్షుడౌ వేంకటేశునొయ్యారి ॥వచ్చెను॥

**భావామృతం :**

ఇదిగో చూడండి, ఇదే వచ్చెను అలమేల్మంగమ్మ. ఈమె మరకతములు తాపిన చేతి కడియములను ధరించి శోభిల్లుచున్నది.

అనేకమంది శృంగార పరిపూర్ణులైన చెలికత్తెలు బంగారు దివిటీలు (కాగడాలు) చేతిలో ధరించి వెంటరాగా అందమైన వింజామరలు (తెల్లని చామరము)చే వీచుటకు మరికొందరు ఆయత్తమవగా ఆ జవరాలి మాంగల్యము మనోహరముగా మెడలో వూగుచుండినది.

ఆమె పెంపుడు చిలుకలు, తేనెలొలుకునట్లు మధురముగా 'గలగల' పలుకు చుండినవి. ఆమె పావలు (పావుకోళ్ళు) ముద్దులొలుకు గిలుకు(సవ్వడి) ను చేయుచున్నవి, వాడియైన ఆమె చూపుల తూపులు తళుక్కుమని తళతళలను చిలుకుచున్నవి (వెదజల్లుచున్నవి).

రంభ మొదలైన అచ్చరలు అందరు చేరి ఆమె యెదుట గంభీరముగా నృత్యము సలుపుచుండిరి. వారి నటనా వైదుష్యమునంతయు ప్రదర్శించుచు ఆ దేవిని మేలుకొలుపు కొలువు సలుపుచున్నారు. పద్మదళాయతాక్షుడైన శ్రీవేంకటేశ్వరుని ఒయ్యారి భామ అయిన ఆదేవి మనోజ్ఞమైనది.

**3-31**

## మున్నుడి

మానవ జన్మకు సార్ధకత భగవద్దర్శనం మాత్రమే. ఐహికమైన, మానావ మానములు శరీరానికే గాని ఆత్మకు అంటవు. ఆత్మోన్నతి ఆ పరమాత్మ దర్శనంవలన కలుగుతుంది. సనకాది మునీశ్వరులు కూడా కోరేది అదే. దేవతలకు కూడా దుర్లభమైన ఆయన దర్శనం అతి సులువుగా ఈ ఏడుకొండల మీద దొరుకుతున్నది. నీరజనాభుని ఏ తపోదీక్షా లేకుండా తనివితీర చూచే భాగ్యం ఈ భూమ మీదనే కలుగుతున్నది. ఈ జన్మకిది చాలదా? ఆ స్వామి వారికి చెందిన వారిగా బ్రతికే కన్నా ఏంకావాలి? అన్నమయ్య చెప్పింది అక్షర సత్యం.

**మత్తకోకిల॥ చాలదా హరి! మేలు నాకిది జన్మధన్యత జెందె, నీ**
**పాలివారము వోలె మెల్గెడి భాగ్యమబ్బెను దేవరా!**
**వీలుకాదుర మౌనివర్యులు వేలయేండ్లు తపించినన్**
**మేలు వేంకటనాధు నమ్మిన మేటి అన్నయ తెల్పెరా.**

**రాగం : కొనడ**

చాలదా మా జన్మము నీ-
పాలింటి వారమై బ్రతుకగ గలిగె ॥చాలదా॥

కమలాసనాదులు కానని నీపై
మమకారము సేయ మార్గము గలిగె
అమరేంద్రాదులకు అందరాని నీ-
కొమరైన నామము కొనియాడ గలిగె ॥చాలదా॥

సనకాదులును కాన జాలని నిన్ను
తనివోవ మతిలోన తలపోయ గలిగె
ఘన మునీంద్రులకు అగమ్యమై వున్న
నిను సంతతము వర్ణింపగలిగె ॥చాలదా॥





పరమమై భవ్యమై పరగిన నీ
యిర విట్టిదని మాకు నెఱుగంగ గలిగె
తిరువేంకటాచలాధిప నిన్ను యీ
ధరమీద పలుమారు దరిసింప గలిగె ॥చాలదా॥

**భావామృతం :**

ఓ దేవదేవా! మా జన్మమునకు ఈ భాగ్యము చాలదా? నీకు చెందిన వారు అనిపించుకొంటూ బ్రతుకగలిగితే అంతకన్నా కావలసినది ఏమున్నది?

బ్రహ్మాది దేవతలు కూడా నిన్ను దర్శించాలంటే, ధ్యానించి తపించాలి. అప్పటికప్పుడు నిన్ను చూడాలంటే అయ్యేపనికాదు. దేవేంద్రాదులకు కూడ మనోజ్ఞమైన నీ నామమే. నిన్ను కీర్తించుట కాధారము. (అటువంటప్పుడు మాకు ఇంకా ఆలోచన యెందుకు? నీ నామస్మరణను చేబడితే చాలు కదా!)

సనక సనందనాది ఋషులు కూడా నిన్ను చూడాలి అంటే ద్వారపాలకుల అనుమతి తీసికోవలసి వచ్చింది. మరి మాకు ఆ బాధలేదు. తనివిదీరా నిన్ను మనస్సులో ధ్యానించగలుగుతున్నాం. (కళ్లుమూసుకున్నా నీ దివ్యమంగళ రూపం మా కనులముందు కనబడుతూనే వున్నది) గొప్ప గొప్ప యోగీశ్వరులకు నీవు అగమ్యమైన వాడవు. అటువంటి నిన్ను ఎప్పుడూ వర్ణించి కొనియాడే భాగ్యం కలిగింది. ఇది చాలదా? ఇంతకన్నా ఏం కావాలి?

నీవు పరబ్రహ్మావు. పుట్టుక అంతము వృద్ధి లేని అనంతుడవు. అటువంటి నీ వునికి ఇట్టిది అని మేము తెలుసుకోగలిగితిమి. ఓ తిరుమలనాథా! శ్రీవేంకటేశ్వరా! ఏ లోకమూ పోకుండా ఈ భూమి మీదనే నిన్ను దర్శించే అదృష్టం కలిగింది. ఇది చాలు మాకు ఇంకేమీ వద్దు.

## మున్నుడి 3-32

నేను ఈ మున్నుడి వ్రాస్తున్నది, సమయం ఆరు గంటలు, తెల్లవారబోతోంది. వైకుంఠ ఏకాదశి, శుక్రవారం. ఇంతకంటే ఈ కీర్తన చెప్పటానికి మంచి సమయం ఏముంటుంది? ఇది నా అదృష్టం. స్వయంగా పర్యవేక్షిస్తూ ఆనాడు ఇటువంటి సమయంలోనే అన్నమాచార్యులవారు ఈ కీర్తన చెప్పివుంటారు. ఆనాటి స్వామి సేవను మీ మనోనేత్రంతో మీరూ తిలకించి తరించండి. ఈ కీర్తనకున్న ఇంకొక ప్రత్యేకత ఏమంటే అన్నమయ్య కీర్తనలలో దర్శనమిచ్చే శ్రీవేంకటేశుని 'మకుటం' లేకపోవటం. నిఘంటువు లేకుండా దీన్ని వివరించగల పండితులు... బహుకొద్దిమంది.

**ఉ॥ కంటిమి శుక్రవారమనగా ఘడియల్ యిట ఏడు, స్వామి! నీ**
**కంటుచునుండె మా జనని ఆ యలమేల్ తిరుమంగచేరికై**
**పంటగ కన్నులున్ వెలిగె పాడెను కీర్తన మన్నమార్యుడున్**
**జంటగ భావమున్ దెలుప సాయము సేయర వేంకటేశ్వరా!**

**రాగం : ఆనందభైరవి**

కంటి శుక్రవారము గడియలేడింట
అంటి అలమేల్మంగ అండనుండే స్వామి ॥కంటి॥

సొమ్ములన్నీ కడబెట్టి సొంపుతో గోఅము గట్టి
కమ్మని కదంబము కప్పు పన్నీరు
చెమ్మతోన వేష్టువలు రొమ్ము తలమొలచుట్టి
తుమ్మెద మైచాయతోన నెమ్మదినుండే స్వామిని ॥కంటి॥

పచ్చకప్పురమె నూఱి పసిడి గిన్నెలనించి
తెచ్చి శిరసాదిగ దిగనలది
అచ్చెరపడి చూడ అందరి కన్నులకింపై
నిచ్చె మల్లెపూల వలె నిటుతానుండే స్వామిని ॥కంటి॥





తట్టు పునుగె కూర్చి చట్టలు చేరిచి నిప్పు
పట్టి కరగించి వెండి పళ్యాల నించి
దట్టముగ మేను నిండ పట్టించి దిద్ది
బిట్టు వేడుక మురియుచుండే బిత్తరి స్వామికి ॥కంటి॥

**భావామృతం :**

శుక్రవారమునాడు, ఏడు ఘడియల సమయంలో ఈ మహానుభావుని చూశాను. ఈయన తన దేవేరియైన అలమేల్మంగను అంటిపెట్టుకొనివామె వెంటనే వున్నాడు. (చూడండి... చూచి తరించండి.)

ఈ స్వామి తన నగలన్నీ ఒకప్రక్కన పెట్టి (అభిషేకం చేస్తే నగలు తడిసి పాడవుతాయికదా!) అందంగా గోఅము (గోచీవంటి చిన్న వస్త్రము) నొకదాన్ని కట్టాడు. పన్నీరు కలిపి చేసిన కమ్మని కదంబమును (మిశ్రమాన్ని) తడిసిన వలువలు రొమ్ము, తల, మొలచుట్టూ బిగింపబడియుండగా తుమ్మెద వంటి శరీర ఛాయగల ఆ శ్రీవేంకటేశ్వర స్వామి తన ప్రేమను (నెమ్మది) వ్యక్తము చేయుచూ శోభించుచున్నాడు.

బాగుగా నూఱిన పచ్చకర్పూరమును బంగారు గిన్నెలో నింపి తెచ్చి ఆపాదమస్తకము దిట్టముగా అద్ది, చూచువారు ఆశ్చర్య చకితులవుతుండగా వారందరికన్నుల కింపువునట్లు నిత్యమల్లె పువ్వువలె ఇచ్చట ప్రకాశించుచున్న ఈ శ్రీవేంకటేశ్వర స్వామిని (తిలకించి తరించండి)

'పునుగుపిల్లి' నుంచి వచ్చిన తట్టు పునుగు (తట్టి ఎత్తిన మేలు రకపు పునుగు అను సుగంధద్రవ్యము) తో బాగుగా పూతలు వేసి నిప్పులో కరిగించి వెండి పళ్లెములలో నింపఇ తీసికొని వచ్చారు. దానిని స్వామి మేనికి దిట్టంగా పట్టించారు. తరువాత తీరికగా తీర్చి దిద్దారు. దానివలన శీఘ్రముగా ఆనందించిన ఆ తిరుమలనాథుడు బిత్తర స్వామియై (ప్రకాశము వెదజల్లు స్వామియై) కనువిందు చేసినాడు.

**3-33**

## మున్నుడి

వైష్ణవ మతదీక్ష తీసికొనిన అనంతరం తన గురువులు హరి శరణాగతిని పొందిన తనకు జ్ఞానబోధను చేసి వైకుంఠ ద్వారాలు తెరిచారని తనకిక కర్మలతోను వాటి ఫలాలతోను నిమిత్తం లేదని చెబుతున్నారు అన్నమాచార్యులవారు. నరహరిపై తనకు భక్తిని 'రేపిరి' అని అంటున్నారు. పరమాత్ముడైన వేంకటేశ్వరుని పొందులోగల ఆనందాన్ని తనకు అనుభవమయ్యేట్లు చేసి స్వామికీ తనకూ 'పొందుట' యేర్పరచారని కనుక తనకిక ఏ ఉద్యోగమూ ఎందుకని ప్రశ్నించి, అవేవీ వొద్దు వొద్దు అంటున్నారు.

**చం॥ నరహరి నీదయామృతము నన్నిటుముంచగ కర్మలేల? నీ**
**శరణము బొందు జీవులకు సాధ్యమె స్వేచ్ఛగ నుంటయెన్నడున్**
**నరకము రాదు, విష్ణుపురి నాకికదక్కును అన్నమయ్యనెన్**
**తిరుమలనాథు గొల్వుమని తేల్చిరి శ్రీహరిదాసులెల్లరున్**

**రాగం : బౌళి**

నరహరి నీదయమీదట - నా చేతలు గొన్నా?
శరణాగతియును జీవుని స్వతంత్రము రెండా? ॥నరహరి॥

మొఱయుచు నరకపు వాకిలి-మూసిరి హరి నీదాసులు
తెఱచిరి వైకుంఠపురము-తెరువుల వాకిళ్లు
నుఱిపిరి పాపములన్నియు-నుగ్గుగ నిటు తూర్పెత్తిరి
వెఱవము వెఱవము కర్మపు -విధులిక మాకేలా? ॥నరహరి॥

పాపిరి నా యజ్ఞానము-పరమాత్ముడ నీ దాసులు
చూపిరి నిను నామతిలో -సులభముగా నాకు
రేపిరి నీపై భక్తిని -రేయిని బగలును నాలో
వోపము వోపము తపములు -వూరకె యికనేలా? ॥నరహరి॥





దిద్దిరి నీ ధర్మమునకు -దేవా శ్రీవేంకటేశ్వర
అద్దిరి నీ దాసులు నీ -ఆనందములోన
ఇద్దరి నీ నా పొందులు-యేర్పరి చిటువలె గూర్చిరి
వొద్దిక నొద్దిక నాకిక- నుద్యోగము లేల? ॥నరహరి॥

**భావామృతం :**

ఓ నరహరీ! నాపై నీదయ కలిగిన తరువాత నాకోసం నేను చేసికొనవలసిన పనులేమున్నాయి? కొన్ని కూడా లేవు. స్వామీ! నిన్ను శరణుపొందిన జీవునికి స్వతంత్ర్యత యెక్కడుంటుంది? నీ శరణు వాడి స్వతంత్ర్యము అనే రెండు వుండనే వుండవు.

ప్రభు! నీ దాసులు గట్టిగా నీనామం పలుకుతూ నరకపు ద్వారాలన్నీ మూసేయించారు. వైకుంఠద్వారాలు తెరిచిపెట్టారు. మా పాపములన్నీ నుగ్గునుగ్గు చేశారు. తూర్పారబట్టారు. (జల్లెడ బట్టారు) ఇక మేం భయపడవలసిన పనిలేదు. ఆ కర్మల పద్ధతులతోను పని లేనేలేదు. (మాకు అంతా శ్రీహరియే).

పరమాత్మా! నీ దాసులు నా యజ్ఞానమును తొలగించి వేశారు. అతి సులువుగా వారు నిన్ను నా హృదయంలో చూపినారు. రేయింబవళ్లు నీపై భక్తి కుదురునట్లు చేశారు. మేము తపస్సు నాచరించలేము. మాకు ఏ తపస్సుతో అవసరమే లేదు. (నీ కరుణ మాపై వుంటే చాలు).

దేవా! శ్రీవేంకటేశ్వరా! నీ దాసులు నాకు భాగవత ధర్మమును ప్రబోధించి నీ శరణాగతికి అలవాటు చేశారు. నీ కీర్తన స్మరణ వలన దొరికే అమందానందానుభవమును నాకు రుచి చూపించారు. వారు నీకూ నాకూ సంయోగం ఒద్దికతో కలిగించి నన్ను ధన్యుని చేశారు. ఇక నాకు యే స్వతంత్ర ప్రయత్నములతో పనియే లేదు. అవి నాకు వొద్దేవొద్దు. వాటితో ఇంకా నేను సాధించాల్సిందేమున్నది?

**3-34**

## మున్నుడి

సుగ్రీవుడంటే మంచి మెడ కలవాడని అర్థం. అహోబల నరసింహుని 'సుగ్రీవ నారసింహు'డని కీర్తిస్తున్నారు అన్నమాచార్యులవారు. అవధారు దేవ (ఆలకింపుము ప్రభూ!) అని పలుమార్లు వేడుకొంటున్నారు. వాయుదేవుడు ఆ స్వామికి సరినాలవట్టి మిచ్చాడట. ఆలవట్టము అంటే వస్త్రముతో చేసిన గుండ్రని విసనకర్ర. అరుదుగ (అపూర్వంగా) నున్న ఆ నరసింహరూపుని సిరులు మించిన శ్రీవేంకటాద్రి నాథునిగా భావించిన పరమయోగీంద్రులు ఆయనను ప్రార్థిస్తున్నారట. అది అన్నమయ్య అనుపమ సృష్టి.

**ఆ.వె॥ సులభుడైన యట్టి సుగ్రీవ నరసింహు**
**కొలిచెనన్నమయ్య కోర్కెమీర**
**అగ్రపూజలిడెను 'అవధారు దేవ'ని**
**అద్భుతమగు కీర్తనాలపించె.**

**రాగం : తోడి**

సుగ్రీవ నారసింహా సులభుడ వందరికి
అగ్రేసరుడ నీవు అవధారుదేవ ॥సుగ్రీవ॥

సనకాదులొకవంక జయవెట్టుచున్నారు
ఎనసి సురలు చేతులెత్తి మొక్కేరు
మునులిరు మేలానుండి మునుకొని నుతించేరు
అనుపమాలంకార అవధారు దేవ ॥సుగ్రీవ॥

గంగాది నదులెల్ల కడిగీ నీ పాదములు
పొంగుచు సప్తరుషులు పూజించేరు
సంగతి వాయుదేవుడు సరినాలవట్టమిడీ
అంగజ కోటిరూప అవధారుదేవ ॥సుగ్రీవ॥





పరగ నారదాదులు పాడేరు నీ చరిత
పరమయోగీంద్రులు భావించేరు
సిరులు మించిన యట్టి శ్రీవేంకటాద్రి మీద
అరుదుగ నున్నాడవు అవధారు దేవ ॥సుగ్రీవ॥

**భావామృతం :**

చక్కని మెడ కలిగినట్టి ఓ నరసింహ రూపా! నీవు అందరికీ అతి సులువుగా లభించు (అనుగ్రహించు) వాడవు. సర్వాధికుడవు నీవే. ఓదేవా! అవధారు (ఆలకింపుము).

నీకొకవైపున నిలచి సనక సనంద నాది ఋషులు జయజయధ్వానములతో కీర్తిస్తున్నారు. దేవతలంతా చేతులు పైకెత్తి నీకు నమస్కరించుచున్నారు. మునుకొని (ముందుండి) నీకిరువైపులా మునులు నిలుచుకొని నిన్ను నుతిస్తున్నారు. సాటిలేనట్లు అలంకరింపబడియున్న ఓ నృసింహ దేవా! మా మొర లాలకింపుము. రక్షింపుము ప్రభూ!

స్వామీ! గంగ మొదలైన పుణ్యనదులన్నీ ఈ భవనాశినీ నదిరూపంలో వచ్చి, నీ పాదములను కడుగుచున్నవి. ఆనందంతో పొంగిపోతూ సప్తఋషులు నిన్ను పూజిస్తున్నారు. ఇక వాయుదేవుడు నిన్ను సాకారుడై సమీపించి ఆలవట్టము (వస్త్రముతో తయారు చేయబడిన గుండ్రటి విసనకఱ్ఱ)ను ధరించి నీకు వీస్తున్నాడు. కోటి అంగజుల (అనేక మన్మథుల) వలె చక్కటి రూపముగల ఓ దేవా! మా ప్రార్థనల నాలకింపుము ప్రభూ!

నారదుడు మొదలైన వారంతా నీ చరితమును చక్కగా పాడుచున్నారు. పరమయోగీంద్రులు నిన్ను వైభవోపేతుడైన శ్రీవేంకటేశ్వరునిగా భావించి ప్రస్తుతించుచున్నారు. నీవు అరుదుగా నున్నాడవు. (ఇదివరకు ఎవరికీ ఇటువంటి నరుడు సింహము కలిసిన రూపంలేదు) ఓ దేవా! అవధారు మా వినతిని ఆలకింపుము తండ్రీ!

## మున్నుడి 3-35

తండ్రి అడుగుజాడల్లోనే శ్రీవేంకటేశ్వరునికి అంకితమై అన్నమయ్య కుమారుడు 'పెదతిరుమలయ్య' చెప్పిన జగద్విఖ్యాతమైన కీర్తన ఇది. భక్తితో ఒకసారి పాడితే కేశవనామాలు పఠించిన పుణ్యమే కాక శ్రీమన్నారాయణుని దశావతారములను శ్రీవేంకటేశ్వరుని స్మరించిన పుణ్యం కూడా మీ 'కాతా' లో 'జమ' అవుతుంది. నన్ను నమ్మండి. ఈ కీర్తన పదే పదే వినండి. మనకు తెలియకనే అనేక పాపాలు 'అక్కడ' మన కాతాలో వస్తూనే వున్నాయి. 'వీడిమొహం' అని ఈ క్షణాన నన్ను మీరు తిట్టుకొంటే మీ 'పాపం!' కాతాలో ప్లస్ ఒకటి అయింది. అందుకే 'నమో వేంకటేశాయ' అనండి.

**కం॥ పెద తిరుమలయ్య పూనుచు**
**ముదమారగ భజన వోలె మురహరి కొరకై**
**పది అవతారంబుల నిటు**
**మది పులకించంగ పాడె మరి మరి వినరో!**

**రాగం : హిందోళ**

మత్స్య కూర్మ వరాహ మనుష్య సింహ వామనా
యిచ్చ రామ రామ రామ హితబుద్ధి కలికీ ॥మత్స్య॥

నన్ను గావు కేశవ నారాయణ మాధవ
మన్నించు గోవింద విష్ణు మధుసూదన
వన్నెల త్రివిక్రమ వామనా శ్రీధరా
సన్నుతించే హృషీకేశ సారెకు పద్మనాభ ॥మత్స్య॥

కంటిమి దామోదర సంకరుషణ వాసుదేవ
అంటే జాలు ప్రద్యుమ్నుడా అనిరుద్ధుడా
తొంటే(టి) పురుషోత్తమ అథోక్షజ నారసింహమా
జంటవాయకు మచ్యుత జనార్దన ॥మత్స్య॥





మొక్కేము వుపేంద్ర హరి మోహన శ్రీకృష్ణరాయ
యెక్కితి శ్రీవేంకట మిందిరానాథ
యిక్కువ నీ నామములు యివియే నా జపములు
చక్కగా నీ దాసులము సర్వేశ అనంతా ॥మత్స్య॥

**భావామృతం :**

ఓ మత్స్యావతారా! కూర్మరూపా! వరాహమూర్తీ! నారసింహా! వామనాకారా! పరశురామా! శ్రీరామా! బలరామదేవా! (శ్రీకృష్ణా!) హితమును బోధించిన బుద్ధభగవానుడా! కలికీ! (నీకు వందనములు).

ఓ కేశవా! నారాయణుడా! మాధవా! నన్ను రక్షింపుము తండ్రీ! ఓ గోవిందుడా! విష్ణుమూర్తీ! మధుసూదనా! నన్ను మన్నింపుము అనేక వర్ణములతో విరాజిల్లిన త్రివిక్రమా! వామనరూపా! శ్రీధరా! నిన్ను సన్నుతించెదను. ఓ హృషీకేశా! పద్మనాభా! మాటి మాటికీ నిన్ను స్మరించెదను.

ఓ దామోదరా! సంకర్షణా! వాసుదేవా! నిన్ను కనుగొన్నాము. ప్రద్యుమ్నా! అనిరుద్ధా! అంటే చాలు మా పాపములు పటాపంచలై పోతాయి. ఆది పురుషోత్తమా! అధోక్షజా! నరసింహ స్వరూపా! (నీకు అనేక నమస్కారములు). ఓ అచ్యుతా! జనార్దనా! ఏనాటికీ నా తోడు విడిచిపెట్టవద్దు ప్రభూ!

ఓ ఉపేంద్రా! శ్రీహరీ! మోహన శ్రీకృష్ణా నీకు మ్రొక్కెదము దేవా! ఓ ఇందిరారమశ్రీ! శ్రీవేంటాద్రి నెక్కి నీ జాడ కనుగొని నీయొక్క నామములను నా జపముగా గానము చేయుచున్నాను. ఓ అనంతా! నీవు సర్వేశుడవు అందుచే నీ దాసులమైన మమ్ము చక్కగా పరిపాలింపుము తండ్రీ!

## మున్నుడి 3-36

లక్ష్మీనారాయణుల వలె కనిపిస్తున్న ఈ పద్మావతి, శ్రీనివాసులు ఇద్దరికి పెండ్లియోగము (పెండ్లి సంబంధము) ఎట్లు కుదిరిందో కానీ ఇద్దరికీ ఎన్ని పోలికలున్నాయో చూడండి అని ఆ వివరాలందిస్తున్నారు అన్నమాచార్యులవారు. ఈ పెళ్లి సంబరం సందర్భంగా నీ భక్తులమయిన మాకు పప్పన్నం పెట్టి తాంబూలం ఇయ్యి ప్రభూ! అని చనువుగా అడుగుతున్నారు. ఇద్దరికీ ఇన్ని పోలికలున్నాయి కనుక మేనత్త, మేనమామ పిల్లలేమో మేనరికం బాగుందని (మేలుమేలని) వారి సంబంధాన్ని (సమ్మందము) మెచ్చుకొంటున్నారు. ప్రతిపెండ్లిలోను పాడదగ్గ కీర్తన అని నేను వేరే చెప్పాలా...

**తే॥ ఎట్టు గూడె పెండిలి యోగ మిర్వురికిని**
**లక్ష్మినారాయణుల యోగలబ్ధి కలిగె**
**ఎంతచక్కటి పోలిక లెరుగ దెలిపె**
**అన్నమార్యుడు!! కీర్తన మద్భుతమురః.**

**రాగం : హరి కాంభోజి**

ఎట్టుగూడె పెండ్లి యోగ మిద్దరికి నీవేళ
అట్టె లక్ష్మీనారాయణ యోగము ॥ఎట్టు॥

నెలత కమలవాసి నీవు కమలాక్షుడవు
పొలతికి నీకు గూడె పొంతనాలు
వలుద చక్రవాలు వనిత కుచాలు నీవు
యెలమి చక్రాయుధుడ విద్దరికి తగును ॥ఎట్టు॥

తరుణి నీలకుంతలి తగు నీలవర్ణుడవు
సరుస మీకే తగు సమ్మంధము
నిరతి హేమ వర్ణాకె నీవు పీతాంబరుడవు
సరవి నిద్దరి కొక్క జాతియ్యము ॥ఎట్టు॥





పాలవెల్లి పుట్టెనాకె పాలవెల్లి యిల్లు నీకు
మేలు మేలు యిద్దరికి మేనవావి
యీ లీల శ్రీవేంకటేశ యింతి నీవు గూడితివి
సోలి మాకు పెట్టరాదా సోబన విడేలు ॥ఎట్టు॥

**భావామృతం :**

స్వయంగా లక్ష్మీనారాయణుల వలె కనిపించుచున్న వీరిద్దరికీ (పద్మావతీ శ్రీనివాసులకు) పెండ్లి యోగము (పెండ్లి సంబంధము) ఎట్టు (ఎట్లు) కుదిరినదో కాని లక్ష్మీనారాయణ యోగము (కలయిక) లభించినట్లు వున్నది.

ఈ వధువు కమలవాసిని (పద్మాలయయైన శ్రీలక్ష్మి) ఈయనేమో కమలాక్షుడు (శ్రీమన్నారాయణుడు) ఈ వనితకు నీకూ చక్కటి పొత్తు కుదిరినది. స్థూలమైన చక్రవాక పక్షుల వంటి కుచయుగళము గల కోమలి ఈమె. మరి మురిపెముగా చక్రాయుధుడు ఈ వరుడు. ఈ ఇరువురికీ సరిపోయింది.

ఈ సుందరి కేశములు దట్టమై నల్లగా నుండుటచే ఈమెను నీలకుంతల అని పిలువవచ్చును. ఇక ఈయనేమో నీలవర్ణుడు (శ్యామసుందరుడు) వీరికి సంబంధము కూడ చక్కగా కుదిరినది. ఆకె (ఆమె) మిక్కిలి బంగారు శరీర ఛాయగల భామ. ఇక ఆయనేమో పీతాంబర ధరుడు (బంగారు పచ్చపట్టు వలువలు ధరించు స్వామి) ఈ క్రమమున వీరి జాతీయము కూడ నొకటిగానే తోచుచున్నది.

ఆమె క్షీరాబ్ధి కన్య. ఆయనేమో క్షీరాబ్ధి శయనుడు. భళిభళీ! మేనరికం ఎంత చక్కగా కుదిరిందండీ!! ఈ విధముగా ఓ శ్రీ వేంటేశ్వరా! ఈ కన్యను నీవు పరిణయ మాడితివి. పరవశించిపోవునట్లు మాకు పెళ్లి పప్పన్నం పెట్టి తాంబూలమిచ్చి ధన్యులను చేయుము ప్రభూ! (ఈ జన్మకు ఇది చాలు తండ్రీ!)

**3-37**

## మున్నుడి

సుండో! అనేపదం, సుమా! అనే పదమై నేటి కాలంలో ఇంకా వాడుకలో వున్నది. ఇదియే సత్యము సుండో! (సుమా!) అని చెబుతున్నారు అన్నమాచార్యులవారు. ఇహమున (జీవించి యున్న లోకమున) పరమున (ఊర్ధ్వలోకమున) రెంటిలోను ఈ స్వామియే మనకు కావలసినవి ఇచ్చువాడు. 'మనికై' అంటే మన్నికయై అని అర్థం. అన్నమయ్య చాటిన ఈ హరినామ సంకీర్తనా మహాత్యాన్ని తెలుసుకొని శ్రీవేంకటేశుని దాసులై తరించండి. అజ్ఞానం వలన ముప్పాతిక పాలు జీవితం వ్యర్థం అయింది. ఇకనైన మేలుకోండి.

**ఉ॥ చాటెద నేనిదే వినుడు సత్యము సుండి! అనెన్ తరించగా**
**చేటులు రావుగా ఇతని సేవలు చేసినచో ముదంబునన్**
**మేటిది కీర్తనంబు భళి! మేలుగ జెప్పెను అన్నమార్యుడున్**
**దీటుగ పార్వతీ స్తుతు, మదిన్ తను నిల్పెను వేంకటేశునిన్.**

**రాగం : శుద్ధసావేరి**

చాటెద నిదియే సత్యము సుండో
చేటులే దితని సేవించినను ॥చాటెద॥

హరినొల్లని వా రసురులు సుండో
సురులీతని దాసులు సుండో
పరమాత్ముడితడే ప్రాణము సుండో
మరుగక మరచిన మరి లేదికను ॥చాటెద॥

వేద రక్షకుడు విష్ణుడు సుండో
సోదించె శుకుడు అచ్చుగ సుండో
ఆది బ్రహ్మగన్నాతడు సుండో
ఏదెస వెదకిన ఇతడే ఘనుడు ॥చాటెద॥





ఇహ పర మొసగను ఇతడే సుండో
వహి నుతించె పార్వతి సుండో
రహస్య మిదియే రహి శ్రీవేంకట
మహీధరంబున మనికై నిలిచె ॥చాటెద॥

**భావామృతం :**

నేను చాటి చెబుతున్నాను. ఓ జనులారా! వినండి. ఇదియే నిజము సుమా! ఏ విధమైన అపకారము లేనిదే ఇతని సేవ. కనుక ఇతనిని సేవించి తరించండి. (నామాట వినండి)

ఎవరైతే శ్రీహరిని ఒప్పని సేవించరో, వారంతా అసురులు, (కొమ్ములు, కోరలు వుండనక్కరలేదు). ఇతని దాసులై సేవించే వారంతా సురులు (దేవతలు) (అణిమాది మహిమలుండ నక్కరలేదు). ఈయనే పరమాత్ముడు. ప్రాణము రూపంలో మనందరిలోనూ వున్నాడని గ్రహించండి. ఇతనియందు అనురక్తులుగాక మఱచిపోతే, ఇక వారికి అథోగతియే. ముక్తి ఎన్నటికీ రాదు. (ఇవ్వాళ దీక్షితులు రేపు ఇంకెవడో పక్షి... అంతే తేడా).

ఈ శ్రీమహా విష్ణువే ఆనాడు సోమకాసురుని వధించి వేదములను రక్షించాడు. చక్కగా శోధన చేసి శ్రీ శుకమహర్షి మనకు భాగవతం ద్వారా భగవంతుని దర్శింప జేయించారు. ఈయనే ఆదియైన బ్రహ్మను కన్నతండ్రి. మీరు ఏ దిక్కున వెతికినా ఈయనే ఘనునిగా గోచరిస్తాడు. (అయితే... 'వున్నాడు' అని నమ్మి... వెదకాలి. 'వున్నాడా?' అని వెదకితే వుండడు)

ఇహలోకంలో మనకు కావలసిన సంతోషము, పరలోకంలో కావలసిన పుణ్యమును అనుగ్రహించేది వేరెవ్వరూ కాదు, ఈ మహానుభావుడే. పరమశివుని అర్థాంగియైన పార్వతీ దేవి వహించి నిత్యమూ స్తుతించునది ఈయననే. నేను ఇంకొక పరమ రహస్యం చెబుతాను వినండి. ఆనంద నిలయుడై శ్రీవేంకట పర్వతం మీద వున్న ఈ శ్రీవేంకటేశ్వరుడే మన్నికయైన దేవుడు. ఇది సత్యం.

**3-38**

## మున్నుడి

అన్నమాచార్యులవారు తనుకూడా ఒక గోపిక వలె భావించుచూ పాడిన చక్కటి కీర్తన ఇది. (బహుశా కృష్ణాష్టమి నాడు చెప్పి వుంటారీ కీర్తన). సర్వాభరణ భూషిత చతుర్భుజాకారంతో దేవకీ వసుదేవులకు తానెందుకు వారి కడుపున పుడుతున్నాడో వివరించి వారికి కర్తవ్యం బోధించి మరీ పుట్టాడు. బ్రహ్మరుద్రులచే కీర్తించబడ్డాడు. యశోదా నందగోపుల ఇంటజేరి గోపాలకృష్ణుడైనాడు. ఇదిగో నేడు మన మహద్భాగ్యంగా తిరువేంకటేశుడై అలమేల్మంగమ్మతో మన యెదుటనే వున్నాడు.

**కం॥ శ్రావణ బహుళాష్టమి తిథి**
**ఈ వసుధ జనించినాడు యీ కృష్ణుడు తాన్**
**దేవకి నందను డాయెను**
**గోవిందుడు, అన్నమయ్య గోపిక ఆయెన్.**

**రాగం : కాపి**

సతులాలా చూడరే శ్రావణ బహుళాష్టమి
కతలాయ నడురేయి కలిగె శ్రీకృష్ణుడు ॥సతులాలా॥

పుట్టేయపుడే చతుర్భుజాలు శంఖ చక్రాలు
ఎట్టు ధరియించెనే యీ కృష్ణుడు
అట్టే కిరీటము ఆభరణాలు ధరించి
ఎట్ట ఎదుట వున్నాడు ఈ కృష్ణుడు ॥ సతులాలా॥

వచ్చి బ్రహ్మయు రుద్రుడు వాకిట నుతియించగాను
ఇచ్చగించి వినుచున్నాడీ కృష్ణుడు
ముచ్చటాడీ దేవకితో ముంచి వసుదేవునితో
హెచ్చిన మహిమలతో ఈ కృష్ణుడు ॥సతులాలా॥





కొదదీర మరి నందగోపునకు యశోదకు
ఇదివో తా బిడ్డడాయె నీ కృష్ణుడు
అదన శ్రీవేంకటేశుడై అలమేల్మంగ గూడి
ఎదుటనే నిలుచున్నాడీ (వున్నాడుఈ) కృష్ణుడు॥సతులాలా॥

**భావామృతం :**

ఓ సతులారా! గోపికలారా! ఇటు చూడండి. ఈరోజు శ్రావణ బహుళాష్టమి. నేటి అర్ధరాత్రి వేళ ఈ శ్రీకృష్ణుడు వుదయించాడు. ఈయన చరిత్ర యెన్నో భాగవత కథలయినవి.

ఈయన పుడుతున్నప్పుడే చతుర్భుజునిగా పుట్టాడు. శంఖ చక్రాది ఆయుధములు ధరించి వాటితోబాటు పుట్టాడు. కిరీట ధారియైన ఆ శ్రీకృష్ణుడు యెట్టనెదుటనే ప్రత్యక్షమయ్యాడు. ఆ మహానుభావుడు అవతరించిన వెంటనే చతుర్ముఖ బ్రహ్మతో బాటు పరమశివుడు కూడా భూలోకానికి వచ్చి ఆయన అవతారాన్ని స్వాగతించి కీర్తించారు.

వాకిటిలో నిలిచి స్తుతిస్తున్న వారిని ప్రీతితో విని ఆనందించుచున్నాడు ఈ కృష్ణుడు. తరువాత ప్రేమతో (వారి పురాకృత కర్మవలన) దేవకీ వసుదేవులకు తనెందుకు వారికి జన్మిస్తున్నదీ వివరించి మరీ పుట్టాడు. అద్భుతమైన దివ్య మహిమలను చూపించి వారిని ధన్యులను చేశాడు.

ఇదిగో ఆ తరువాత కొరత తీరునట్లుగా యశోదా నంద- గోపుల యింట (రేపల్లెలో) చేరాడు. ముద్దుల బిడ్డడయ్యాడు. అదట్లా వుండగా అదన (ఈ సమయమున) శ్రీవేంకటేశ్వరుడై తన దేవేరి అలమేల్మంగతో గూడి మన యెదుటనే ఆ శ్రీకృష్ణుడు నిలిచియున్నాడు. మీరు ధన్యులు భావించి తరించండి.

## 3-39

## మున్నుడి

చిన తిరుమలయ్య కూడ తాళ్లపాక అన్నమాచార్యులవారి బాటలోనే నడిచి శ్రీవేంకటేశ్వరునిపై సంకీర్తనలు రచించి తరించాడు. కీర్తనలకు వేంకటేశుని మకుటం కూడా అలాగే వుండుట వలన వత్యాసం గుర్తించడం సామాన్యులకసాధ్యం. ఈ కీర్తనలో చిన తిరుమలాచార్యులవారు, ఏవేవో మందులు (భవరోగనివారణ కోసం) తయారు చేయుటకు 'నూరి' శ్రమపడవద్దు, తాగినోరు చేదయి బాధ పడవద్దు అని ఓదారుస్తున్నారు. ఒకచోట నీదగ్గరలోనే సంజీవని (ఆనాడు హనుమంతుడు తెచ్చి లక్ష్మణుని బ్రతికించిన) మందు వున్నదయ్యా తీసికో అంటున్నారు. ఏమిటా మందు? ఎక్కడ దొరుకుతుంది? వినండి మరి...

**కం॥ నూరుచు త్రాగే మందుల**
**నోరే చేదవును, వలదు, నోటికి మేలా**
**చేరువగల 'సంజీవని'**
**కోరుము చిరతిరుమలయ్య కూడవచించెన్**

**రాగం : శుద్ధ సావేరి**

నూర వద్దు తాగవద్దు నోరు చేదుగావద్దు
చేరువ నొక చోట సంజీవి వున్న దిదివో ॥నూరవద్దు॥

పొలమెల్లా తిరిగాడి పొడి పడనె వద్దు
తలకక గడ్డపార తవ్వవద్దు
వలవని వాగుల వంకల వెదకవద్దు
చెలగి వొకచోట సంజీవి వున్న దిదివో ॥నూరవ॥

మొక్కలాన చెరువులో మునిగి చూడవద్దు
నిక్కిన పుట్టల మీద నెమకవద్దు
వెక్కసాన చేతిపైడి వెలపెట్టి కొనవద్దు
చిక్కులెల్లా బాపెటి సంజీవి వున్నదిదివో ॥నూరవద్దు॥





దీవులను నో (ఓ) డ లెక్కి తిరుగాడనే వద్దు
సోవల బిలములోన చొరవద్దు
కావించి గ్రహణాదికాలము వెదకవద్దు
శ్రీవేంకటనాథుడై సంజీవి వున్నదిదివో ॥నూరవద్దు॥

**భావామృతం :**

ఓ మానవులారా! శ్రమ వద్దు, నూరటం, చేదు మందులు త్రాగటం వంటి అనవసరమైన యాతనలు పడవద్దు. నోరు చేదు అవటం తప్ప (ఈ భవరోగ నివారణకు ఆ మందులేవీ వుపయోగపడవు) లాభం లేదు. మీ సమీపముననే ఒక దివ్యమైన 'సంజీవిని' వున్నది. ఇదిగో అనవసరంగా ఎందుకు శ్రమపడతారు?

పొలముల వెంటపడి తిరిగి వెదకవలసిన పనేలేదు. అలా తిరిగి నుగ్గునుగ్గయిపోకండి. తలకక (భయపడకుండా) ఏవేవో చోట్ల గడ్డపారలతో తవ్వి కష్టపడవద్దు. వలనని (వేదన చెందుతూ) వాగుల వెంట వంకలవెంట తిరిగి వెదకవద్దు. దివ్యమైన సంజీవిని యొకచోట వున్నది. ఇదిగో తీసికోండి.

మొక్కలాన (ఎంతో ఉత్సాహపడి) చెఱువులలో మునిగి వెదకి చూడవలసిన పనియేలేదు. బాగా పెఱిగిపోయిన పుట్టలమీద వెదకనవసరం లేదు. వెక్కసాన (అధికముగా యెంత కావాలంటే అంత లభించే) వున్న చేతి బంగారం అది. ఎందుకు వెలపెట్టి కొంటారు? ఈ సంజీవిని వున్నది చూశారా, ఇది అన్ని ఇబ్బందులనీ నిర్మూలిస్తుంది. సందేహించకండి. ఈ దివ్యసంజీవిని పరిగ్రహించండి.

ఇది ఏవేవో దీవులలో దొరుకుతుందనుకొని ఓడలు యెక్కి వెళ్లవలసిన పనియేలేదు. సోవల (సవ అంటే జాడ కనుక సోవల అంటే జాడ తెలిసికొనే ప్రయత్నం అని భావించాను) కోసం ఏవేవో గుహలలో పోయి దూరవలసిన పనిలేదు. గ్రహణ కాలములలోనే కాని లభించని కొన్ని పదార్థముల వంటిది కాదు ఇది. ఎప్పుడు పడితే అప్పుడు దొరుకుతుంది, తీసికోండి. ఇంతకీ ఏమిటండీ మీరు చెబుతున్న సంజీవిని మాకు చూపించండి అంటారా? ఇదిగో ఈ శ్రీవేంకటేశ్వరుడే ఆ దివ్య సంజీవిని. ఇంకా చూస్తారేం ఈ స్వామిని సేవించి తరించండి. అనండి ఏడుకొండలవాడా... వేంకట రమణా... గోవిందా... గోవింద.

## 3-40

## మున్నుడి

పరమాత్ముడైన తిరువేంకటేశ్వరుని ఎవరు దర్శించగలరు? ఏ అర్హతలు కావాలి స్వామిని చేరటానికి? ఆయన వునికి ఎవరికి తెలుస్తుంది? ఆయనను కీర్తించే విధము ఎవరికి తెలుస్తుంది? ఆయన మాటలు ఎవరికి వినిపిస్తాయి? ఇవన్నీ అందర్నీ వేదించే సందేహాలే. అన్నమాచార్యులవారు ఈ చిక్కు ప్రశ్నలకు అతి రమ్యంగా జవాబిస్తున్నారు వినండి కాకపోతే అంత తేలికగా కొఱుకుడు పడే కీర్తన కాదిది. మహీధర సీతారామశర్మగారి అన్నమయ్య పదామృత వర్షిణి నాకు చాలా ఉపకరించింది. వారికి నా కృతజ్ఞతలు. ఇది చదివి స్వామి తత్త్వం ఇంకొంచెం తెలుసుకోగలిగితే చాలు కదా!

**చం॥ ఇతరులు యెట్లు నేర్చెదరు ఇందిరహృత్కమలానివాస! నిన్**
**సతతము సత్యవాక్పటిమ సొంతము మోహవిమోచనంబుతో**
**స్థితమతులైన వారు నిను చేరుదురన్యులకెట్లు సాధ్యమౌ?**
**మతిగొని అన్నమయ్య వినుమా! యనికీర్తన గొల్చె శ్రీపతిన్.**

### రాగం : శ్రీరాగం

ఇతరులకు నిను నెఱగ తరమా
సతత సత్యవ్రతులు సంపూర్ణ మోహవిర-
హితులెఱుగుదురు నిను నిందిరా రమణా ॥ఇతరులకు॥

నారీకటాక్ష పటు నారాచ భయరహిత-
శూరు లెఱుగుదురు నిను చూచేటి చూపు
ఘోర సంసార సంకుల పరిచ్ఛేదులగు
ధీరులెరుగుదురు నీ దివ్యవిగ్రహము ॥ఇతరులకు॥

రాగభోగవిదూర రంజితాత్ములు మహా-
భాగు లెఱుగుదురు నిను ప్రణుతించు విధము
ఆగమోక్త ప్రకారాభిగమ్యులు మహా-
యోగులెఱుగుదు నీవుండేటి వునికి ॥ఇతరులకు॥





పరమ భాగవత పదపద్మసేవానిజా-
భరణు లెఱుగుదురు నీ పలికేటి పలుకు
పరగు నిత్యానంద పరిపూర్ణ మానస-
స్థిరులెఱుగుదురు నిను తిరువేంకటేశ ॥ఇతరులకు॥

### భావామృతం :

ఓ ఇందిరా మనో వల్లభా! ఇతరులకు నిన్ను తెలిసికొనుట సాధ్యమయ్యే పనియేనా? అన్ని వేళలయందు నిజం చెప్పటమే దీక్షగా గల సత్యవాక్పరిపాలకులు, సంపూర్ణముగా (సొంతం) మోహ విరహితులు (వ్యామోహమును విడనాడిన వారు) మాత్రమే నిన్ను యెఱుగుటకు అర్హులు. (మొదట్లోనే దెబ్బతిన్నాం... ప్రభూ!).

నారీ కటాక్ష పటునారాచ భయరహిత శూరులు (వనితల వాలు చూపులనెడి) బాణములు గుచ్చుకొంటాయనే భయములేని వారు) చూచే చూపులకే నీ చూపు దక్కుతుంది. ఘోర సంసార సంకుల పరిచ్ఛేదులగు ధీరులు (దారుణమైన సంసారమనెడి సంకెళ్లను తెంపుకొనగలిగిన ధైర్యవంతులు) అయితేనే నీ దివ్యమంగళ విగ్రహాన్ని దర్శించగలరు. (మామూలు కళ్లతో కాదు మనోనేత్రంతో).

రాగభోగవిదూర రంజితాత్ములు మహాభాగులు (అనురాగమునకు, సుఖలాలసకు దూరముగా నుండి పరమాత్మయందే సంతోసుఖమును పొందగలిగే మహద్భాగ్యాన్ని దక్కించుకొన్నటువంటి మహానుభావులు) మాత్రమే నిన్ను కీర్తించు పద్ధతి నెఱుగ గలరు. ఆగమోక్త ప్రకారాభిగమ్యులు (వేదములలో నేర్పబడిన ప్రకారముగా త్రికరణ శుద్ధిగా నిన్ను ఆశ్రయించిన వారు) మాత్రమే నీవుండే వునికి నెరుగగలరు.

పరమ భాగవత పదపద్మ సేవా నిజాభరణులు (గొప్ప భగవద్భక్తుల పాదపంకజముల సేవయే తమకు ఆభరణముగా గల ధన్యులు) మాత్రమే నీ మాటలు వినగలుగుతారు. ఏదో బ్రతికేస్తున్నాం అనునట్లు జీవించే వారికి నీమాట వినపడదు. ఓ తిరుమలగిరి రాయా! శ్రీవేంకటేశ్వరా! నిత్యానంద పరిపూర్ణ మానస స్థిరులు (శాశ్వతమైన ఆనందము చిత్తము నందంతా నింపుకొన్న స్థిర చిత్తులు) మాత్రమే నిన్నెఱుగ గలరు.

**3-41**

## మున్నుడి

శ్రీపతియైన శ్రీహరియే జీవులందరికీ రక్షకుడు. అతడే మనందరికీ నాథుడైయుండగా ఇక భయపడ వలసిన చోటెక్కడవుంటుంది? అని నిబ్బరంగా నొక్కి వక్కాణిస్తున్నారు అన్నమాచార్యులవారు. భక్తి జాలువారే ఈ కీర్తన నర్థం చేసికొనుట సులభమే. కాని చెవులకు అమృత వర్షంలా అనిపించే ఈ కీర్తనను వదలటం ఇష్టంలేక యెన్నుకొన్నాను. నరహరి కరుణే నమ్మినవారికి 'పరదున' నిక భయపడు, చోటేది? అని ప్రశ్నిస్తున్నారు. 'పరదు' అనే మాట 'పఱద' అనే మాటకు రూపాంతరం. 'వరద' అని దానికర్థం. వరదలో కూడ భయమేలేదట.

**కం॥ అతడే రక్షకుడందరి**
**కతడే పతి, మరిక భయములగు చోటేదీ?**
**హితవైన మాట జెప్పెను**
**అతి సులువుగ అన్నమయ్య అద్భుత గీతిన్**

**రాగం : సుందర రంజని**

అతడే రక్షకుడందరి కతడే
పతియుండగ భయపడు చోటేది ॥అతడే॥

అనంతకరము లనంతాయుధము
లనంతుడు ధరించెనలరగను
కనుగొని శరణాగతులకు మనకును
పనివడి యిక భయపడ చోటేది ॥అతడే॥

ధరణి నభయ హస్తముతో నెప్పుడు
హరి రక్షకుడై యలరగను
నరహరి కరుణే నమ్మిన వారికి
పరదున నిక భయపడు చోటేది ॥అతడే॥





శ్రీవేంకటమున జీవులగాచుచు
నావల నీవల నలరగను
దైవ శిఖామణి దాపగు మాకును
భావింపగ భయపడ చోటేది ॥అతడే॥

**భావామృతం :**

ఓ జీవులారా! అందరికీ రక్షకుడు శ్రీమన్నారాయణుడైన అతడే. ఆయనే మనందరినీ భర్త వలె రక్షిస్తుండగా ఇంకా భయపడవలసిన చోటేముంది (అవసరం ఏముంది) చెప్పండి.

ఆ మహానుభావుని హస్తములు అనంతమైనవి. వాటన్నింటిలో లెక్కకు మిక్కుటమైన ఆయుధములను ఆయన ధరించియున్నాడు. అనంతుడని పేరుపొందిన ఆ స్వామి ఆ విధంగా విరాజిల్లుతుండగా ఆయనను కనుగొన్న మనబోటి శరణార్థులకు ఇంకా భయపడవలసిన అవసరం ఏమున్నది? భయపడే చోటేముంది?

ఆ శ్రీనివాసుని అభయహస్తమును చూశారా? ఆ విధంగా శ్రీహరి స్వయంగా 'నేను రక్షిస్తానని' రక్షకుడై యుండగా ఆ నరహరి యొక్క కరుణను నమ్మినవారికి వరదలలో (పరదున) కొట్టుకుపోతున్నా ఏమాత్రం భయపడవలసిన పనిలేదు. ఆయన భక్తుల్ని ఆయనే రక్షించుకొంటాడు (నీవే తప్ప ఇతఃపరంబెరుగ, అను చాలు).

శ్రీవేంకటగిరిపై నెలకొని ఆవైపునుండి (ఆవల) సర్వజీవులను ఆ శ్రీవేంకటేశ్వరుడు రక్షిస్తూ శోభిల్లుతుండగా దేవాదిదేవుడుయైన ఆ స్వామి దాసులమైన మాకు భావనలో కూడా భయమునకు తావులేదు కదా! లేదు లేదు లేదు – ముమ్మాటికీ లేదు.

**3-42**

## మున్నుడి

సమాజంలో మనకి కనిపిస్తున్న అనేకానేక నీతి శతకాలకు, చాటువులకు అన్నమాచార్యులవారి కీర్తనలు మాతృకలేమో అనిపిస్తుంటుంది నాకు. పాలు పోసి పెంచినా వేప గుణమేల మాను? వంటి సామెతలకు పుట్టిల్లు అన్నమయ్య వైరాగ్యతత్త్వ బోధనా కీర్తనలేనేమో. కొన్ని అర్థమైనట్లున్నా వివరించలేము. ఈ కీర్తనలో "వేరులేని మహిమల వేంకట విభుని కృప ఘోరమైన ఆసమేలు కోరసాకీనా?" అంటే అటువంటిది మరొకటి లేని మహిమలు గల స్వామి కృపకై విపరీతంగా ఆశపడుట మంచిది. దానికెప్పుడు కొఱత కలుగదు" అని భావం. అదండీ సంగతి....

**ఉ॥ భారపు వేపమానునకు పాలను వోయుచు పెంచినన్ సరే**
**తీరని చేదు కాక యది తీయగనుండుట సాధ్యమౌనె?బల్**
**కూరిమి తేలుదెచ్చి మనకోకను జుట్టిన కుట్ట కుండునా?**
**మీరిన జ్ఞానబోధనము మేలుగ అన్నయ చేసె శ్రీపతీ!**

**రాగం : దేవగాంధారి**

భారమైన వేపమాను - పాలువోసి పెంచినాను
తీరని చేదేకాక- తియ్యనుండీనా ॥భారమైన॥

పాయదీసి కుక్కతోక-బద్దలువెట్టి బిగిసి
చాయకెంత గట్టినాను -చక్కనుండీనా
కాయపు వికార మిది - కలకాలము జెప్పినా
పోయిన పోకలేకొక -బుద్ధి వినీనా ॥భారమైన॥

ముంచి ముంచి నీటిలోన - మూలనాన బెట్టుకొన్నా
మించిన గొడ్డలి నేదు - మెత్తనయ్యీనా
పంచమహాపాతకాల - బారిబడ్డ చిత్తమిది
దంచి దంచి చెప్పినాను - తాకి వంగీనా ॥భారమైన॥





కూరిమితో దేలు దెచ్చి - కోకలోన బెట్టుకొన్నా
సారె సారె గుట్టు గాక - చక్కనుండీనా
వేరులేని మహిమల - వేంకట విభుని కృప
ఘోరమైన ఆసమేలు - కొరసోకీనా ॥భారమైన॥

**భావామృతం :**

విపరీతంగా పెరిగిన వేపచెట్టుకు చేదు సహజంగా వుండే నైజం (గుణము). దానికి పాలుపోసి పెంచినా అది చేదు స్వభావం మార్చుకొంటుందా? విపరీతమైన చేదుగా వుండక తియ్యగా వుంటుందా?

పాయదీసి (తిన్నగా జేసి) ఒక వెదురు బద్దకు గట్టిగా బిగించి కట్టి సరియైన మార్గంలో పెట్టినా కుక్కతోక అట్లా వుంటుందా? దాని వంకర స్వభావం పోతుందా? ఈ మానవదేహానికి చెడుదారిలో పోవటం స్వభావం. దీనికెంత మంచి చెప్పినా కాయపు వికారం, కలకాలం (జీవితాంతం) చెప్పినా, పోయిన పోకలే (దానిష్టం వచ్చినట్లు పోవటమే) కాని బుద్ధి చెబితే వింటుందా?

ఒక గొడ్డలిని తీసికొనివచ్చి, మించిన పదునున్న దానిని నీటిలో ముంచి ముంచి (ఎక్కువగా ముంచి) యొకమూల నానబెట్టినా అది మెత్తనవుతుందా? నేదు దాని తీవ్ర స్వభావం పోతుందా? పంచమహాపాతకాలు చేయటం అలవాటయి, వాని పాలబడ్డ మనస్సు ఇది. దీన్ని దంచి దంచి తన్ని బుద్ధి చెప్పినా అది మంచిదారికి రావటం లేదు. (బ్రహ్మహత్య, సురాపానము, బంగారం దొంగతనం, గురుపత్నీ అక్రమ సంబంధం, పై నాలుగు దుర్గుణములు కలవారితో స్నేహము - ఈ అయిదింటిని పంచ మహాపాతకములంటారు.

ప్రేమతో యొక తేలును తెచ్చిమన ఒడిలో పెట్టుకొనుటకు ఒక గుడ్డలో భద్రంగా చుట్టిపెట్టినా అది మాటి మాటికీ కుట్టి బాధపెట్టకుండా వుంటుందా? శ్రీవేంకటేశ్వరుని మహిమలకు సాటియైనవి ఇక వుండనే వుండవు. ఆ స్వామి కరుణ కోసం విపరీతంగా ఆశపడుట మేలైన మార్గం దానికి కొఱతవుండనే వుండదు.

**3-43**

## మున్నుడి

ఏ కోవెలలో ఏ దేవతామూర్తిని చూస్తే ఆ మూర్తిపై కీర్తన చెప్పేవారు అన్నమాచార్యులవారు. ఆయనే శ్రీవేంకటేశ్వరునిగా భావించేవారు. నిజానికి 'ఏకోనారాయణా' అనేకదా! పెద్దల భావన. ఆంజనేయుని దర్శించినను ఆయన శ్రీవేంకటేశుని బంటు అని భావించి కీర్తించారు. శ్రీరామచంద్రుని మీద చెప్పిన ఈ కీర్తనలో కుశలవుల ప్రసక్తి రావటం నన్నాకర్షించింది. పురాణాలను అవపోసన పట్టిన అన్నమాచార్యులు ఒక చిన్న కీర్తనతో మనకు రామాయణ గానం అందించే పుణ్యం సంప్రాప్తింప చేస్తున్నారంటే... ఇంతకంటె కోరవలసిన దేముంది?

**ఆ.వె॥ ఈతడే రఘుపతి ఏకాంగ వీరుడు**
**ఇతని చేత లెన్ని కతలు గలవు**
**వేంకటేశుడగుచు పెక్కువరాలిచ్చె**
**తెలిపెనన్నమయ్య సలలితముగ**

**రాగం : నాట**

ఈతడే రఘురాముడీత దేకాంగ వీరుడు
యీతడు చేసిన చేతలెన్నియైనా గలవు ॥ఈతడే॥

ఖరదూషణాదులను ఖండతుండములు సేసె
అరుదుగా వాలినొక్క యమ్మునసేనె
సరవి కొండల చేత సముద్రము బంధించె
ఇరవై విభీషణునికిచ్చె లంకారాజ్యము ॥ఈతడె॥

కూడపెట్టె వానరుల, కుంభకర్ణాది దైత్యుల
తోడనే రావణుజంపె దురము గెల్చె
వేడుకతో సీతాదేవి గూడెను పుష్పకమెక్కె
యీడు జోడై సింహాసనమేలె నయోధ్యలోన ॥ఈతడే॥





పుడమి యంతయు గాచె పొందుగా దనంతలేసి
కొడుకులగాంచెను కుశలవుల
యెడయక శ్రీవేంకటేశుడై వరములిచ్చె
అడరి తారక బ్రహ్మమై ఇదె వెలసె. ॥ఈతడే॥

**భావామృతం :**

ఓ ప్రజలారా! ఇదిగో ఈ మహానుభావుడే మన రఘురాముడు. ఈయన అసహాయశూరుడు. ఈయన చేసిన ఘనకార్యము లెన్నయినా వున్నాయి. (వాటిని కీర్తిస్తాను... వినండి).

ఆనాడు దండకారణ్యంలో ఖరదూషణాది రాక్షసులను పదివేలమందిని ఖండతుండములు (ముక్కలు ముక్కలుగ) చేశాడు. రావణాసురునే ముప్పుతిప్పలు పెట్టిన వాలిని ఒకే ఒక్క బాణంతో సంహరించాడు. సరవి (క్రమముగా లేక తదనంతరం) కొండరాళ్లతో సముద్రమున సేతు బంధనం చేశాడు. ఇరవై (ఇరవు+అయి=పొదుకొని) విభీషణునికి లంకారాజ్యమునకు ప్రభువును చేశాడు.

ఒక్కవానరాన్నే చెప్పిన మాట వినేట్లు చేయటం కష్టం. అటువంటిది వానర సైన్యాన్నే నడిపించి కుంభకర్ణాది దైత్యులతో సహా రావణాసురుని సంహరించి దురము (యుద్ధము) గెల్చాడు. సంతోషముతో సీతాదేవిని స్వీకరించాడు. ఈడూ జోడైన ఆమెతో సింహాసన మలంకరించి అయోధ్యానగరాన్ని పరిపాలించాడు.

ఆ తరువాత భూమండలాన్నంతా అశ్వమేధ యాగం చేసి సుభిక్షంగా, పొందగా కాచె (అనుకూలముగా భూమిని పరిపాలించాడు తనంతలేసి (తనతో సమానమైన ప్రతాపము కల) కుశలవులు అనే కొడుకులను గాంచినాడు. ఇదంతా ఆ త్రేతాయుగంలో జరిగినా... నేడు ఈ కలియుగంలో, యెడయక (విడువక) తిరుమలలో శ్రీవేంకటేశ్వరుడై తారకబ్రహ్మ (మోక్షప్రాప్తినిచ్చే పరబ్రహ్మవలె వెలసినాడు)

## 3-44

## మున్నుడి

చిన తిరుమలాచార్యులవారు అన్నమయ్యబాటలో నడుస్తూ సర్వదైవమూర్తులు శ్రీవేంకటేశ్వరుడే అనే భావనతో యెన్నో కీర్తనలు యెందరెందరో దేవతా మూర్తులపై చెప్పి తరించారు. కడప జిల్లా కోవిలకుంట్లలో వెలసిన పాండురంగ విఠలునిపై ఆయన చెప్పిన సరస శృంగార కీర్తన ఇది. “స్వామీ! నీపై మనసుపడి ఏదో గుట్టుగా కొసరి కొసరి నిన్ను చూచిన మాట నిజమే... కానీ అంతమాత్రాన నాగుట్టు రట్టు చేసి నవ్వులొలకబోసి నన్ను నవ్వుల పాలు చేయటం భావ్యమేనా?” అన్నమయ్య తాదాత్మ్యత వీరిలోనూ ప్రతిఫలిస్తోంది...

**తే॥ రచ్చకెక్కితివిగ పండ రంగి విఠల!**
**పచ్చిదేరేవు యింతలో పాండురంగి**
**పాడి చిన్న తిరుమలయ్య పరవశించి**
**కొలిచె కోవిలకుంట్ల విఠలుని తాను.**

**రాగం : దేశ్**

రచ్చకెక్కితివి పండరంగి విఠలా
పచ్చి దేరేవింతలోనె పండరంగి విఠలా ॥రచ్చకెక్కి॥

గుట్టుగల దొరవని కొసరి చూచినంతనే
రట్టుగా నవ్వేవు పండరంగి విఠలా
మట్టుమీరి తమకపు మాటలనె నీవలపు
బట్టబయలు సేసేవు పండరంగి విఠలా ॥రచ్చకెక్కి॥

సాగిన సబలలోన సన్న సేసినంతలోనె
రాగిదేవించేవు పండెరంగి విఠలా
వేగిరపు చేతలనె విరివి నీ మోహ మెల్ల
బాగుగా వెళ్లవేసేవు పండరంగి విఠలా ॥రచ్చకెక్కి॥





తతి నీ వున్న చోటికి దగ్గర వచ్చినంతనె
రతి కూడితివి పండరంగి విఠలా
గతియైన శ్రీవేంకటనాథ యేలితివి
పతివై కోవిలకుంట్ల పండరంగి విఠలా ॥రచ్చకెక్కి॥

**భావామృతం :**

ఓ పాండురంగ విఠలా! వీధినబడి గోల చేస్తావేమయ్యా! (రచ్చకెక్కావు), కాస్తకూడ బిడియం లేకుండా పచ్చిదేరేవు (మరుగులేకుండా బట్టబయలు చేసేస్తున్నావు (నన్ను...) ఇంతలోనే అలా చేస్తే ఎలా స్వామీ!

నీవు నా గుట్టు కాపాడే స్వామివని నిన్ను కొసరి కొసరి (మరీ... మరీ) చూచిన మాటనిజమే. అందుకని రట్టుగా (నిందలపాలయేట్లుగా) నవ్వుతావా? హద్దుమీరిన మైమరపు మాటలాడి నీకు నామీద నున్న ప్రేమ బట్టబయలు చేసేస్తున్నావు. నీకిది తగునా విఠలా?

విఠలా ఒకపక్క సభ జరుగుతుంటే సన్నసేసేవు(సైగలు చేస్తావు) అంతలోనే రాగి దేలించేవు (రంజింప జేస్తావు) నీవేగిరంపు (తొందరపాటు) చేతలతో నీకు నాపైగల మోహాన్ని బాగా అందరికీ తెలిసేట్లు వెళ్లగక్కుతావు. ఓ పాండురంగా! ఇది నీకు మర్యాదా? (ఎందుకలా నలుగురిలో గుట్టురట్టు చేస్తావు?)

ఓ విఠలా! సమయం చూసికొని నేను నీవున్న చోటికి రాగానే వలపులలో ముంచెత్తుతావు (రతికెక్కితివి) అక్కడ తిరుమలలో వున్న వేంకటనాథుడే నీవై ఈనాడు కోవెల కుంట్లలోని పాండురంగ విఠలా! నీవు మాకు భర్తవై మమ్ము సదా కటాక్షించు ప్రభూ!

## 4-45

## మున్నుడి

తత్త్వబోధ చేస్తున్న అన్నమాచార్యుల వారి కీర్తనలలో ఇది ఒక మణిపూస. విభక్తులతో ఏదన్నా ఒక విషయం చెబితే సరిఅయిన విభక్తి వాడకపోతే భావమే మారిపోతుంది. మనం అన్వయించుకొనే విధానాన్ని బట్టి అర్థమే మారిపోతుంది. ఉదాహరణకు 'శ్రీహరి ధ్యాస' అంటే శ్రీహరి యొక్క ధ్యాస' కావచ్చు, 'శ్రీహరి కొఱకు ధ్యాస' కావచ్చు. సందర్భాన్ని బట్టి అర్థం చెప్పుకోవాలి. అటువంటి తీవ్ర ప్రయత్నం చేస్తేగాని ఇంత తేలికగా కనిపించే ఈ కీర్తన నా చిన్ని బుర్రకు అర్థంకాలేదు. అదీ-పూర్తిగా కాలేదేమో కూడా...

**కం॥ ఎన్నడు విజ్ఞానం బది**
**యెన్నగ కలిగేను వేంకటేశా! నా ఈ**
**విన్నపము నాలకింపుము**
**అన్నాడా అన్నమయ్య అనుపమ గీతిన్**

**రాగం: శివరంజని**

ఎన్నడు విజ్ఞాన మిక నాకు
విన్నపమిదె శ్రీవేంకటనాథా ॥ఎన్నడు॥

పాసిన పాయవు బంధములు
ఆస దేహమున్నన్నాళ్లు
కోసిన తొలగవు కోరికలు
గాసిలి చిత్తము కలిగినన్నాళ్ళు ॥ఎన్నడు॥

కొచ్చిన గొరయవు కోపములు
గచ్చుల గుణములు గలనాళ్లు
తచ్చి(చ్చు)న తలగవు తహతహలు
రచ్చల విషయపు రతులన్నాళ్లు ॥ఎక్కడ॥





వొకటి కొకటికిని వొడబడవు
అకట శ్రీవేంకటాధిపుడ
సకలము నీవే శరణంటే యిక
వికటము లణగెను వేడుకనాళ్లు ॥ఎక్కడ॥

**భావామృతం :**

ఓ శ్రీవేంకటేశ్వరా! నాకు ఇక ఎన్నటికి విజ్ఞానము (తత్త్వమును గురించిన జ్ఞానము) కలుగుతుంది ప్రభూ! ఇది నీ కృప వల్లగాక ఇంకో విధంగా కలుగదు. అందుకని ఇది నా మనవి. నాకు ఆ విజ్ఞాన ప్రాప్తినందించుము స్వామీ!

మేము పెంచుకొన్న ఈ బంధము లెటువంటివంటే... అవి పాసిన పాయవు. (వదలించు కొందామన్నా వదలటంలేదు). ఈ మానవ దేహం వున్నంతకాలం ఆశ చావదు. కోసి తొలగించు కోవాలనుకొన్నా కోర్కెలు తీరటంలేదు. వీటన్నిటివల్లా నా చిత్తము (మనస్సు) నేను కలిగినన్నాళ్ళూ (వున్నంతకాలమూ) గాసిలి(బాధ) పడుతూనే వుంటుంది. (నాకేదిదారి?)

ప్రభూ! గచ్చుల గుణములు (పైపై పూతల-వంటి నటనలు చూపించే గుణములు), కొచ్చిన గొరయవు (తగ్గించు కొందామనుకొనినా తగ్గుటలేదు). అందువల్ల నాలో సహజంగా వుండే క్రోధం 'నన్ను వదలుటలేదు. (శాంతం నటించినా కోపంతో మనస్సు కుతకుత లాడుతూనే వున్నది). విషయపు రతులు (విషయవాంఛలు) అన్నాళ్ళూ (అన్ని రోజులూ) తచ్చిన (ఎంత ప్రయత్నించినా) తగలవు (తొలగవు). అవి రచ్చలవుతూనే తహతహలాడిస్తాయి. (ఇది ఎంత చిత్రహింస?)

ఓ వేంకటనాథా! పైనజెప్పిన విరుద్ధ భావములన్నియును ఒకదానితో ఒకటి ఒడబడక (సమాధానపడక) వున్నాయి, అకట! (అయ్యో నేనేం చేయగలను?) ఒక్కటే మార్గం కనిపిస్తోంది. ఇక సకలము నీవేనని శరణంటే వికటములు (దుర్గుణములు) అణగేను (తగ్గిపోతాయి). వేడుకనాళ్లు (ఆనందకరమైన సమయం) నిత్యమూ వుంటుంది.

**3-46**

## మున్నుడి

శ్రీ వేంకటేశ్వరుని కళ్యాణ మహోత్సవంలో అన్నమయ్య పాడిన అజరామరమైన సంకీర్తన ఇది. ఎన్నిసార్లు పాడినా తనివిదీరని ఆనందహేల. ముచ్చటయిన మూడు పెండ్లిండ్లను ఆవిష్కరిస్తున్నారు ఆచార్యులవారు. నరకాసుల వధ తరువాత పదియారు వేలమంది అతని బందీలైన రాచకన్నెలను కృష్ణయ్య పెండ్లాడాడు, ఒకేసారి. శిశుపాలుని ఓడించి రుక్మిణిని పెండ్లియాడాడు. దేవదానవుల సాగరమధనంలో జన్మించిన శ్రీలక్ష్మిని పెండ్లాడినాడు. అటువంటి శ్రీవేంకటగిరి శ్రీనిధిని వసంతరాగంలో కీర్తిస్తున్నారు.

**మత్తకోకిల॥ వైభవంబున లక్ష్మి గూడిన పావనుండగు మూర్తినిన్**
**శోభలీనెడి వేంకటేశుని సూర్యకోటి సమప్రభున్**
**శోభలీనెడి మూడు గాథల సూరి అన్నయ గొల్చెరా**
**ఈ భవాబ్ధిని దాట జెప్పెను ఇంపు సొంపగు బాటనే**

**రాగం : వసంతం**

శోభనమే శోభనమే
వైభవముల పావన మూర్తికి ॥శోభనమే॥

అరుదుగ మును నరకాసురుడు
సిరులతో చెరలు దెచ్చిన సతుల
పరువపు వయసుల పదాలు వేలను
సొరది పెండ్లాడిన సుముఖునికి ॥శోభనమే॥

చెందిన వేడుక శిశుపాలుడు
అంది పెండ్లాడగ నవగళించి
విందువలెనె తా విచ్చేసి రుకుమిణి
సందడి పెండ్లాడిన సరసునికి ॥శోభనమే॥





దేవదానవులు ధీరతను
దావతి పడి వార్ధి దరువగను
శ్రీవనితామణి చెలగి పెండ్లాడిన
శ్రీవేంకటగిరి శ్రీనిధికి ॥శోభనమే॥

**భావామృతం :**

వైభవము విలసిల్లు చుండగా పుణ్యమూర్తియైన ఈ శ్రీవేంకటేశ్వరునికి అంతయూ మంగళప్రదమే. అన్నియూ శుభములే.

పూర్వము నరకాసురుడు అరుదైన విధముగా అనేక సంపదలతో సహా పదియారు వేలమంది రాచకన్నెలను చెఱబట్టి తెచ్చియుంచగా సత్యభామా సహితుడై శ్రీకృష్ణమూర్తి అవతారమున స్వామి వెళ్లి ఆ దనుజుని సంహరించి వారిని విడిపించెను. ఆ తరువాత వారి అభ్యర్థన మేరకు వారందరినీ పెండ్లాడుటకు సుముఖుడై ఒకే క్రమములో ఆ జవ్వనులను వరుసగా పరిణయమాడెను. అట్టి శుభప్రదుడైన మూర్తికి శుభమగుగాక!

(పరిణయమాడుటకు) వేడుకజెందిన శిశుపాలుడు పెండ్లాడుటకు ఆయత్తమవగా, తానుకూడా విందుకు వచ్చినవానివలె విచ్చేసి పెండ్లికూతురు రుక్మిణిని ఎత్తుకొనిపోయి సందడిగా పెండ్లాడిన సరసపు శ్రీకృష్ణమూర్తికి మంగళమగు గాక!

దేవతలు దైత్యులు ధైర్యస్థులై పోటీపడి సముద్రమును (క్షీరసాగరమును) మధించగా అనేకమైన దివ్య వస్తువులతోపాటు శ్రీలక్ష్మి కూడా వుద్భవించింది. ఆమె శ్రీమన్నారాయణుని వరించగా ఆయన ఆ స్వయంవరంలో నెగ్గి సాగరపుత్రియైన శ్రీవనితను పెండ్లాడినాడు. ఆయనే శ్రీవేంకటగిరిపై శ్రీనివాసుడై వెలసియున్నాడు. ఆ శ్రీనిధికి శుభములు కలుగు గాక!

**3-47**

## మున్నుడి

హనుమంతుని ప్రతాపాన్ని అద్భుతంగా ఈ కీర్తనలో ఆవిష్కరిస్తున్నారు అన్నమాచార్యులవారు. ఇదే బాణిలో యెన్ని కీర్తనలు చెప్పినా దేవి మాధుర్యం దానిదే. హనుమంతుడు తనతోకను బ్రహ్మాండం దాక నిక్కించి, దిక్కులనిండా ఏమాత్రం సందులేకుండా తన మేను పెంచాడట. ఒక్క క్షణం వామనుని త్రివిక్రమ రూపం కనులముందు దర్శింపచేస్తోంది అన్నమయ్య వర్ణన. ఆంజనేయుడు శ్రీవేంకటేశ్వరుని 'హితవరిబంటు' అయ్యాడట అంటే ఎప్పుడూ యజమాని మేలుకోరే బంటుట. ఏమి భావన!!

**చం॥ అదె కనులార గాంచుడటు అంజన సూనుని పెద్ద కాయమున్**
**గుదిగొని దేవతల్ కొలిచి కోరికతో కొనియుడు ధీరునిన్**
**యెద పులకించు కీర్తనము యేర్పడ జెప్పెను అన్నమార్యుడున్**
**ఇది గతజన్మ భాగ్యముర యిత్తరి మున్నుడి జెప్పితిన్ హరీ!**

**రాగం : భౌళి**

అదె చూడరయ్య పెద్ద హనుమంతుని
గుదిగొని దేవతలు కొనియాడేరయ్య ॥అదె॥

ఉదయాస్త శైలములు ఒక జంగగా చాచె
అదివో ధృవమండల మందె శిరసు
చదివె సూర్యుని వెంట సారె మొగము ద్రిప్పుచు
ఎదుట ఈతని మహిమ యేమని చెప్పేమయ్య ॥అదె॥

దండిగా బ్రహ్మాండము దాక తోక మీది కెత్తె
మెండగు దిక్కుల నిండా మేను వెంచెను
గుండు గూడ రాకాసుల కొట్టుగ చేతులు చాచె
అండ ఈతని ప్రతాప మరుదరుదయ్య ॥అదె॥





దిక్కులు పిక్కటిల్లగ దేహరోమములు పెంచె
పక్కన లోకములకు ప్రాణమై నిల్చె
నిక్కడ శ్రీవేంకటేశు హితవరి బంటాయ
మిక్కిలి ఈతని లావు మేలు మేలయ్య ॥అదె॥

**భావామృతం :**

అదిగో అటు చూడండయ్యా! పెద్ద హనుమంతుడు కనిపిస్తున్నాడు కదా! ఆ మహానుభావుని దేవతలంతా గుదికొని (అతిశయించునట్లుగా) ప్రస్తుతించి తరిస్తారు.

ఒక్క అంగతో తూర్పున ఉదయాచలమును పశ్చిమమున అస్తాచలమును ఆక్రమించి నిలుచుని యున్నాడతడు. అదిగో అతని తల ధృవమండలమును అంటుచున్నది. ఆ విధంగా నిలుచుని ఆ హనుమంతుడు తన తలను సూర్యుడు ఎటుంటే అటు తిప్పుతూ వేదములన్నీ ఆ సూర్యభగవానుని ద్వారా ఏకసంత గ్రాహివలె నేర్చుకున్నాడు. ఈతని మహిమనేమని చెప్పగలము?

ఈ హనుమంత దండిగా (గొప్పగా) తన తోకను బ్రహ్మాండముదాకా పైకెత్తి దిక్కులన్నీ నిండిపోవునట్లుగా తన శరీరమును వ్యాపింప చేశాడు. గుండుగూడ (చుట్టుముట్టిన) రాక్షసులను చావబాదుటకు చేతులు చాచి యున్నాడు. అండయైన ఈ మహానుభావుని ప్రతాపము అరుదరుదు (చాలా అరుదు).

ఆ హనుమంతుడు దిక్కులు పిక్కటిల్లునట్లు (దిక్కులన్నీ నిండిపోవునట్లు) తన దేహముపైగల వెంట్రుకలను పెంచాడు. ఆ విధంగా లోకములన్నింటికీ ప్రాణమై నిలిచాడు. ఇక్కడ వున్న ఈ రామబంటు సాక్షాత్తు తిరుమల శ్రీవేంకటేశ్వరుని మేలుకోరే బంటువలె వున్నాడు. ఇతని గొప్ప గొప్ప వుపకారములు ఎంతో మంచిని చేసినవి.

**3-48**

## మున్నుడి

సత్యము, నిత్యము అవనట్టి ఏ సుఖమైనా అసలు సుఖమే కాదంటున్నారు అన్నమాచార్యులవారు. చాలు ప్రభూ! నీ దాస్యమే నాకు చాలు. అదే నిత్య సుఖప్రదం. పొల్లు (లోపం) లేని నీ భక్తియే ఈ పుట్టుకకు సుఖము. మాచనవోలు లోని చెన్నకేశవునిపై ఈ కీర్తన చెబుతున్నారు. నిజంగా నా శ్రమ ఫలించి జన్మధన్యమయింది శ్రీవేంకటేశ్వరా!

**సీ॥ నీ దాస్యమే కదా! నిత్య సుఖప్రదము**
**సత్యమవని సుఖం చాలుస్వామి!**
**చక్కని నీరూపు సరికన్నుల సుఖము**
**వీనుల సుఖము నీపేరు దేవ!**
**తులసి నీపదముల నాలుక సుఖమయ్య!**
**మనసుకు సుఖము నీమంచి ధ్యాస**
**నీపాద పద్మాల నెగడు సువాసన**
**యూర్పు సుఖమునంత కూర్పు స్వామి!**

**ఆ.వె॥ పుటక కెల్ల సుఖము పొల్లులేనిది భక్తి**
**చెన్నుడైన దేవ! శ్రీనివాస!**
**అన్నమయ్య పాట అత్యద్భుతము ప్రభూ!**
**జన్మధన్యమయ్యె శ్రమ ఫలించె**

**రాగం : లలిత**

నిత్య సుఖానంత మిదె నీ దాస్యము
సత్యము లేని సుఖాలు చాలు చాలునయ్యా ॥నిత్య॥

కన్నుచూపుల సుఖము కడు నీ చక్కని రూపె
యెన్నగ వీనుల సుఖమిదె నీపేరు
పన్ని నాలుక సుఖము పాదపు నీ తులసి
వున్న సుఖములు తెరువోడబడునయ్యా ॥నిత్య॥





తనువుతోడి సుఖము తగు నీకైంకర్యము
మనసులో సుఖము నీమంచి ధ్యానము
పనివి యూర్పు సుఖము పాదపద్మము వాసన
యెనయని పెర సుఖమేమి సేసేనయ్యా ॥నిత్య॥

పుట్టుగు కెల్ల సుఖము పొల్లులేని
నీభక్తితొట్టి కాళ్ళ సుఖము పాతురలాడుట
జట్టి శ్రీవేంకటేశ మాచనవోలి చెన్నుడవై
పొట్టు(త్తు)కొని మమ్మేల(లి)తివోహో మేలయ్యా ॥నిత్య॥

**భావామృతం :**

ఓ ప్రభూ! ఇదే నీ దాస్యమొక్కటియే నిత్య సుఖానందము నొసగును. ఈ ఐహిక సుఖములన్నియు సత్యములేనివి. ఇవి ఇక చాలు చాలు తండ్రీ! (అసలు సుఖమేదో నేను తెలుసుకొన్నాను).

అధికముగా సుందరమైన నీ చక్కని రూపము కన్నులకు సుఖము. నీ నామ సంకీర్తనం వీనులకు (చెవులకు) సుఖము. నీ పాదపద్మములనలంకరించు తులసిదళములు మా నాలుకకు యుక్తమైన సుఖము. ఇవిగాక ఈ అవయవముల వల్ల కలిగే ఇంకే సుఖములైనా మాకు నీ దారిని చూపించలేవు స్వామీ!

మాకు నీవు ఇచ్చిన ఈ శరీరంతో నిజమైన సుఖం. అది నీకు కైంకర్యమైనప్పుడే కలుగుతుంది. అట్లే నీపై మంచి ధ్యాస కుదిరినప్పుడు మాత్రమే, మా మనస్సుకు సుఖం దొరుకుతుంది. మా ఊపిరికి సుఖము నీ పాదపద్మముల సువాసన అన్యములైన సుఖములు ఆ నిజమైన సుఖముతో (నీ ధ్యాస సుఖంతో) సరిపోల్చలేని సుఖములే తండ్రీ!

ఓ ప్రభూ! పొల్లలేని (ఏలోపమూలేని) నీ భక్తి ఈ జన్మకే సుఖము. తొట్టికాళ్లు (కదలునట్టి కాళ్లు) వలన సుఖమేదన్నా వుందంటే నీతో నీకొఱకు తిరుగుటయే సుమా! జట్టి శ్రీవేంకటేశా! (విలువైన వేంకటేశ్వరా!) నేడు మాచనవోలులో వెలసిన చెన్నకేశవుని రూపమున, పొట్టుకొని (పొత్తుకొని అంటే... జతకూడి) మమ్ము పరిపాలించుచుంటివి. ఓహో! మేలు మేలు తండ్రీ! చరితార్థులమైతిమి.

## 3-49

### మున్నుడి

శ్రీవేంకటేశ్వరుని వరద హస్తాన్ని అభయ హస్తాన్నీ చూచి పులకించిన అన్నమాచార్యులవారు ఆ చేయి మహాత్యాన్ని కీర్తిస్తున్నారు. అది సామాన్యమైన చేయికాదు అని శ్రీహరి దశావతారములలో ఆ చేయి చేసిన ఘన కార్యములను ఏకరువు పెడుతున్నారు. పురాణ పాండిత్యం వున్నవారికి ఈ కీర్తన అర్ధమవుతుంది కాని ప్రతిపదార్థం చెప్పమంటే మాత్రం 'బిక్కమొగం' వేయక తప్పదు. ఈ శ్రీహరి చేయి ఒకసారి దైత్యుల చక్రవర్తి బలిదగ్గరకు వెళ్లి మూడు అడుగుల నేల 'భిక్షాందేహి' అని దానమడిగింది (వామనుడు) ఒకసారి బ్రాహ్మణులకు భూమండలాన్నే దానం చేసింది (పరశురాముడు) అంటున్నారు.

**కం॥ ఇందరికి అభయమిచ్చెడి**
**కందువ బంగారు చేయిగా తను తెలిపెన్**
**విందగు అవతారంబులు**
**అందంబుగ అన్నమయ్య హరిదాల్చెననెన్**

**రాగం : మిశ్రహరికాంభోజి**

ఇందరికి నభయంబు లిచ్చుచేయి
కందువగు మంచి బంగారుచేయి ॥ఇందరికి॥

వెలలేని వేదములు వెదకి తెచ్చిన చేయి
చిలుకు గుబ్బలి కింద చేర్చు చేయి
కలికి యగు భూకాంత కౌగిలించిన చేయి
వలనైన కొనగోళ్ళ వాడి చేయి ॥ఇందరికి॥

తనివోక బలిచేత దానమడిగిన చేయి
ఒనరంగ భూదాన మొసగు చేయి
మొనసి జలనిధి అమ్ము మొనకు దెచ్చిన చేయి
ఎనయ నాగేలు ధరించు చేయి ॥ఇందరికి॥





పురసతుల మానములు పొల్ల సేసిన చేయి
తురగంబు బరపెడి దొడ్డచేయి
తిరువేంకటాచలాధీశుడై మోక్షంబు
తెరువు ప్రాణులకెల్ల తెలిపెడి చేయి ॥ఇందరికి॥

### భావామృతం :

ఈ శ్రీమన్నారాయణుని 'చేయి' ఇంతమందికి అభయమునొసగినది. ఇది కందువగు (సామర్థ్యంగల) మంచి బంగారము వంటి చేయి. ఈ దివ్య హస్తం చేసిన ఘనకార్యములను వివరిస్తాను వినండి.

ఈ చేయి అమూల్యమైన వేదములను వెదకి తిరిగి తీసికొచ్చిన చేయి (మత్స్యావతారము). ఇది పాలసముద్రమును చిలుకుతున్న గుబ్బలి (కొండ) కిందచేరి అది మునిగిపోకుండా కాపాడి క్షీరసాగరమధనమునకు సహకరించిన చేయి, (కూర్మావతారం). భార్య కాగోరిన భూదేవిని కౌగలించుకొనిన చేయి (వరాహావతారం). ఇది కొనలు దీరి వాడియైన గోళ్లువున్న వలనైన (ఉపాయమున్న) చేయి (నృసింహావతారం).

బలిచక్రవర్తిని దానమడిగినతనివోక చేయి, అంటే తృప్తి చెందని చేయి (వామనావతారం). ఒనరంగ (ఒప్పగునట్లు) భూదానమును చేసిన చేయి (పరశురాముడు). మొనసి (పూనుకొని) సముద్రుని అమ్ము మొనకు (బాణమును గురిచేసి దెచ్చి) తన యెదుట నిలబెట్టిన చేయి (శ్రీరామావతారము). పొందుగా నాగేలు (నాగలి) ధరించిన చేయి (హలాయుధుడైన బలరాముని అవతారము).

పురసతుల మానములు (త్రిపురాసురుల యొక్క భార్యల శీలములు) పొల్ల సేసిన (భంగపరచిన) చేయి (బుద్ధావతారము). తురగంబు బరపెడి(గుఱ్ఱముపై స్వారీ చేసిన) చేయి (కల్కి అవతారము). నేడు ఇక్కడ తిరువేంకటాచలాధీశుడై, ప్రాణులకు (జీవులకు) మోక్షంబు తెరుపు (ముక్తిమార్గము) తెలిపెడి చేయి. ఇంతకీ ఏమిటా ముక్తి మార్గం? ఇవిగో నా పాదములే... అని చూపుతున్న చేయి. అదే... నాకు... దిక్కు.

## 3-50

## మున్నుడి

తిరుమలలో శ్రీవేంకటేశ్వరునికి 'తిరుమంజనం' సేవ జరుగుతోంది. తట్టు పునుగు స్వామికి దట్టంగా అద్ది, కర్పూరధూళి చల్లి, తళతళ మెఱిసే నగలు అలంకరిస్తే వేంకటపతిని ఆయన దేవేరి అలమేల్మంగమ్మను చూడటానికి రెండు కళ్లూ చాలటం లేదు. స్వామి ముఖమున కళలన్నీ మొలకెత్తినట్లుంది. ఒక్కోసారి ఒక్కో అందం కనపడుతోంది. ఆయన ఒయ్యారాలను (అందములను) పెద తిరుమలయ్య ఖరహరప్రియ రాగంలో కీర్తిస్తున్నారు. అన్నమయ్య సంప్రదాయం సజావుగా నడిపి తండ్రికి తగ్గ తనయుడు అనిపించారు. భళి భళీ!!

**ఆ.వె॥ ఒక పరి కొక పరికి ఒయ్యారమై యొప్పె**
**మొకమునందు కళలు మొలచినట్లు**
**వెలుగులెగయ జిమ్మె వెలది, వేంకటపతి**
**పరవశించెను పెద తిరుమలయ్య.**

**రాగం : ఖరహరప్రియ**

ఒకపరి కొకపరి కొయ్యారమై
మొకమున కళలెల్ల మొలచినట్లుండె ॥ఒకపరి॥

జగదేకపతిమేన చల్లిన కర్పూర ధూళి
జిగికొని నలువంక చిందగాను
మొగి చంద్రముఖి నురమున నిలిపెగాన
పొగరు వెన్నెల దిగబోసి నట్లుండె ॥ఒకపరి॥

పొరి మెఱుగు చెక్కుల పూసిన తట్టుపునుగు
కరిగి ఇరుదెసల కారగాను
కరిగమన విభుడు గనుక మోహమదము
తొరిగి సామజ సిరి దొలకినట్లుండె ॥ఒకపరి॥





మెఱయు శ్రీవేంకటేశు మేన సింగారముగాను
తఱచైన సొమ్ములు ధరియించగా
మెఱుగు బోణి అలమేలు మంగయు తాను
మెఱుపు మేఘము గూడి మెఱసినట్లుండె ॥ఒకపరి॥

**భావామృతం :**

(ఆహా!! ఎంత అద్భుతంగా వుంది ఈ జంట. ఏమి అందం!!) ఒకసారి ఒకరకమైన అందం, ఇంకొకసారి ఇంకొకరకమైన అందం... స్వామివారి ముఖమున కళలన్నీ మొలక లెత్తాయా? అనునట్లున్నది. (వర్ణనాతీతమైన వీరి సౌందర్యం గురించి యెంత చెప్పినా... తక్కువే అవుతుంది.

ఈయనెవరు? జగదీశ్వరుడు, జగదేకపతి, ఈయన దేహంపై కర్పూరం పొడి చల్లారు. దాని జిగి(కాంతి) నలుదిశలా చిందుతున్నది. ఇటుచూస్తే ఈ చంద్రముఖిని ఈయన తన హృదయంపై వుంచి నిలుపుకొన్నాడు. అందువలన పొగరు వెన్నెల (దట్టంగా కాస్తున్న వెన్నెల) దిగబోసినట్లుండె (కురిసినట్లున్నది).

ఓహో! పొరి మెఱుగు చెక్కుల (పదేపదే మెఱయుచున్న చెక్కిళ్ళు) పై పూసిన తట్టుపునుగు కరిగి ఆయన రెండు చెక్కిళ్ళు (చెంపల) పై కారుచున్నది. ఈ స్వామి సామజవరగమనుడు (మదపుటేనుగు నడక వంటి ఠీవి గల నడకగల వాడు) అమ్మవారిపై ఈ స్వామికున్న మోహము, మోహమదమువలె స్రవించుచుండుటచేత, ఈయనను సాజముతో పోల్చుట యెంతయో సమంజసముగా నున్నది. తొరిగి సామజసిరి దొలకి నట్లున్నది. (స్రవించుచున్న మదపుటేనుగు యొక్క మదజలము చెక్కులపై ఒలికినట్లున్నది).

శ్రీవేంకటేశ్వరుని శరీరంపై సింగారింపబడి తళతళ మెఱయు ఆభరణములు అనేకములు అలంకరింపబడినవి. మెఱుగు బోణి (మెఱయుచున్న శరీరముగల) ఈ అలమేల్మంగమ్మ ఈ స్వామి పక్కన వుంటే నల్లటి మేఘముల మధ్య తటిల్లత (మెఱపు) తళుక్కుమన్నట్లున్నది. ఈ సౌందర్యం కన్నులారా చూచిన వారి జన్మ ధన్యము. అందుకు సందేహమా?

## 3-51

## మున్నుడి

నేటికాలంలో మనం వింటున్న సామెతలు, నీతివాక్యాలూ, విమర్శనాస్త్రాలు-ఇవన్నీ అన్నమాచార్యులవారి ఇటువంటి కీర్తనలనుంచే పుట్టివుంటాయని నా నమ్మకం. వారి కీర్తనలలో వాడిన భాషనేటి తరానికి అర్థం కూడా కాదేమో. ఇంతతేలికగా కనుపించే ఈ కీర్తన ప్రతిపదార్థం చెప్పమంటే మాత్రం నీళ్ళునమలకతప్పదు. “మెలుతల”,“అఱమరపులు”,మొఱగే మొయిలైపోవు, సన్నెరిగిన, “వెన్నెలమాయ”-వంటి తెలుగు మాటలకి కూడా అర్థం తెలియని దశకిమనం వచ్చేశాం.... ఇక అన్నమయ్య భావం తెలియటం తేలికా? తెలుగువాడా!

**కం॥ నాటక మీ సంసారము**
**బూటకమౌ అన్నమయ్య బోధనజేసెన్**
**పూటకు బూటకు బొల్లై**
**చేటులు కల్పించు శాంతి చెడు, శ్రీనాథా!**

**రాగం : గుండక్రియ**

నాటకమింతా-నవ్వులకే
పూటకుబూటకు-బొల్లైపోవు ॥నాటక॥

కోటివిద్యలును- గూటికొఱకె పో
చాటువ మెలగేటి- శరీరికి
తేటల నాకలి-దీరిన పిమ్మట
పాటుకుబాటే-బయలై పోవు ॥నాటక॥

మెఱసేటిదెల్లా-మెలుతల కొఱకే
చెఱల దేహముల-జీవునికి
అఱమరపుల సుఖ-మందిన పిమ్మట
మొఱగుకు మొఱగే-మొయిలై పోవు ॥నాటక॥





అన్ని చదువులును-నాతని కొఱకే
సన్నెరిగిన సు-జ్ఞానికిని
యిన్నిట శ్రీవేంక-టేశు దాసునికి
వెన్నెల మాయలు-విడివడిపోవు ॥నాటక॥

**భావామృతం :**

మానవులారా! ఈ సంసారముంది చూశారా? ఇదంతా ఒక నాటకమే. చివరికి ఇదంతా నవ్వులకే (నవ్వులపాలైపోయేదే). ఇందులో మనం చేసేదంతా ఏపూటకాపూట నిరుపయోగమైపోయేదే సుమా!

కోటివిద్యలు నేర్చినా గూటికొఱకే,(కూడుతినుటకే కదా!).చాటువ మెలగేటి శరీరికి (చాటించబడిన పాండిత్యం గల నరునికి ) ఆ విద్యలుయెందుకు ఉపయోగపడతాయి? కేవలం జీవించటానికేగాని, తత్త్వజ్ఞానమునకు నిరుపయోగమే. మన చదువులతో ఒకసారి ఆకలి తీరాక, పాటుకు బాటే బయలైపోవు (ఆ పడిన పాట్లన్నీ నిరుపయోగమైపోతాయి) మరి ఇంకాయెందుకు అటువంటిపాట్లు?

చెఱలదేహముల జీవునికి (చెరసాల వంటి దేహములో చిక్కుకొన్న జీవునికి) మెఱసేటిదెల్లా మెలుతల కొరకే (ఈ పైపై మెరుగులన్నీ కేవలం స్త్రీల కొఱకే). ఒక్కసారి అఱమరపుల సుఖం (సగం మైమరపుతో గూడిన సంభోగ సుఖం) దక్కిన పిమ్మట, మొఱగుకు మొఱగే మొయిలైపోవు (వంచనల మీద వంచనలన్నీ మబ్బులైపోతాయి) సుమా! అంటే మబ్బులెలా క్షణంలో రూపం మార్చుకొంటాయో ఆ స్త్రీ సుఖం విపరీతమైన దుఃఖమైపోతుంది. ఇదితప్పదు.

అన్ని చదువులలో గల సన్నెరిగిన (రహస్యం తెలిసినకొనిన) సుజ్ఞానికి ఆ చదువులన్నీ పరమాత్మను చేరుటకే అని తెలియును. అటువంటి శ్రీ వేంకటేశ్వరుని దాసునికి, వెన్నెలమాయలు (వెన్నెల వలె అప్పటికి మాత్రమే ఆహ్లాదం కలిగించే మాయలు ఏ మాత్రం హాని చేయలేవు సుమా!

**3-52**

## మున్నుడి

అన్నమాచార్యుల వారు గోవిందురాజస్వామిపై చెప్పిన సరస సంకీర్తన వినండి. బాలకృష్ణునిగా, గోపికృష్ణునిగా, కుబ్జకు రతిసుఖము నిచ్చిన కృష్ణయ్యగా, సత్యభామ ఒడిలో మధురానుభూతితో నిదురించే కృష్ణ మూర్తిగా, పదియారువేల రాచకన్నెలను ఒకేసారి పరిణయమాడి వారి పాలిండ్ల 'తలగడల' పై భోగించు శృంగార నాయకునిగా కీర్తిస్తున్నారు. మేరమీరి మెరిసిపోతున్నావు స్వామీ! అంటున్నారు. నేడు ప్రత్యక్షంగా శ్రీవేంకటేశ్వరుని వలె తిరుపతిలో నీళాదేవిని, భూదేవిని, రమాదేవినీ ముగ్గురినీ నిద్రపోనీయటం లేదంటున్నారు. ఇంకా...ఏం చెప్పాలి...

**ఆ.వె॥ కోర్కెలు కొనసాగె గోవిందరాజులూ!**
**మేరమీరయిట్లు మెరసినావు**
**నీళ, భూమి, రమల నిదురబోనీయక**
**అలరినావు అనెను అన్నమయ్య.**

**రాగం: లలిత**

కోరికలు కొనసాగే గోవిందరాజా
మేరమీరి ఇట్లానే మెరసితివా ॥కోరికలు॥

బాలుడవై రేపల్లెలో పాలుతాగే వేళ
ఈ లీలనే పవళించి ఇరవైతివా
గోలవై తొట్టెలలోన గొల్లెతలు వూచిపాడగా
ఆలకించి విని పాటలు అవధరించితివా ॥కోరికలు॥

కొంచెక మధురలోన కుబ్జఇంట నీలాగుల
మంచాలపై పవళించి మరగితివా
చంచుల ద్వారకలోన సత్యభామ తొడపైన
ముంచి ఈ రీతినొరగి ముచ్చటలాడితివా ॥కోరికలు॥





పదియారువేల ఇంతుల పాలిండ్లు తలగడలై
పొదల నీవు ఇటువలెనే భోగించితివా
ఎదుట శ్రీ వేంకటేశ ఇట్టె తిరుపతిలోన
నిదురించక శ్రీభూమి నీళల కూడితివా ॥కోరికలు॥

**భావామృతం :**

ఓ గోవిందరాజా! నీ కోరికలు కొనసాగుతూనే వున్నవి స్వామీ! నీవు ఈ విధంగానే అంతులేక మెరసిపోతున్నావు.

నీవు రేపల్లెలో పాలు త్రాగే బాలునిగావున్నప్పుడు ఈవిధంగానే విలాసంగా పవళించి నీయొక్క అందాలొలికించి యుంటావు. నిన్ను తొట్టెలో వేసి ఊపుతూ గోపికలు మధురంగా పాడుతుంటే ఆ జోలపాటలు వింటూ గోలవై (ముగ్ధుడవై) వారిని అవధరించితివి (ఆలకించితివి). ఆవిధంగావారిని నీవు అనుగ్రహించావు.

కొంచెక(సంకోచించకుండా) నీవు ఆనాడు మధురానగరంలో కుబ్జ ఇంట ఈ విధముగానే మంచాలపై పవళించి మరగితివా (మాకు పరిచయమైతివా స్వామీ! అట్లే ద్వారకానగరంలో చంచుల సత్యభామ (వేగముకల సత్యభామ) యొక్క తొడపై ముంచి (ఆక్రమించి) ఈ విధముగానే ఒరిగి ముచ్చటలాడినావా? (జగన్నాథుని శృంగారంతో అలరించిన ఆ జాణలకంటే అదృష్టవంతులెవరుంటారు?వారిదే కదా! వైభవం.)

ఓ మహానుభావా! పదియారువేలమంది రాచకన్నెలను నరకాసురుడు చెఱబడితే వానిని వధించి వారికి విముక్తినిచ్చావు. వారు నిన్నే పెళ్ళాడ గోరితే ఒకసారి వారిని పరిణయమాడావు వారి పాలిండ్లపొదలలో భోగించితివి. ఈ విధంగా తిరుపతిలో శ్రీవేంకటేశ్వరుడవై లక్ష్మీదేవి, భూదేవి, నీళాదేవి-ముగ్గురుతోటి నిదురకూడా పోకుండా కూడియున్నావు. (మమ్ము తరింపజేయుచున్నావు తండ్రీ!)

**3-53**

## మున్నుడి

అహోబల సుగ్రీవ నరసింహస్వామిపై అన్నమాచార్యులు చెప్పిన చక్కని సంకీర్తన ఇది. భజన వలె కొనసాగే ఈ కీర్తనలో కఠినమైన పదాలే లేవు అనే చెప్పాలి. 'వావిరి ప్రహ్లాదునికి వరదుడు వీడే"–అంటే ఎంతో ఉత్కృష్టమైన చక్కటి ఆనందము కలిగించు ప్రహ్లాదునికి వరములిచ్చినది వీడేనని అర్థం. ప్రహ్లాదుడిచ్చే ఆనందమేమిటి? హరినామసంకీర్తన. 'నరసఖుడు' అంటే నరనారాయణులలోని నరుడు అర్జునుడై అవతరించగా అతని చెలికాడై దుష్టశిక్షణ చేయించిన నారాయణుడు (శ్రీకృష్ణుడు) అని అర్థం. ఇది నా భావనకందిన అర్థం మాత్రమే....

**కం॥ సేవింపుడు జనులారా!**
**వావిరి ప్రహ్లాదునికిని వరదుడు వీడే**
**భావించి చేతులెత్తుడు**
**ఆ విధి అన్నయ్య కొలిచె హరినరరూపున్.**

**రాగం :సావేరి**

సేవించరో జనులాల చేతులెత్తి మొక్కరో
వావిరి ప్రహ్లారునికి వరదుడు వీడె ॥సేవింపరో॥

జగన్నాథుడు వీడే సర్వరక్షకుడు వీడె
నిగమవేద్యుడైన నిత్యుడు వీడె
సగుణవంతుడు వీడే సర్వకాముడు వీడె
నగుమోము సుగ్రీవ నరసింహుడు వీడె ॥సేవింపరో॥

మరుజనకుడు వీడే మహిమాధికుడు వీడె
పరగ శ్రీలక్ష్మీపతియు వీడె
సురల కేలిక వీడే శుభమూరితి వీడె
నరసఖుడు సుగ్రీవనరసింహుడు వీడె ॥సేవింపరో॥





భువనాధిపతి వీడే పురుషోత్తముడ వీడె
వివిధప్రతాప కోవిదుడు వీడె
ఇవల శ్రీవేంకటాద్రి నిరవైనతడు వీడె
నవమూర్తి సుగ్రీవనరసింహుడు వీడె ॥సేవింపరో॥

## భావామృతం

ఓ ప్రజలారా! సుగ్రీవుడైన (చక్కటి కంఠముగల) ఈ సుగ్రీవనరసింహుని సేవించండి. చేతులెత్తిమొక్కండి. ఎంతో ఉత్కృష్టమైన (వావిరి) ప్రహ్లానుకి వరములిచ్చినది ఈయనయే.

లోకములన్నింటికీ నాధుడు ఈయనే.అందరినీ రక్షించే రక్షకుడు కూడా ఈయనే.వేదములన్నింటి చేతా కీర్తింపబడి నిత్యుడు అని గ్రహింపబడినవాడు ఈయనే. విశిష్టములైన సద్గుణములు గల స్వామి ఈయనే. అన్ని కోర్కెలను తీర్చువాడు ఈయనే. ఇదిగో నవ్వులొలికించు ముఖము చక్కటి మెడగలసుగ్రీవ నరసింహుడు ఈయనే. వీరిని సేవించి తరించండి.

వీడే మరుజనకుడు (మన్మధునికి తండ్రి). అధికమైన మహిమలు కలవాడు ఈయనే. సుప్రసిద్ధుడైన లక్ష్మీవల్లభుడు ఈ స్వామియే. దేవతలందరికీ పరిపాలకుడు ఈయనే. శుభప్రదుడైన మూర్తి ఈ దేవుడే. అర్జునుడై అవతరించి దుష్టులైన రాజులను సంహరించిన నరునికి చెలికాడైన 'నారాయణుడు' కూడా ఈ సుగ్రీవునరసింహ దేవుడే. ఈయన శరణుపొందండి.

చతుర్దశ భువనాలకు అధిపతి ఈయనే. పురుషోత్తముడని కీర్తించబడుచున్న శ్రీహరి కూడా ఈయనే. రకరకములైన ప్రతాపములలో దిట్టఅయినవాడు ఈయనే. ఇక్కడ శ్రీవేంకటాద్రి స్వస్థానమైన ఆ శ్రీవేంకటేశ్వరుడు కూడా వేదెవ్వరో కాదు, నవీనముగా (సగం సింహం సగం నరుడుగల రూపం) కనుపించే నవమూర్తియైన సుగ్రీవనరసింహుడు. ఈ పరమపురుషుని సేవించి జన్మ చరితార్థం చేసుకోండి.

## మున్నుడి 3-54

నేటి కాలంలో కాముని పున్నమి సందర్భంగ'హోలీ' ఆడుతున్నారు. రకరకాల రంగులు చల్లుకొంటూ యువతీయువకులు మైమరచి పోతూ పాటలు పాడూతూ నృత్యములు చేస్తారు. ఆంగ్లేయ 'నాగరికత' అణచివేయని పల్లెల్లోనూ, ఉత్తర హిందుస్తాన్‌లోను ఈనాటికీ ఈపండుగ అలరిస్తూనే వున్నది. మన భాషలో దీన్ని 'వసంతం' ఆడటం అన్నారు. అట్లాచల్లే వసంతంలో పుపొడి, కస్తూరి, కర్పూరం పొడి, కుంకుమ. నీళ్ళు, వుంటే యువతీయువకులు రెచ్చిపోతుంటారు. అది ఒక 'జాజర! హరినీ సిరినీ (వేంకన్న మంగమ్మలను) అన్నమయ్య జాజరలో పూహించారు..... వినండి....

**ఆ.వె॥ వాడవాడలందు ఆడి వసంతంబు**
**పడతులన్ను ప్రియులు పరమశించి**
**జాడతోడకూడి చల్లేరుజాజర**
**అన్నమయ్య తలచెహరినిసిరిని.**

**రాగం : శ్రీరాగం**

వాడలవాడల వెంట వసంతము
జాడతో చల్లేరు నీపై జాజర జాజర జాజ ॥వాడల॥

కలికి నవ్వులె నీకు కప్పుర వసంతము
వలచూపు కలువల వసంతము
కులికి మాటాడినదె కుంకుమ వసంతము
చలమున చల్లె నీపై వసంతము ॥వాడల॥

కామిని జంకెన నీకు కస్తూరి వసంతము
వాముల మోహపు నీటి వసంతము
బూమెల సరసముల పుప్పొడి వసంతము
సామజ గురుడ నీపై జాజర జాజర జాజ ॥వాడల॥





అంగన అధరమిచ్చే అమృత వసంతము
సంగడి శ్రీవేంకటేశ సతిగూడితి
ముంగిటి రతి చెమట ముత్తేల వసంతము
సంగతాయెనిద్దరికి జాజర జాజర జాజ ॥వాడల॥

**భావామృతం :**

వీధివీధికీ పేటలన్నిటిలోను వసంతోత్సవం జరుగుచున్నది. ఓ శ్రీనివాసా! యువతులు నీపై జాడతో (దారి పొడుగునా) చల్లుతారు. ఎక్కడచూచినా జాజర, జాజర, జాజ, (జాజర అంటే జజ్జర.....అంటే వంచన అని అర్థం. పున్నమినాడు ప్రేయసీప్రియులు, వరుసయైన యువతీయువకులు ఒకరిపై ఒకరు నేరుగానూ, వంచనతో హఠాత్తుగానూ వసంతం చల్లుకొంటారు. అదే ....జాజర అంటే)

(అలమేల్మంగ నీతో వసంతమాడుతున్నది. ఆమె వసంతం అందరు చల్లే వసంతంలా లేదు. అది ఒక విచిత్రమైన వసంతం. దాన్ని వివరిస్తాను వినుము ప్రభూ.)

ఆ కలికి నవ్వులే నీకు కర్పూరవసంతము. వలపు చూపులే కలువరేకుల వసంతము. కులుకుతో ఆమె మాట్లాడు మాటలు నీకు కుంకుమ వసంతము. ఆ విధముగా ఆమె నీపై చలమున (చలాకీతనముతో) వసంతములాడుచున్నది.

ప్రభూ! ఆ కామిని యొక్క జంకెన (శృంగారముతోగూడిన వుత్తుత్తి బెదిరింపు ) నీకు కస్తూరి వసంతము. ఇక బెదిరించినా స్వామి వసంతం చల్లడం ఆప లేరు. ఈ సారి ఆవిడ 'వాముల' నాడింది. (అంటే చేత్తో 'జౌరు' చేసింది...అంటే చరించింది) అయితే ఆ మోహపు వాములు నీటితో ఆడే వసంతం వలెవున్నది. ఆయన చేసే బూమెల (చాటుమాటు) సరసాలు పుప్పొడి వసంతమా అన్నట్లు శోభించింది. ఓసామజగురుడా! (గజేంద్రునికి స్వామివైన దేవా!) నీమీద జాజర జాజర జాజ.

స్వామీ! అంగన యొక్క అధరం నీకు అమృత వసంతమైయొప్పారినది. ఓ సంగడి శ్రీవేంకటేశా! (స్నేహశీలిమైన తిరుమలేశా!) నీవు అట్టి సతిని గూడితివి. రతి సంగరమున కమ్మిన చెమటజల్లులు ముత్యాల వసంతమై శోభించింది. ఆ 'సంగతి' మీ ఇరువురికి జాజర అయింది. ఒకటే జాజర జాజర జాజ.

**3-55**

## మున్నుడి

అద్భుతమైన శరణాగతిని ఆలపింస్తున్నారు అన్నమాచార్యులవారు. ముని గజేంద్రవరదుడైన ఆ రక్షకుని శరణు పొందమన్నారు. "ఉభయ విభూతుల కొడయండు" అంటే ఇహపరములు రెంటినీ అనుగ్రహించగల ప్రభువు అని అర్థం. శరణంటే దగ్గరకు వచ్చి మరీ రక్షిస్తాడు. ఎటు చూచి నా పూర్ణత ఆ స్వామి స్వభావం. ఈ శ్రీవేంకటేశ్వరుడు వేదమయుడు. వేదమే స్వరూపంగా భాసించేవాడు.

**మ॥ శరణంబీతడె సర్వమున్ హరియె నాసంకీర్తనల్ వానికే**
**ఇరవౌ శ్రీపతిగాంచుమా వెరవునన్ ఇంపార చిత్తంబునన్**
**పరమున్ యీతడె దైవమై భువనముల్ పాలించు అన్నయ్యనెన్**
**హరిసంకీర్తన చేయువాని గొలువన్ ఆనందమౌ శ్రీహరీ!**

**రాగం :మలహరి**

శరణం బితడే సకలము నాకును
వెరవున మనసా వెతలవో యితని ॥శరణం॥

అభయం బొసగేటి యతడెవ్వడు ముని
యిభరక్షకు డతడెవ్వడు
వుభయ విభూతుల కొడయండెవ్వడు
ప్రభువతడే నా పాలిదేవుడు ॥శరణం॥

శరణాగతులకు సరిదాపెవ్వడు
యిరవుగ శ్రీపతి యెవ్వడు
అరిదుష్టదైత్య హంతకుడెవ్వడు
పరమును నతడే నా పాలిదేవుడు ॥శరణం॥





ఆది శంఖ చక్రాయుధుడెవ్వడు
యేదెస పూర్ణుండెవ్వడు
వేదమయుడు శ్రీవేంకటపతియై
పాదాయ నిదె నా పాలిదేవుడు. ॥శరణం॥

**భావామృతం :**

నాకు సర్వస్వమూ ఈ శ్రీవేంకటేశ్వరుడే. నాకు శరణము కూడా ఈతడే. ఓ మనసా! ఇతనిని వెరవున (ఉపాయముతో) వెతకవలెను. (అట్లు చేయకుంటే నీకెట్లా కనిపిస్తాడు?)

నీకు అభయమిచ్చి కాపాడగల వాలడెవ్వడు? ఆ నాడు గజేంద్రునకు అభయమిచ్చి రక్షించిందెవరు? ఇహము, పరము అనే రెండు విభూతులను (రెండు వైభవములను) ఈయగల సమర్థుడెవరు? ఇంకెవరు... నాపాలిటి దైవము, ప్రభువు అయిన తిరుమలరాయుడే.

శరణు జొచ్చిన శరణాగతులను దూరంగా వుండి రక్షిస్తారు కొందరు. కానీ వారి దగ్గరకు వెళ్లి రక్షిస్తారు, ఎవరు? ఇదిగో ఈయనే అన్ని ఐశ్వర్యములకు స్థానమెవ్వరు? ఈయనే. దుష్ట దానవులను అంతమొందించిన ఆర్తరక్షకుడెవరు? ఈయనే. జీవులందరికి మోక్షమూ ఈతడే. నాపాలిటి దైవము కూడా ఈ ఏడుకొండలవాడే.

ఆది శంఖచక్రాయుధుడైన వాడు ఎవరు? ఏవైపున చూచినా పూర్ణుడై పరిపూర్ణుడై గోచరించువాడు ఎవరు? వేదమయుడై, వేద నిలయుడై, వేదరూపుడైన శ్రీవేంకటేశ్వరుడై మూలాధారమై యున్న వీడే నాపాలిటి దైవము. నా సర్వస్వమూ ఈతడే.

**2-56**

## మున్నుడి

హరిరసము నాస్వాదించి బ్రహ్మానందమును పొందు హరిదాసుని అద్భుత విభవమును గీర్వాణ భాషలో ఆలపిస్తున్నారు అన్నమయ్య. సహృదయులైన నా మిత్రుల సహకారముతో దీని భావం వివరించగలిగాను. నా భావనయేమంటే, విశిష్టాద్వైతం స్వీకరించిన అన్నమయ్య తన గురువుల చేత ప్రభావితులై అనేక కీర్తనలు వారి నిస్స్వార్థ, సదాచార, నిరాడంబర భగవత్ కైంకర్య జీవనంపై చెప్పారు. వారిని సేవిస్తే శ్రీహరిని సేవించినట్లేనని అనేకమార్లు చెప్పారు. ఇక భావ వివరణలో పాడింత్య లోపాలను పెద్దలు మన్నించ ప్రార్థన.

**ఆ.వె॥ హరిరసమున పూని నిరతంబు విహరించు**
**నతడు సరసుడనెను అన్నమయ్య**
**"అమలు డతడు నాకు శ్రమను నివారించు"**
**అమరకీర్తనంబు అద్భుతమురా!**

**రాగం : హిందోళం**

హరి రసమ విహారి స తు
సరసోయం మమ శ్రమ సంహారి ॥హరిరసము॥

దయా నివృత తనుధారీ సం-
శయాతిశయ సంచారీ
కయాప్యజిత వికారీ
క్రియా విముఖ కృపాణధారీ ॥హరిసమ॥

సదా మిథ్యా జ్ఞానీ సతు
మదాలి మతాభిమానీ
తదాశ్రిత సంధానీ సతు
తదా తదా చింతాశయనాని ॥హరిరసమ॥





పరామృత సంవాదీ
స్థిరానందా స్వేదీ
వరాలాప వివాదీ శ్రీ
తిరువేంకటగిరి దివ్యవినోది ॥హరి రసమ॥

**భావామృతం**

హరిరసమునందు (బ్రహ్మానందమునందు) విహరించు భక్తుడు అయినవాడు, మిక్కిలి సరసుడు. అట్టివాడు నాకు శ్రమ నివారించు వాడైయున్నాడు.

హరి దయతో నిశ్చయమైన తనువును ధరించిన వాడు, సంశయమును అతిక్రమించి సంచరించువాడై యున్నాడు. ఆయన ఎవ్వరి చేతనూ జయింపబడని విశిష్టాకారము గలవాడై యున్నాడు. ఆయన క్రియారాహిత్యము అను కరవాలమును ధరించినవాడు.

ఆ శ్రీహరి భక్తుడు ఎప్పుడూ సంసారము మిథ్య అను తత్త్వము నెరిగిన వాడైయున్నాడు. ఆయన నా అభిమతమును ఆమోదించి అభిమానించు వాడై యున్నాడు. ఆయన ఆశ్రితాభిమానియై యున్నాడు. ఆయన అప్పుడప్పుడు తన శిష్యుల గురించి ఆలోచించుట మాననివాడై యున్నాడు.

భక్తుడు వరము అనునట్టి అమృతమును ప్రసాదించువాడై యున్నాడు. ఆయన స్థిరమైన ఆనందమును ప్రసాదించు వాడైయున్నాడు. ఆయన శ్రేష్ఠమైన వాక్కుల ద్వారా పలుకబడినవాడు. ఆయన తిరుమలలోని తిరువేంకటగిరియందు వినోదించు శ్రీవేంకటేశ్వరుని భక్తుడై యున్నాడు.

**2-57**

## మున్నుడి

అన్నమయ్య కీర్తనలలో ఏలపాటలు విఖ్యాతిగాంచినవి. నాయికా నాయకుల సంవాద రూపంలో వున్న ఈ కీర్తనలు 'ఉత్కంఠ'తో ఆద్యంతం సాగిపోతూ, చిట్టచివరికి నాయికకు నాయకుడు శ్రీవేంకటేశ్వరుడని తెలియటంతో ఆయన స్వాధీనమవుతుంటుంది. (ఏలే ఏలే మరదలా... వంటివి). తనెవ్వరో గుర్తించటానికి నాయకుడు ఎన్నో ఆధారాలను (క్లూస్) ఇస్తాడు. వాటిని ఆవిడ చివరికి గానీ అర్థం చేసికోదు. 700 ఏళ్లక్రిందట ఇంత విశిష్ఠ కీర్తన చెప్పిన ఆచార్యులవారిని 'ఏమని పొగడుదునో'... అని కీర్తించటం తప్ప ఏమిచేసి వారి ఋణం తీర్చగలం చెప్పండి.

**కం॥ సరసపు సంవాదంబులు**
**జరిగెను హరి రమల నడుమ, చక్కటి కృతితో**
**యెరిగించె నన్నమార్యుడు**
**అరవిందాక్షుని నెఱింగె ఆయమ తుదిలో.**

**రాగం : ఖరహరప్రియ**

ఏమంటి వేమంటి వెఱగ నేను? వో
కామిని నీకిప్పుడైన కానవచ్చెగా ॥ఏమంటి॥

వేలతలుపు మీటిన విటుడెవ్వడే! వో
తాలిమి నేనే మాధవుడను
వాలిన మాధవుడవంటె వసంతుడవా?
గాలింపు చక్రము చేత కలవాడ నేను ॥ఏమంటి॥

ధర చక్రివైతే కుమ్మరివాడవా? కాదే
సిరుల భూమి ధరించిన వాడనే
శిరసున భూమిమోచే శేషుడవా? కాదే
అరయనిన్నియు నేలే హరినే నేను ॥ఏమంటి॥





వంతులకు హరివైతే వానరమవా? నీ
మంతనపు లక్ష్మీ రమణుడ నేను
యింత యేల శ్రీవేంకటేశుడ ననగ రాదా?
అంతే పో నా మారు నీవంటివి గదే! ॥ఏమంటి॥

### భావామృతం

(ఈ కీర్తన నాయిక ప్రశ్న, నాయకుని జవాబుతో సాగిపోతున్నది. ప్రశ్న ఏదో తెలియటానికే నేను ప్రశ్నార్థకం '?' పెట్టాను.)

ఏమంటున్నావు? నీవేమంటున్నావు? నాకు తెలీటంలేదు. నీవేం మాట్లాడుతున్నావు? (నాయిక ప్రశ్నించింది)–ఓ కామినీ! నీకు ఇప్పటికైనా కానవచ్చెగా (కనిపించలేదా?)–(ఇది నాయకుని జవాబు...)

ఈ వేళప్పుడు తలుపు తట్టావు, ఎవడవయ్యా నీవు? ఏ సరసుడవయ్యా నీవు? అన్నది ఆమె. నేను తాలిమి (క్షమాగుణంకల) మాధవుడనే (ఇది ఆయన జవాబు). తాలింపు అంటే తిరుగుబోతు అనికూడా అర్థం. అందుకని ఆవిడ, వాలిన మాధవుడవంటే దిగివచ్చిన వసంతుడవా? (మన్మధుడివా?) అన్నది. కాదే... నేను గాలింపు చక్రము (వెదకి వెంటబడే) చక్రంగలవాడనే. (చక్రియైన శ్రీహరినే).

ఓహో! ఇంతా చేసి, చక్రధారి అంటే కుమ్మరివాడవా? అన్నది. కాదే... పిల్లా! సిరుల భూమి ధరించిన వాడినే (అన్ని సంపదలు గల భూదేవిని పెండ్లాడిన విష్ణువునే) అన్నాడాయన. ఓహో! అట్లా అయితే భూమిని తలమీద మోస్తున్న ఆదిశేషుడవన్నమాట. (ఇంతా చేసి, సర్పానివా...) అంతేనా? అన్నది ఆమె. కాదే... పిల్లా! ఆ ఆదిశేషుణ్ణీ, భూదేవినీ, చక్రాన్నీ, వసంతుణ్ణి కూడా ఆధీనంలో వుంచుకొన్న హరినే నేను.

ఓహో! ఇలా వంతులకు వచ్చి (పోటీగా వచ్చి) చెబుతున్నావు హరివా? వానరమా? (నీ కోతిబుద్ధి పోనిచ్చుకున్నావు కాదు...) అన్నదామె. ఆయన, ఓ భామా! నీ ఆలోచనల్లో సదా నిలచియుండే లక్ష్మీకాంతుడినే... నేను, అన్నాడు. అయితే నేను స్వయంగా శ్రీవేంకటేశ్వరుడు అనరాదూ... అన్నదామె. అంతే పోవే... సరిగ్గా కనుక్కున్నావు. నా మారు నీవంటివి. (నా బదులు నీవే చెప్పేశావు... సెహబాసు...) అన్నాడాయన.

**3-58**

## మున్నుడి

అలుమేలు మంగమ్మపై అన్నమాచార్యులవారు చెప్పిన చక్కటి కీర్తన ఇది. ఆమె అభినవరూపం (సరికొత్తరూపం) స్వామిని ఆనందంలోముంచి, ఆ సరసీరుహాక్షుని కన్నులకు చవులిస్తుంది. (ప్రీతిని కలిగిస్తుంది) అంటున్నారు. ఈమే గరుడాద్రి నరసింహుని ఘనవక్షము నాక్రమించిన ఆదిలక్ష్మి. తనవల్లభుని రసికతను పెంపొందించే శ్రీరమణి. సర్వాధికారి (రట్టడి) యైన శ్రీవేంకటరాయని పట్టణపు రాణి అయిన ఈ తల్లి లోకమాత. ఎండిపోయిన చెట్లను (వట్టిమాకులను) చిగురించ గల వలపుల మూట అటు... ఆహా...

**కం॥ అలమేల్మంగమ్మా! ఈ**
**జలజాక్షుని కనుగవలకు చవులిచ్చెను నీ**
**చెలువగు అభినవరూపము**
**నళినీ! ఆ అన్నమయ్య నయముగ తెలిపెన్**

**రాగం : భైరవి**

అలమేలుమంగ నీ వభినవరూపము
జలజాక్షు కన్నులకు చవులిచ్చేవమ్మా ॥అలమేలు॥

గరుడాచలాధీశు ఘనవక్షమున నుండి
పరమానంద సంభరితవై
నెరతనములు చూపి నిరంతరము నాథుని
హరుషించగ జేసితి గదమ్మా ॥అలేములు॥

శశికిరణములకు చలువల చూపులు
విశదముగా మీద వెదచల్లుచు
రసికతపెంపున కరగించి యెప్పుడు నీ-
వశము చేసుకొంటి వల్లభునోయమ్మా ॥అలమేలు॥





రట్టడి శ్రీవేంకట రాయనికి నీవు
పట్టపురాణివై పరగుచు
వట్టి మాకు లిగిరించు వలపుమాటల విభు-
జట్టిగొని వురమున సతమైతివమ్మా ॥అలమేలు॥

**భావామృతం :**

ఓ జగజ్జననీ! అలమేలు మంగమ్మా! నీ అభినవ రూపం (సరికొత్త రూపం), నళినదళాక్షుడైన శ్రీవేంకటేశ్వరుని కన్నులకు, చవులిచ్చేవి (ప్రీతిని కలుగజేస్తుంది). అమ్మా! నా విన్నపం, విను తల్లీ!

గరుడాద్రీశుడైన అహోబల నరసింహుని దేవేరియైన ఆదిలక్ష్మివై స్వామి వురమును ఆక్రమించినావు తల్లీ! అందుచేత పరమానంద సంభరితవైనావు. నీ నెరతకము (నేర్పరితనము) చూపి నిరంతరం నీ నాథుని ఆనందమూర్తిగానుంచి అలరిస్తుంటావు కదా తల్లీ!

శశికిరణముల చలువల చూపులు (చంద్రకిరణముల కంటే చల్లని చూపులు, విశదముగా (స్పష్టముగ) స్వామిపై వెదచల్లుచుందువు. ఓ తల్లీ! నీ రసికత చూపించి నీ నాథుని కరిగించి ఎప్పుడూ నీ వల్లభుడు నీ స్వాధీనుడై యుండునట్లు చేసికొందువు.

(రట్టడి అంటే గ్రామాధికారి అని అర్థం. ఇక్కడ జగన్నాథుడని భావించాలి) జగపతియైన శ్రీవేంకటేశ్వరునికి నీవు పట్టపు రాణివిగా పరగుచున్నావు. (ప్రసిద్ధిచెందినావు). వట్టి మాకు లిగిరించు (ఎండిన మోడులను చిగురింపచేయగల) వలపుమాటల (ప్రేమలొలికించు పలుకులతో) నీ విభుని జట్టిగొని (కొనుక్కొని) ఆయన వురముపై సతమైతివమ్మా! (శాశ్వతమైతివి తల్లీ!). (వేంకటరమణుని అప్పులన్నీ అమ్మవారే తీరుస్తున్నది కాబట్టి ఆయనను జట్టిగొన్నది... అంటున్నారు)

**3-59**

## మున్నుడి

ఇది అన్నమాచార్యులవారి శృంగార కీర్తన. అలివేలు మంగమ్మ చెలికత్తెలు ఆవిడ సౌందర్యం చెప్పరానిదని ఆ అందపు వైభవాన్ని చూచి తీరాలని కొనియాడుతున్నారు. సాధ్యమైనంత నర్మగర్భంగా చెప్పటానికి ప్రయత్నించిన కారణం చర్విత చరణమే. ఆ ప్రయత్నంలో భావామృతంలో కొన్ని భావాలు లోపించికూడా ఉండవచ్చును. ఆ చిన్నదాని కంఠ సీమనలంకరించిన నీలమణులహారం వేంకటరమణుడు ఆమెను బిగికౌగిట నిలిపినట్లున్నదట. అన్నమయ్యకి సాటిలేరు...రారు.

**చం॥ సిరులిటు ఇంతికున్నవని చెప్పుట కాదని అన్నమయ్యనెన్**
**ఒరుపుల లెక్కమిక్కుటము ఒప్పుల కుప్పకు నెంచి చూడగా**
**మెరసెను కంఠహారమున మేలగు నీలమణుల్ కనుంగొనన్**
**తరుణిని శ్రీవిభుండు తనదట్టపు కౌగిలి నించినట్లయెన్.**

**రాగం : కాపి**

చెప్పరాదీ యింతి సిరులు దీని
వొప్పులిన్నియు చూడ వొరపులో కాని ॥చెప్పరాదీ॥

ముదిత జఘనము మీది మొలనూలి గంటలివి
కదలు రవమెట్లుండె కంటిరే చెలులు
మదనుడుండెడి హేమమందిరము దిరిగిరా
కదిసి మ్రోసెడి పారిఘంటలో కాని ॥చెప్పరాదీ॥

కొమ్మపయ్యెదలోని కుచముల రుచి వెలికి
చిమ్ముటది యెట్లుండె చెప్పరే చెలులు
యిమ్మైన మరుధనములెల్ల రాసులు వోసి
కమ్ముకొని చెంగావి గప్పిరో కాని ॥చెప్పరాదీ॥





నెలత కంఠమునందు నీలమణిహారములు
అలరుటెట్లుండె కొనియాడరే చెలులు
లలితాంగి ప్రాణవల్లభుడు వేంకట విభుడు
నెలకొన్న కౌగిటనె నిలిచెనో కాని ॥చెప్పరాదీ॥

**భావామృతం :**

ఓహో! ఈ యింతి సిరులు (వైభవములు) చెప్పరాదు (వర్ణించలేము) దీని (ఈవిడ) వొప్పులన్నియు (ఐశ్వర్యములన్నియును) చూడ వొరపులో (అందమైనవే) కదా!

చెలులారా! ఈ ముదిత యొక్క జఘనము (నడుము) మీది మొలనూలిగంటలు కదలాడుతున్నప్పుడు చేయు సవ్వడి యెట్లున్నదో చూచినారా? అవి మన్మధుడు నివసించు బంగారు మేడలో తిరుగాడు చుండగా దగ్గరలో వినబడుచున్న ఆయన కాలి అందియల స్వరము వలెనున్నది.

చెలికత్తెలారా! ఈ లతాంగి ఒల్లెవాటులోని కుచముల ములయొక్క రుచి (కాంతి) బహిర్గతమవుచున్న విధంబెట్టిదో యెఱింగిరా? విరివియైన మరుధనము ఎఱ్ఱని రాసులుగా ఆక్రమించినవా యేమి? అంతేకాని అన్యము కాదు అనునట్లు యుండెను.

ఓ చెలియలారా! ఈ భామిని కంఠమున ధరించిన నీలమణుల హారము లెట్లున్నవో గమనించితిరా? వాని అందమును మీరు కొనియాడుడు. ఆహారము ఆమె మెడచుట్టు అల్లుకొని యుండి నీలవర్ణుడైన శ్రీవేంకటేశ్వరుని కౌగిట ఈమె ఇమిడిపోయినదా యేమి? అనునట్లున్నది.

**3-60**

## మున్నుడి

శ్రావణ బహుళ అష్టమినాడు (కృష్ణాష్టమినాడు) అర్ధరాత్రి చంద్రోదయ సమయంలో పరమాత్మ శ్రీకృష్ణునివలె ఆభరణాలతో, సర్వాయుధములతో, చతుర్భుజుడై దేవకీ, వసుదేవులకు తను జన్మించే కారణం వివరించి తరువాత శిశువుగా జన్మించాడు. ఆ దేవదేవుడు యెవరినెట్లా అనుగ్రహించాడో, కీర్తిస్తున్నారు అన్నమాచార్యులవారు. ఆ మహానుభావుడు తనను సేవించే దాసుల పాలిటి మాణిక్యము అట. శ్రీవేంకటాద్రి నేచిన బ్రహ్మము అట. ఓవరి అలమెల్మంగనురముపై బెట్టుకొని చెవదేరనుదయించాడట... అంటే? చదవండి మరి...

**తే॥ కనగ శ్రావణ బహుళాష్టమి నడిరేయి**
**చంద్రుడుదయించ, జగములు సంతసించ**
**సిరులతో బుట్టె కృష్ణయ్య శిశువు వోలె**
**అన్నమార్యుడు కృతిజెప్పె నద్భుతముగ.**

**రాగం : అమృతవర్షిణి**

అరయ శ్రావణి బహుళాష్టమి చంద్రోదయాన
సిరులతో నుదయించె శ్రీకృష్ణుడిదివో ॥అరయ॥

వసుదేవుని పాలిటి వర తపోధనము
యెసగి దేవకీదేవి యెదపై సొమ్ము
సుసరాన గొల్లెతల సొంపు మంగళసూత్రము
శిశువై వుదయించె శ్రీకృష్ణుడిదివో ॥అరయ॥

నందగోపుడు గన్న నమ్మిన నిధానము
పొందగు యశోదకు పూజదైవము
మందల యావులకును మంచి వజ్రపంజరము
చెంది యుదయించినాడు శ్రీకృష్ణుడిదివో ॥అరయ॥





సేవసేసే దాసుల చేతిలోని మాణికము
శ్రీవేంకటాద్రి నేచిన బ్రహ్మము
వోవరి నలమేల్మంగ నురముపై బెట్టుకొని
చె(సే) రదేర నుదయించె శ్రీకృష్ణుడిదివో ॥అరయ॥

**భావామృతం :**

(ఓ ప్రజలారా!) శ్రావణ బహుళాష్టమినాడు అర్ధరాత్రి చంద్రుడుదయిస్తున్న సమయంలో (పరమాత్మ) సకల వైభవములతో పాటు శ్రీకృష్ణునివలె వుదయించాడు. (అవతార పురుషుడైన ఆయన యెవరినెట్లనుగ్రహించాడో వినండి)

అరయగా ఆతడు వసుదేవుని పాలిటి వర తపోధనము (పూర్వజన్మలో చేసిన తపస్సువల్ల పుట్టాడు). ఆతడు దేవకీదేవి యెదపైన యెసగిన (శోభిల్లిన) సొమ్ము, (ఆభరణం). ఆయన గోపికలకు సుసరాన సొంపగు మంగళసూత్రము, (చక్కటి హారమే, కట్టిన మంగళసూత్రంగా శోభిల్లిన మనోనాథుడు). ఇదిగో అట్టి లీలలు చూపిన శ్రీకృష్ణుడు శిశువై వుదయించాడు చూడండి.

ఈయన నందగోపుడు చూచి తన నిధానము అని నమ్మిన దేవదేవుడు. యశోదాదేవికి అతడు పొందబడిన పూజదైవము (విశ్వరూపుడై తరింప చేసిన దైవం, కానీ భ్రమ ఆవిణ్ణి వదలలేదు). ఆవుల మందలకు ఈ గోపాలుడు వజ్ర పంజరము (వజ్ర పంజరం వంటి రక్షణ). ఈవిధంగా అందరికీ చెందినవాడై శ్రీకృష్ణుడు వుదయించాడు.

ఈ స్వామి సేవచేసి తరించాలనుకొనే దాసులకు అరచేతిలో మాణిక్యం (ఎప్పుడు కావాలంటే అప్పుడు ఉపయోగపడతాడు) ఈయనే శ్రీవేంకటాద్రిని యేచిన (అతిశయించిన) పరబ్రహ్మ స్వరూపుడు. ఈయన అలమేలు మంగను హృదయంపై పెట్టుకొనిన నాధుడు. ఆయన హృదయం, ఓవరి(లోపలిగది) లో ఆమె నిండియున్నది. సెవదేర (సేవదీర అని వుంటే బాగుంటుంది) అంటే ఈ శ్రీకృష్ణుడు చేవదీర వుదయించాడు అంటే... సామర్థ్యం కలవాడై వుదయించాడు అని నేను భావిస్తున్నాను.

**3-61**

## మున్నుడి

ఈ కీర్తనలో అన్నమాచార్యులవారు వైద్యునిగా మారి, మన 'రోగం' కుదర్చటానికి మంచి మందేదో సెలవిస్తున్నారు. మనిషి నాగరికుడైన దగ్గరనుంచి ఎన్నో వ్యాధులు వాణ్ణి పట్టి పీడిస్తున్నాయి. మనశ్శాంతిలోపం, బంధుప్రీతి, భవబంధాలు, పాపకర్మలు చేయటం, దైవ విముఖత వంటి విచిత్రమైన రోగాలు ఈ మానవుణ్ణి పీడిస్తున్నాయి. పదునాల్గు భువనాలలోను ఈ రోగాలకి మందులిచ్చే వైద్యుడు కనపడటంలేదు. మన సుకృతం కొద్దీ అన్నమాచార్యులవారు కలిశారు. విచారించకండి వీటన్నిటికీ ఒక్కటే మందు వుందన్నారు. ఒక్క 'పైస' కూడ పారితోషికం తీసికోని ఆయన మందు సేవించండి...

**కం॥ అన్నిటి కౌషధమిదియే**
**వెన్నుని నామంబె మీకు విమలౌషధమౌ**
**సన్నుతిజేయుచు గొనుడిది**
**అన్నయ్యను వినుడు నేడె హరి దిక్కనుడీ.**

**రాగం : మోహన కళ్యాణి**

అన్నిటికి నిది పరమౌషధము
వెన్నుని నామమే విమలౌషధము ॥అన్నిటికి॥

చిత్త శాంతికిని శ్రీపతి నామమె
హత్తిన నిజ దివ్యౌషధము
మెత్తపు బంధ విమోచనంబునకు
చిత్తజగురుడే సిద్ధౌషధము ॥అన్నిటికి॥

పరిపరి విధముల భవరోగములకు
హరిపాదజలమె ఔషధము
దురిత కర్మముల తొలగించుటకు
మురహరి పూజే ముఖ్యౌషధము ॥అన్నిటికి॥





యిల నిహపరముల ఇందిరా విభుని
అలరి భజింపుటె ఔషధము
కలిగిన శ్రీవేంకటపతి శరణమే
నిలిచిన మాకిది నిత్యౌషధము ॥అన్నిటికి॥

**భావామృతం :**

ఓ ప్రజలారా! మీ వ్యాధులన్నిటికీ ఇది పరమౌషధం. (దీన్ని మించినది లేదు). విష్ణుదేవుని నామ సంకీర్తనే శుద్ధమైన ఔషధము అని గ్రహించండి.

తరచుగా మీ అందరూ 'మనశ్శాంతి' కఱువయిందని వాపోతుంటారు. కోటీశ్వరుడైనా, కూటికి లేని వాడైనా ఇదే వ్యాధితో సతమతమవుతున్నాడు. దీనికి 'హత్తిన' (కలిగిన) దివ్యౌషధం వున్నది. అదే లక్ష్మీకాంతుని నామసంకర్తన. 'హరి హరి' అంటే చాలు (ఉత్తిగా నోటితో అంటే చాలదు మనస్సుతో అనాలి మరి). ఇంకొక ఘోరమైన వ్యాధి వున్నది. దానిపేరు 'బంధుప్రీతి'. మొత్తం బంధు వ్యామోహం నుండి విముక్తి లభించాలంటే ఒక గొప్ప సిద్ధౌషధమున్నది. అదే చిత్తజ గురుని (మన్మధుని తండ్రియైన మాధవుని) ఆశ్రయించుట, అని తెలిసికొనండి.

రకరకములైన వ్యాధులు భవము (పుట్టుక) చేత ప్రాప్తిస్తుంటాయి. (అవి మన పూర్వజన్మలలోని అకృత్యాలకు ఫలితంగా ఈ జన్మలో మనం అనుభవించటానికి కలుగుతుంటాయి. ఇప్పుడు మన చేతుల్లో ఏమీలేదు). దీనికి కూడా ఒకమంచి ఔషధం వున్నది. అదే శ్రీహరి పాదోదకం. శ్రీహరిని పూజించి అభిషేకం చేస్తే ఆయన పాదప్రక్షాళన తరువాత ఆ జలమును స్వీకరించండి. భవరోగం రూపుమాసిపోతుంది. మనం చేసిన పాతపాపాలే కాక ఈ జన్మలోనూ ఎన్నో చెడు కర్మలు చేస్తూనే వున్నాం కదా! ఇవి పోవాలంటే ఏం చేయాలి? మురహరి అన్ని కీర్తించబడే శ్రీమన్నారాయణుని పూజించండి. అది అతి ముఖ్యమైన ఔషధం.

ఈ ప్రపంచంలో ఇహ పరములు రెండింటికీ ఒక్కటే మందు వున్నది. అదే ఇందిరావల్లభుని భజన. ప్రీతితో ఆయనను భజించండి. ఈ ఏడుకొండల మీద ఈ దివ్యక్షేత్రంలో నెలకొన్న శ్రీవేంకటేశ్వరుని శరణాగతి ఒక్కటే మాకు ప్రతిదినమూ తీసికోవలసిన ఔషధమై నిలిచియున్నది.

**3-62**

## మున్నుడి

"ఓ పరమాత్మా! నీవు వ్యక్తుడవు, అవ్యక్తుడవు. వ్యక్తుని వలె నున్నప్పుడు నీవు శ్రీమన్నారాయణుడవు. శృంగారమూర్తివి. చిత్తజుడైన మన్మధుని తండ్రివి. అవ్యక్తునిగా నున్నప్పుడు నీవు ఆత్మరూపుడవు. జీవాత్మగా మా సాంగత్యంలోనే వుంటావు. ఓ సాసముఖా! (శ్వాస రూపంలో 'హంస' అని పిలువబడే నీవు 400 కోట్ల సార్లు ఉచ్ఛ్వాస నిశ్వా రూపంలో 100 సంవత్సరాలు మాలోకి వెళ్లి బయటకు వచ్చి మా ప్రాణం నిలుపుతున్నావు). ఆ రూపంలో నీవు మావద్దనే వున్నా, నిన్ను మేం చూడలేం. కానీ నీవు మా కన్నులకు ఈ తెప్పోత్సవంలో ఇద్దరి దేవేరులతో కూడి దేవదేవునిగా శ్రీవేంకటేశ్వరునిగా కనిపిస్తున్నావు" అన్నారు అన్నమయ్య.

**ఆ.వె॥ చిత్తజు గురుడీవు సింగార మూరితీ!**
**సంగతిని గనెదవు 'సాస' వదన!**
**తిరుమలందు జరుగు తెప్పోత్సవము నాడు**
**అన్నమయ్య గీతమాలపించె**

**రాగం : ఖమాస్.**

సింగార మూరితివి చిత్తజ గురుడవు
సంగతి జూచేరు మిమ్ము సాసముఖా ॥సింగార॥

పూవుల తెప్పల మీద పొలతులు నీవు నెక్కి
పూవులు ఆకసము మోవ పూచి చల్లుచు
దేవదుందుభులు మ్రోయ దేవతలు కొలువగా
సావధానమగు నీకు సాసముఖా ॥సింగార॥

అంగరంగ వైభవాల అమర కామినులాడ
నింగి నుండి దేవతలు నిను చూడగా
సంగీత తాళవాద్య చతురతలు మెరయ
సంగడి దేలేటి మీకు సాసముఖా ॥సింగార॥





పరగ కోనేటిలోన పసిడి మేడనుండి
అరిది ఇందిరయు నీవు ఆరగించి
గరిమ శ్రీ వేంకటేశు కన్నుల పండువగాగ
సరవి నోలాడు మీకు సాసముఖా ॥సింగార॥

**భావామృతం**

ప్రభూ! నీవు శృంగారమూర్తివి. మనుస్సులో జన్మించి మనోవైకల్యం కల్పించే మన్మధునకే తండ్రివి. ఓసాసముఖా! వూపిరి రూపింలోవున్న మిమ్ము నిత్యమూ అనుభవిస్తూ నీ సాంగత్యతంలో మేము మిమ్ము జూచుచునే యున్నాము.

(అయినా మా అజ్ఞానం వల్ల నిన్నెరగకున్నాము.)

ఈ పూల తెప్పమీద వూరేగుతున్నావు. అప్పుడు దేవతలు దేవదుందుభులు మ్రోగించుచున్నారు. ఆకాశమును తాకునట్లు పూలు వెదజల్లుచున్నారు. అందరూ సావధానులైయున్నారు. ఓ సాసముఖా! నీకు అందరూ విధేయులే.

అదిగో అంగరంగ వైభవంతో అప్సరసలు నృత్యంజేస్తున్నారు. ఆకాశంలో దేవతలంతా ఆ నృత్యాన్ని ఆనందంగా చూస్తున్న నిన్ను కనులారగాంచుటకు వుత్సాహపడుతున్నారు. సంగీత తాళముల కనుగుణముగా వాయిద్యములన్నియు చాతుర్యము ప్రదర్శింపబడుచు మ్రోగుచున్నవి. ఈ వీరందరితో సంగడిదేలేటి (బృందముగా పాల్గొనే) మీకు వారందరూ విధేయులే. ఓసాసముఖా! అందరూ నీ దాసులే.

తండ్రీ! ఈ కొనేటిలో నీవు అతిశయించి నీ దేవేరులతో బంగారు మేడనుండి వచ్చి స్నానమాడుచున్నావు. అరిది (దుర్లభము) అయిన ఇందిరాదేవి నీవు నైవేద్యమునారగించుము. ఆ వెనుక ఓశ్రీవేంకటేశ్వరా! మా కన్నులపండువగా సరవితో (ఇంపుగా) ఓలలాడుము. ఓ సాసముఖా! ఇంతకంటే జన్మతరించే మార్గం ఏమున్నది?.

**3-63**

## మున్నుడి

అన్నమాచార్యులవారు ఈ కీర్తనలో జాతి వివక్షతను నిరసిస్తున్నారు. హరి భక్తు దేజాతివాడైతేనేమి? అందరిలోను అంతరాత్మగా హరివున్నప్పుడు, లౌకికవైదిక కర్మలు చేస్తున్నంత మాత్రాన విశిష్ఠత కలుగుతుందా? వసుధానాధుడు, శ్రీకాంతడు అయిన శ్రీవేంకటేశ్వరుడు తన మాయచేత భ్రమ కల్పించి మానవులు ఈ జాతిభేదం పాటించేట్లు చేస్తున్నాడు. నిజానికి ఆ శ్రీపతినామమే సుజాతి. గీతాచార్యుడుచెప్పిన పరమ సత్యాన్నే అన్నమయ్య పామరులకు కూడ అర్ధమవునట్లు చక్కటి కీర్తనలో చెబుతున్నారు. ఆలకించండి...

**చం॥ అనెను విజాతులన్నియును వ్యర్థము వ్యర్థము యెంచితూచినన్**
**కనిన ప్రయోజనంబు కలికంబది వేసియు కానరాదురా**
**తనదగు మాయచేత వసుధాపతి! జీవులకిన్ని బేధముల్**
**అనువుగ పెట్టినాడనెను అన్నయ కీర్తన మద్భుతంబురా**

**రాగం : లలిత/మిశ్రమలహరి**

విజాతులన్నియు-వృథా వృథా
అజామీళాదుల -కదియే జాతి ॥విజాతు॥

జాతి భేదములు-శరీరగుణములు
జాతి శరీరము-సరితోడనెచెడు
ఆతుమ పరిశుద్ధంబెప్పుడును-అది నిర్దోషం బనాది
యీతల హరివిజ్ఞానపు దాస్యం-బిదియొక్కటె పో సుజాతి ॥విజాతు॥

హరి యిందరిలో -నంతరాత్ముడిదె
ధరణి జాతిభే-దము లెంచిన
పరమ యోగు లీభావ మష్టమదము-భవనికారమని మానిరి
ధరణిలోన బరతత్త్వ జ్ఞానము-ధర్మమూలమే సుజాతి ॥విజాతు॥





లౌకిక వైదిక-లంపటులకు నివి
కైకొను నవశ్య-కర్తవ్యంబులు
శ్రీకాంతుడు శ్రీవేంకటపతిసే-సిన సంపాదన మిందరికి
మేకొని యిన్నియు మీరిన వారికి-మీ నామమే సుజాతి ॥విజాతు॥

**భావామృతం :**

(ఓ మానవులారా!) విజాతులన్నియు (విభిన్నములైన జాతులన్నియునూ) వ్యర్థమే వ్యర్థమే. శుద్ధ నిరుపయోగములు. అజామీళుని వంటి కులభ్రష్టులది యేజాతి అని చెప్పగలం? (అతను విష్ణువును చేరినాడు కదా!)

నశించిపోయే అశాశ్వత శరీరానికి మాత్రమే జాతిభేదం శరీరం పోయాక జాతీ పోయింది. కానీ దీంట్లో వున్న ఆత్మ సదా పరిశుద్ధమైనది. దోషరహితమైనది. కావున దేహ భావ మొదలి ఆత్మభావం అలవడితే, హరివిజ్ఞానం వలన హరిదాసుడైన వానిదే సుజాతి అని తేలికగా అర్ధమవుతున్నది.

శ్రీహరి జీవులందరిలోను అంతరాత్మ రూపంలో వున్నాడు. కానీ మానవులకు ఈ భూమిమీద అన్న మదము, అర్ధమదము వంటి ఎనిమిది రకముల మదములు కలుగుచున్నవి. ఇది మాయ వలన సంసారమందున కలుగుచున్న తిరస్కార భావములు. జ్ఞానులైన యోగులు ఈ మాయ నెరుగుటవలన తుచ్ఛమైన జాతిభేదమును విడనాడి పరతత్త్వము నెఱిగి దానికవసరమైన ధర్మమును మాత్రమే పాటిస్తారు. వారి లక్షణము మాత్రమే ఉత్తమజాతి లక్షణములని గ్రహించవలెను.

లౌకికములైన వైదిక కర్మలలో నిమగ్నులైన వారు మాత్రమే చేపట్టవలసిన కర్తవ్య కర్మలవలన ఏమి ప్రయోజనం కలుగుతుంది? చెప్పండి. ఇవన్నీ శ్రీకాంతుడైన వేంకటేశ్వరుడు తన మాయా ప్రభావము చేత జీవులకు అమర్చిన 'సంపదలు'. ఓ శ్రీవేంకటేశ్వరా! ప్రయత్న పూర్వకముగా ఈ లౌకిక వైదిక కర్మకాండనతిక్రమించిన నీ దాసునికి నీ నామ సంకీర్తన యొక్కటియే సుజాతి లక్షణము. ఇదే నిజం.

## 3-64

## మున్నుడి

నాకు అత్యంత ప్రియమైన అన్నమయ్య కీర్తన ఇది. 265 కీర్తనల తరువాత ఇంత ఆలస్యంగా దీని భావామృతం వివరించటానికి కారణం 'ఇంత సులువైన కీర్తనకి నా వివరణ అవసరమా! అనే నా అజ్ఞానమే' ముక్తికి అర్హులైన వారి 'క్యూ' లో మనం నిలబడితే (ఎప్పటికైనా) ఈ కీర్తనని 'స్మరిస్తే' మీముందున్నవాడిని ఆపి మిమ్మల్ని ముందుకు పంపిస్తారు. అంటే ఎన్నిసార్లు ఈ కీర్తన ఆలపిస్తే అంతముందుకు వెడతారు. దయచేసి ఈ కీర్తన 'బట్టీపట్టి' రోజూ పాడుకోండి. 'జలరుహాభవనుత చరణయుగ' అంటే బ్రహ్మదేవునిచే కీర్తింపబడు పాదపద్మములు గలవాడని అర్థం. 'బలి బంధన' అంటే త్రివిక్రముడై బలిచక్రవర్తిని బంధించినవాడని.

**తే॥ భజన నారాయణునికిది మధురమైన**
**తేనెతేటరా చల్లని వానజల్లు**
**అన్నమయ్య సంకీర్తన నెన్న తరమె!!**
**నారదుడు సన్నుతించి ఆనందమందు**

**రాగం : బెహాగ్**

నారాయణతే నమో నమోభవ
నారద సన్నుత నమో నమో ॥నారాయణ॥

మురహర భవహర ముకుంద మాధవ
గరుడ గమన పంకజనాభా
పరమ పురుష భవబంధ విమోచన
నరమృగ శరీర నమో నమో ॥నారాయణ॥

జలధి శయన రవిచంద్ర విలోచన
జలరుహాభవనుత చరణయుగ
బలి బంధన గోప వధూవల్లభ
నలినోదర తే నమో నమో ॥నారాయణ॥





ఆదిదేవ సకలాగమ పూజిత
యదవకుల మోహనరూప
వేదోద్ధర శ్రీవేంకటనాయక
నాదప్రియ తే నమో నమో ॥నారాయణ॥

**భావామృతం :**

ఓ శ్రీమన్నారాయణుడా! నీకు నమో వాకములు. నీకు అనేక వందనములు. నీవు భవుడవు (సత్తు అని పిలువబడే సత్యము నీవే. నారదుడు అహరహమూ నిన్ను కీర్తిస్తుంటాడు. అట్టినీకు శతకోటి వందనములు.

నీవు మురహరుడవు (ముర అను రాక్షసుని నిర్జించిన వాడవు). భవహరుడవు (పుట్టుక లేకుండా చేయువాడవు). నీవు ముకుందుడవు (ఎఱ్ఱని తామరపువ్వు చేత ధరించినవాడవు). మాధవుడవు (లక్ష్మీపతివి). గరుడ గమనుడవు (గరుత్మంతుని పై పయనించువాడవు). పంకజ నాభుడవు (పద్మనాభుడవు). పరమ పురుషుడవు (పురుషోత్తముడవు). భవబంధ విమోచనుడవు (పురాకృత కర్మల వలన కలిగిన తల్లిదండ్రి, బిడ్డలు, భార్య మొదలైన బంధములను సడలించు వాడవు). నరమృగ శరీరుడవు (నరసింహ స్వరూపుడవు). ప్రభూ! అట్టి నీకు వందనములు.

తండ్రీ! నీవు జలధిశయనుడవు (క్షీరసాగరమున పవ్వళించియుండు వాడవు). రవిచంద్ర విలోచనుడవు. (సూర్యచంద్రులు నేత్రములుగా కలవాడవు). జలరుహాభవనుత చరణ యుగ్మము (పద్మ సంభవుడైన బ్రహ్మ దేవుడు కీర్తించు పాదముల జంట) కలవాడవు. బలి బంధనుడవు (వామనావతారంలో మూడవ అడుగు పెట్టడానికి చోటు చూపించలేదని బలిచక్రవర్తిని త్రివిక్రముడవై బంధించిన వాడవు). గోపవధూవల్లభుడవు (గోపకాంతలను వధువులుగా స్వీకరించిన వాడవు). పద్మము వుదరమునందు కలవాడవు. అట్టినీకు అనేక వందనములు.

ప్రభూ! నీవు ఆది దేవుడవు. సకలాగమములచేత (చతుర్వేదములచే) కీర్తింపబడువాడవు. యాదవకులమున జన్మించిన జగన్మోహనుడవు. ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు వేదములను వుద్ధరించి రక్షించినవాడవు. అంతేకాదు నాదము (ఓం కారము మరియు సంగీతము) అంటే చాలా ప్రీతి కలవాడవు. అట్టి నీకు అనేక వందనములు. నన్ను రక్షింపుము తండ్రీ!

**3-65**

## మున్నుడి

చక్కటి తత్త్వబోధను ఇంత చిన్న కీర్తనలో అద్భుతంగా చేస్తున్న అన్నమాచార్యులవారిని ఆకర్ణించండి. మానవ జన్మ అతి దుర్లభమైనదని జీవియెన్నో జన్మలు అనుభవించాక గానీ నరజన్మ లభించదని శాస్త్రం చెబుతున్నది. ఆ మానవజన్మ నెత్తికూడా జంతువులాగా బ్రతుకుతూ మనకంటే బలవంతుణ్ణి ఆశ్రయించి, పిడికెడి పొట్టకోసం, క్షణికమైన సుఖంకోసం ఏవేవో బాంధవ్యాల చిక్కుల్లో తగులుకొని, మళ్ళీ వాటి ఫలితంగా అనేక జన్మల్లో అందరిలోనూ పుట్టి పెరిగి ఏవేవో రూపాలు ధరించి మనిషి వేసారిపోతున్నాడు. అందరాని శ్రీవేంకటేశ్వరుని సేవించడు. అయ్యో...

**ఉ॥ మానవుడై జనించి ధరమానవునిన్ గొని సేవ జేయుచున్**
**మానక దుఃఖమంది అవమానము లందగనేల హీనుడై**
**దీనశరణ్యునిన్ హరిని దీటుగ గొల్పుడు అన్నమయ్యనెన్**
**ఆ నళినీధవుండు తను అండగ నుండును వేంకటేశుడై**

**రాగం : అభోగి**

మనుజుడై పుట్టి మనుజుని సేవించి
అనుదినమును దుఃఖ మందనేల ॥మనుజుడై॥

జుట్టెడు కడుపుకై చొరని చోట్లు చొచ్చి
పట్టెడు కూటికై బతిమాలి
పుట్టిన చోటికే పొరలి మనసు పెట్టి
వట్టి లంపటము వదలనేరడు గాన ॥మనుజుడై॥

అందరిలో పుట్టి అందరిలో పెరిగి
అందరి రూపము లటు తానై
అందమైన శ్రీవేంకటాద్రీశు సేవించి
అందరాని పదము అందెనటు గాన ॥మనుజుడై॥





**భావామృతం :**

ఓ మానవులారా! ఏమిటీ విచిత్రం!! మానవుని వలె జన్మించిన వాడు, ఇంకొక మానవుని సేవించడమేమిటి? పోనీ దానివలన ఏమన్నా సుఖపడుతున్నాడా అంటే లేదే!! ప్రతి దినము దుఃఖిస్తూనే వున్నాడు. మరి ఇక ఇదంతా యెందుకు? ఆలోచించండి.

సరే! తిండికోసం పడరాని పాట్లు పడవలసి వస్తోంది అనుకుంటే, మన కడుపు యెంత వుంది? జుట్టెడు (జానెడు కడుపు). దీనికోసం చొరరాని చోట్లు (వెళ్లకూడని స్థలములకు) చొచ్చి (వెళ్ళి), అవస్థలు పడుతున్నాడు. పట్టెడు కూటికోసం (పిడికెడు తిండికోసం) ఎవరెవర్నో బ్రతిమిలాడి, భంగపడి, మనస్సంతా తనుపుట్టిన చోటుపైనే పెట్టి, ప్రవర్తించి, వుపయోగపడని లంపటాలను (తగులుకొన్న బాంధవ్యాలనే ఊంపిని) వదలనే లేడు. కాబట్టి వీడు మనిషై పుట్టి సాధించినదేమిటి? శుద్ధ దండుగే కదా!

ఇక ఈ మానవ జన్మలో వీడు చేసిన అకృత్యాలవల్ల యేం జరుగుతున్నదో చూడండి. వీడు (ఈ ఆత్మ) మళ్ళీ అందరిలోనూ పుడుతున్నాడు. కాబట్టి అందరిలోనూ పెరుగుతున్నాడు. ఆ హీనజన్మల రూపములన్నీ తానే అవుతున్నాడు. ( ఈ దీక్షితులు యెక్కడో ఏ గాడిద జన్మనో పొందుతాడనే ఆలోచనే... కంపరం కలిగిస్తున్నది కదా!) మరి యెందుకండీ ఈ తిప్పలు? మనోజ్ఞమూర్తియైన ఆ స్వామిని, శ్రీవేంకటేశ్వరుని సేవించి, మానవులకు అందరాని కైవల్య పదవ నందుకొనుటకు ప్రయత్నించాలి, కానీ వ్యర్థజీవితం గడుపవచ్చునా?

**3-66**

## మున్నుడి

బహుశా యేదో కష్టం వచ్చినప్పుడు అన్నమాచార్యుల వారు ఈ కీర్తన చెప్పి వుంటారు. రాజదండనకు గురియై దిక్కు తోచక ఆయన స్వామితో మొరపెట్టి వుంటారు. "ఘోరపు రాజసభలో కుంది విన్నవించితిమి నీకు' అన్నారు. "నీదాసుల అవమానం నీవు చూస్తుంటావా? ప్రభూ! నీవు ఏది చూచి వుపేక్షించావు?నీకు ప్రత్యేకంగా హెచ్చరించవలసిన పనేమున్నదయ్యా? క్షీరసాగరంలో నిద్రించి వున్నా యెన్నిసార్లు దేవతలని రక్షించావు? ద్వారకలో వున్నా... ద్రౌపదిని హస్తినాపురంలో రక్షించావు. వైకుంఠంలో లక్ష్మీదేవితో వున్నవాడివి మొసలి బారి నుండి గజేంద్రుని రక్షించావు. నీ తిరుమల ఇక్కడే కదా! రావయ్యా! నన్ను రక్షించు తండ్రీ!"

**కం॥ నీ దాసుల భంగమ్ముల**
**ఏదని చూచేవు నీవు హెచ్చరికేగా?**
**రాదా నీ దయ మాపై**
**ఖేదంబున అన్నమయ్య కీర్తించె హరిన్**

**రాగం : మలయమారుతం**

నీ దాసుల భంగములు నీవు జూతురా
ఏదని చూచేవు నీకు ఎచ్చరించ వలెనా ॥నీ దాసుల॥

పాలసముద్రము మీద పవ్వళించినట్టి నీకు
బేలలై సురలు మొరపెట్టిన యట్టు
వేళతో మా మనవులు విన్నవించితిమి నీకు
ఏల నిద్దిరించేవు మమ్మిట్టె రక్షించరాదా ॥నీ దాసుల॥

ద్వారకానగరములో తగ నెత్తమాడే నీకు
బీరాన ద్రౌపది మొర వెట్టిన యట్టు
ఘోరపు రాజసభల కుంది విన్నవించితిమి
యే రీతి పరాకు నీకు ఇంకా రక్షించరాదా ॥నీ దాసుల॥





యెనసి వైకుంఠములో ఇందిర కూడున్న నీకు
పెనగి గజము మొరవెట్టిన యట్టు
చనవుతో మా కోరిక సారె విన్నవించితిమి
విని శ్రీవేంకటేశుడ వేగ రక్షించరాదా ॥నీ దాసుల॥

**భావామృతం :**

ఓ శ్రీవేంకటేశ్వరా! నీ దాసులమైన మా బాధలు, అవమానాలు నీవు చూస్తూనే వుంటావా? ఏదని చూస్తావు? అన్నీ తెలిసిన నీకు మళ్ళీ హెచ్చరించవలసిన పనేమున్నది ప్రభూ! (ఓ ఆర్త రక్షకా! రా తండ్రీ! నన్ను రక్షించు)

నీవు క్షీరసాగరంలో యోగ నిద్రలో వుంటే దీనులై దేవతలు యెన్నిసార్లు మొరపెట్టి నీకు చెప్పుకోలేదు? అట్లాగే మేమూ మా మొరలను ఈవేళ నీకు విన్నవిస్తున్నాము. ఆనాడు వాళ్లని ఆదుకుని రక్షించావు కదా! (బలిచక్రవర్తి దగ్గర 'భవతి భిక్షాందేహి!' అని కూడా అన్నావు). మరి నేడు ఇంకా నిద్రపోతున్నావెందుకు? మమ్ము 'ఇట్టే' రక్షించరాదా తండ్రీ!

ద్వారకా నగరంలో సత్యాదేవితో నెత్తమాడుతున్న (పాచికలాట ఆడుతున్న) నీతో, బీరాన ద్రౌపది (బలహీనురాలైన ద్రౌపదీ దేవి) హస్తినాపురంలో మొరపెట్టి "నన్ను మానభంగం కాకుండా ఈ దుశ్శాసనుని రక్షించు కృష్ణా!" అని మొరపెట్టుకొన్నది. అప్పుడు 'అక్షయ' మైన చీరెలిచ్చి ఆమెని రక్షించలేదా? ఈ రాజసభలో ఘోరపు అవమానాల పాలై కుంది (దుఃఖించుచూ) విన్నవించుచున్నాము. ప్రభూ! ఏ విధమైన పరాకుతో (అన్యమనస్కుడవు యై) వున్నావు? ఇంకా నన్ను రక్షించవేల తండ్రీ!

వైకుంఠపురంలో యెనసి (పొందుగా) లక్ష్మీదేవితో నీవు ఏకాంతములో వుంటే యెక్కడో కారడవిలో కొలనులో మొసలి బారిన పడిన గజేంద్రుడు "నీవే తప్ప ఇతః పరంబెరుగ... రావే ఈశ్వర! కావవే వరదా! సంరక్షించు భద్రాత్మకా!" అంటే పరుగు పరుగున వెళ్ళి రక్షించావు కదా! నీమీద వున్న చనవుతో మా కోరిక నీకు విన్నవించి "మమ్ము కాపాడు ప్రభూ!" అని మొరపెట్టుకొన్నాం. "ఓ శ్రీవేంకటేశ్వరా! వినికూడా రావేమి? వేగమే వచ్చి మమ్ము రక్షించు తండ్రీ! నీవే నాకు దిక్కు."

## 3-67

## మున్నుడి

ఎంత అద్భుతమైన దృశ్యాన్ని వర్ణిస్తున్నారో చూడండి. మన అన్నమాచార్యులవారు. రేపల్లెలో వున్న ఒక దొంగ పిల్లవాడిని, (అదీ వజ్ర సువర్ణ చౌర్యం కాదు) పాలు వెన్న దొంగతనం చేసి, విపరీతమైన అల్లరి చేసే ఒక గొల్లపిల్లాడిని కీర్తిస్తున్నారు. ఎవరు? బ్రహ్మాది దేవతలు. ఎక్కడ? ఆకాశ వీధిలో వరుసగా నిలబడి. ఎవర్ని? ఒంటినిండా నూగుధూళి (గాలిలోకి లేచిన గోధూళి) అంటి, అట్టుకట్టుకొని పోయి, చొల్లు కార్చుకొంటున్న పాపాయిని. ఆదిశేషుడు వేదమంత్రాలతో నుతిస్తున్నాడట. “చద్దికి వేడికి వచి సనకాది మునులు వీడే శ్రీవేంకటేశ్వరుడ”ని పాడుతున్నారట. అంటే...? చదవండి మరి...

**మత్తకోకిల : పాలదొంగని ఆడిపాడుచు పాలిదైవమనెంచుచున్**
**నీలవర్ణుని సన్నుతించుచు నింగి బ్రహ్మయు దేవతల్**
**రోలగట్టిన చిన్ని కృష్ణుని లోకనాథు నుతించగా**
**మేలు కీర్తన మన్నమార్యుడు మించి తాన్వినిపించెరా.**

**రాగం : మోహన**

పాలదొంగ వద్ద వచ్చి పాడేరు తమ
పాలిటి దైవమని బ్రహ్మాదులు ॥పాలదొంగ॥

రోల గట్టించుక పెద్దరోలలుగా వాపోవు
బాలుని ముందర వచ్చి పాడేరు
ఆలకించి వినుమని యంబర భాగమునందు
నాలుగు దిక్కుల నుండి నారదాదులు ॥పాలదొంగ॥

నోరినిండా జొల్లుగార నూగు ధూళి మేనితో
పారేటి బిడ్డని వద్ద పాడేరు
వేరులేని వేదములు వెంట వెంట చదువుచు
చేరి చేరి యింతనంత శేషాదులు ॥పాలదొంగ॥





ముద్దులు మోమునగారు మూలమూలల దాగే
బద్దుల బాలుని వద్ద పాడేరు
అద్దివో శ్రీ తిరువేంకటాద్రీశు డితడని
చద్దికి వేడికి వచ్చి సనకాదులు ॥పాలదొంగ॥

**భావామృతం :**

పాలు దొంగతనంగా త్రాగే చిన్ని కృష్ణుని దగ్గరకు కైలాసం నుండి శివుడు, సత్యలోకం నుండి బ్రహ్మ, స్వర్గలోకం నుండి దేవతలు వచ్చి, స్వామీ! నీవే మా పాలిట దేవదేవుడవు అని పాడుతూ కీర్తిస్తున్నారు. (ఆ అద్భుత దృశ్యాన్ని మీ మనోనేత్రంతో వీక్షించండి).

రోలు, వంటలో పచ్చళ్ళు పొడులు చేసికొనుటకు వాడతారు. కానీ కుండెడుపాలు నేలపాలు చేశాడని కోపం భరించలేక బాలకృష్ణుని రోటికి కట్టేసింది తల్లియశోద. వాడు వూరకుంటాడా? పెద్ద రోలలుగా వాపోతున్నాడు. (గట్టిగా పెడబొబ్బలు పెడుతూ ఏడుస్తున్నాడు). మనందరి ఏడుపును వూరుకోబెట్టేవాడు ఎలా ఏడుస్తున్నాడో చూడండర్రా అని, అందర్నీ వినండి వినండి అని నారదుడు మొదలైన వారు నాలుగు దిక్కుల్నించీ వచ్చి ఆకాశవీధిలో నిలబడి పాడి కీర్తిస్తున్నారు.

నోటినిండా చొల్లుకారుతుంటే, నూగుధూళి (గాలిలోకి రేగిన గోధూళి) ఒంటికి అంటుకుపోయి తెట్టుకట్టి నేలమీద పాకుతున్న చిన్న పాపాయి కృష్ణయ్య దగ్గరకు వచ్చి మేరలేని (హద్దులు లేని) వేదమంత్రములు పదే పదే చదువుతూ ఆయన చుట్టూ గుమిగూడి కీర్తిస్తున్నదెవరో తెలుసునా? స్వయంగా ఆదిశేషుడు మొదలైన వారు. (మనబోటి అల్పులకి కనబడరు... అంతే)

ముద్దులు మూటగట్టే మొఖముతో మూలమూలకు పోయి దాగికొని ఆడుకొంటున్న, బద్దుల బాలుడు (చీటికీ మాటికీ అబద్ధాలు చెప్పే పిల్లవాడు) యైన బాలకృష్ణుడే అల్లదిగో ఆ శ్రీవేంకటేశ్వరుడు. వేంకటాద్రి మీదనున్న ఇతని వద్దకు చద్దికి వేడికీ వచ్చి (చల్లగా వుండే రాత్రివేళల్లోను, వేడిగా వుండే ఎండవేళల్లోనూ) సనకసనందానాది ఋషులు పాడి నుతించేరు. (అదండీ ఈ స్వామి వైభవం...)

**3-68**

## మున్నుడి

అన్నమాచార్యుల వారి స్ఫూర్తితో ఆయన కుమారుడు పెద తిరుమలయ్య, అతని కొడుకు చిన తిరుమలయ్య కూడా తమ జీవితాలు శ్రీవేంకటేశ్వరుని సేవకే అంకితం చేసి వేల కీర్తనలు వేంకటపతి మకుటంతో చెప్పి తరించారు. ఈనాడు వాటిని మననం చేసికొంటూ మనం మన స్థాయిలో స్వామిని కొలుస్తున్నాం. వైరాగ్యం తొణికిసలాడే ఈ కీర్తనలో "ఓ శ్రీహరీ! ఒక్క నిముషం కూడా వదలక నిన్ను స్మరించి అనురాగమంతా నీపై నిలిపి బ్రతికితే... అది బ్రతుకుగాని.. నిద్రలోను, వ్యామోహంలోను, వృద్ధాప్యంలోను, ధనం కోసం వెంపర్లాడుతూ... బ్రతికితే... అదీ బ్రతుకేనా? అంటున్నారు.

**కం॥ చిన తిరుమలయ్య చెప్పిన**
**అనుపంబగు కీర్తనంబు, హరిని మరువకన్**
**మన వలెను జీవితాంతము**
**వెనుకాడక నిముషమైన వీడక అనియెన్**

**రాగం :మౌళవిగౌళ**

నిమిషమెడతెగక హరి నిన్ను తలచి
మమత నీ మీదనే మరిపి బ్రతుకుటగాక ॥నిమిష॥

నిదురచే కొన్నేళ్ళు నేరముల కొన్నాళ్ళు
ముదిమిచే కొన్నాళ్ళు మోసపోయి
కదిసిరి కోరినను గత కాలంబు వచ్చునే
మది మదినె యుండి ఏమరక బతుకుటగాక ॥నిముష॥

కడు తనయులకు కొంత కాంతలకునొకకొంత
వెడయాసలకు కొంత వెట్టిసేసి
అదరి కావలెననిన అందు సుఖమున్నదా
చెడకనీ సేవలే సేసి బతుకుటగాక ॥నిముష॥





ధనము వెంట తగిలి దాస్యంబునకు తగిలి
తనవారి తగిలి కాతరుడైనను
కనుకలిగి శ్రీవేంకటనాథ కాతువె
కొనసాగి నిన్ను నే కొలిచి బతుకుటగాక ॥నిముష॥

**భావామృతం :**

ఓ శ్రీహరీ! నిముష మాత్రమైనా నిన్ను వదలక మమతాను రాగములను నీపైననే మరట్చి బ్రతుకుగడుపుట తగినపని. అట్లు గాక జీవించిన, అదీ బ్రతుకేనా?

మనిషి జీవితంలో మూడవ వంతు నిద్రకే వ్యర్థమై పోతున్నది.

అట్లా నిద్రకు కొన్నాళ్ళు, తగని పనులు చేస్తూ కొన్నాళ్ళు, వృద్ధాప్యంలో చింతిస్తూ కొన్నాళ్ళు, మోసపోయి కాలమంతా వ్యర్థం చేసి కొన్నాను. కదిసి (దగ్గరయై) కోరుకొనినా గడిచిపోయిన ఆ కాలం తిరిగివస్తుందా? మనస్సును అదుపులో వుంచి ఏమరుపాటు లేక బ్రతకాలి. అట్లు గాక జీవిస్తే అది కూడా ఒక బ్రతుకేనా?

మానవుడి జీవతమంతా వెట్టి చాకిరి (జీతం కోసం పని చేస్తూ...) చేస్తూ బ్రతుకుతున్నాడు. తన ప్రియమైన కుమారులకు కొంత, భార్యకు ఇంకాకొంత, వెడ (వ్యర్థమైన) ఆసలకు కొంత ఆ జీతాన్నీ, తన జీవితాన్నీ ఖర్చు చేస్తాడు. కావాలనుకొన్నా అదరి ఆసక్తితో ప్రయత్నించినా అందులో (అట్టి జీవితంలో) సుఖమున్నదా? చెడిపోక నీ సేవ చేయుచు బ్రతకాలి. అట్లుకాక ఎన్నాళ్లు బ్రతికినా అదీ బ్రతుకేనా?

నరుడు ధన సముపార్జనలో వ్యసనపడి, దాస్యం చేస్తూ అదే యావతో, తనవారి కోసం, వారి బాగు కోసం చింతిస్తూ కాతరుడై (భీరువై) బ్రతుకుతాడు. అట్లుగాక ఓ శ్రీవేంకటేశ్వరా! కనుకలిగి (దృషి మమ్ము రక్షించెదవు కద! అట్లా బ్రతకాలి గానీ ఇంకొక విధంగా బ్రతికితే అదీ బ్రతుకేనా....

**3-69**

## మున్నుడి

విజయనగరము (హంపీ) లో వెలసియున్న వాయునందనుడు హనుమంతునిపై అన్నమాచార్యులవారు చెప్పిన రమణీయమైన కీర్తనమిది. మతంగ పర్వతం మీద ఒక కాలు మాల్యవంత పర్వతం మీద ఇంకొక కాలు జాపి నిలుచుని అతిశయిల్లుచున్న పెద్దహనుమంతుడితడా!!!! అని ఆశ్చర్యంతో కీర్తిస్తున్నారు. ఆయన 'ఆతత బలాఢ్యు'డట (అంతులేని బలశాలి). కాలనేమిని భంజించాడట (విరిచాడట). నిరతితో (మిక్కిలి ఆసక్తితో) వేంకటాద్రిపై కూడా అరిది (అరుదైన) వరములిచ్చేవాడు ఈతడేనా!!! అంటున్నారు.

**మ॥ ఘనుడాకాలు మతంగ పర్వతము యీకాలూనె మాల్యాద్రిపై**
**పెను ఆకారము వాడురా, హనుమ ఈ వీరాగ్రణిన్ గొల్వుడీ**
**అనియెన్ అద్భుత కీర్తనంబు నుడివెన్ అన్నయ్యనాలింపుడీ**
**తను శ్రీవేంకటనాథు బంటు,వరముల్ దానంబు జేసెన్ భళా!**

**రాగం : శంకరాభరణం**

మతంగ పర్వత మాడ మాల్యవంతమునీడ
అతిశయిల్లిన పెద్ద హనుమంతు డితడా ॥మతంగ॥

యీతడా రాముని బంటు యీతడా వాయుసుతుడు
ఆతత బలాఢ్యుడందు రాతడితడా
సీతను వెదకివచ్చి చెప్పిన యాతడితడా
ఘాతల లంకలోని రాక్షసవైరి యితడా ॥మతంగ॥

అంజనా సుతుడితడా అక్షమర్దను డితడా
సంజీవని కొండ దెచ్చె సారె నితడా
భంజించె కాలనేమిని పంతంబున నితడా
రంజిత ప్రతాప కపిరాజ సఖుడితడా ॥మతంగ॥





చిరజీవియీతడా జితేంద్రియుడితడా
సురులకుపకారపు చుట్ట మీతడా
నిరతి శ్రీవేంకటాద్రిని విజయనగరములో
నరిది వరములిచ్చీ నందరికి నితడా ॥మతంగ॥

**భావామృతం :**

అక్కడ మతంగపర్వతం మీద ఒకకాలు, ఇక్కడ మాల్యవంత పర్వతం మీద ఇంకొక కాలు ఉంచి కాళ్ళు బారజాపి నిలుచున్నట్లు అతిశయముతో నిలుచున్న పెద్ద హనుమంతుడితడేనా!!!

ఈ మహానుభావుని ఘనతను వినండి. ఆ నాటి శ్రీరామచంద్రుని నమ్మిన బంటు యీతడేనా!! వాయునందనుడైన అత్యంత బలశాలి అని కీర్తిస్తున్నారే.... ఆయన ఈయనేనా!! సీతాదేవిని అన్వేషించి ఆమె క్షేమ సమాచారం రఘునాథుని కందించిన ఆతడీయనేనా!! లంకానగరంలో ఘాతల రాక్షసుల శత్రువు ఇతడేనా!!

అంజనీదేవి పుత్రుడని భక్తులందరు కొనియాడుచున్నది ఇతనినేనా!! రావణసుతుడైన అక్షుని మర్దించి సంహరించిందితడేనా!! సారెకు (కావలసినప్పుడల్లా) సంజీవని పర్వతం తెచ్చినదితడేనా!! పంతము వహించి కాలనేమి అనే దానవుని భంజించింది(విరచి సంహరించినది) ఇతడేనా!!(రంజితము అంటే ఎఱ్ఱని అనే అర్థం. అనురాగము అని ఇంకొక అర్థం. కానీ ఇక్కడ శోభాయమానమైన లేక చక్కటి అనే అర్థంలో చెప్పారు) చక్కటి ప్రతాపముకల కపిరాజు సుగ్రీవుని హితుడీతడేనా!!

చిరంజీవిగా వర్ధిల్లుచున్నదీయనేనా!! ఇంద్రియములను గెలిచిన జితేంద్రియుడీయనేనా!! దేవతలకు బంధువు వలె వుపకారములు చేసిన దీయనేనా!! మిక్కిలి ఆసక్తితో శ్రీవేంకటేశ్వరుని నెలవైన అంజనాద్రిపై రక్షకుడైయున్న ఆయనే ఈ విజయనగరంలో కూడా వెలసి తన భక్తులందరికీ అరుదైన వరముల ననుగ్రహించుచున్నది ఈ రామదూతయేనా!!!

**3-70**

## మున్నుడి

అన్నమాచార్యులవారు అలమేలు మంగమ్మపై చెప్పిన చక్కటి కీర్తన ఇది. వేంకటనాధుని రాక కోసం నిరీక్షిస్తూ ఆ తల్లి పడుతున్న పాట్లను వర్ణిస్తున్నారు. నా మున్నుడిలో నేను రెండు సంగతులు నిరూపించదలచాను. అన్నమయ్య కవిత ఛందోబద్ధమైనది నా పద్యంలో కీర్తన అలాగే వాడాను. తెలుగు పాటలో అర్ధం కాని దేముంటుంది అనుకొనే వారి కనువిప్పుకోసం ఆ మాటలు అలాగేవాడాను. ఎంతమందికి ఈ పద్యం అర్థమవుతుంది? అవునా?

**సీ॥ మెరుగువంటిది అలమేల్మంగ గాంచుడీ**
**అరిమురి నవ్వీని అలరుబోడి**
**పలుచని యెలుగున పాటనీపై పాడి**
**మెలుపుకూరిమి జూపె మెరుగుబెడి**
**చెలులతో నీ సుద్ది తలమునకగ జెప్పి**
**అలయును సొలయును అగరుబోడి**
**ఈడుగా నీరాక కెదురెదురై చూచు**
**మేడపై నుండి ఆ మిసిమి బోడి**

**ఆ.వె॥ పేరు కొని పిలుచును ప్రియములు చెప్పును**
**వేంకటేశ! నీదు వెలది గనుము**
**అన్నమయ్య పాట అది పద్యమైపోయె**
**ఛందమందు చెప్పినందు చేత.**

**రాగం : ఖమాస్**

మెరుగువంటిది అలమేలుమంగ
అరిమురి నవ్వీని అలమేలుమంగ ॥మెరుగు॥

పలుచని యెలుగున పాడీ నీ మీద పాట
మెలుపు కూరిమి నలమేలుమంగ
చెలులతో నీ సుద్ది చెప్పిచెప్పి కరిగీని
అలయుచు సొలయుచు నలమేలుమంగ ॥మెరుగు॥





యీడుగా నీ రాకకు నెదురుదురు చూచీ
మేడమీదనుండి యలమేలుమంగ
వాడు మోముతో నీపై వలపు చల్లి చల్లి
ఆడీ నాట్యము సారె నలమేలుమంగ ॥మెరుగు॥

పేరుకొని పిలిచీని ప్రియములు చెప్పిచెప్పి
మేరమీర నిన్ను నలమేలు మంగ
యీరీతి శ్రీవేంకటేశ నిన్ను గూడె నేడు
ఆరితేరి నన్నిటాను అలమేలుమంగ ॥మెరుగు॥

**భావామృతం :**

(ఓ శ్రీనివాసా! ఈ మా అలమేలుమంగమ్మ ఎటువంటిదంటా వేమో? వినుము ప్రభూ!)

మా అలమేలుమంగ మెరుగు (ఆకాశంలోని మెఱపు) వంటిది. ఆమె నిన్ను చూడగానే... అరిమురి (సంభ్రమముతో) నవ్వుతుంది.

పలుచని యెలుగున (సన్నని గొంతుతో) మా అలమేలుమంగమ్మ నీ మీద పాటలు అల్లి పాడుతూనేవున్నది. ఆమెకు నీపై అంత మెలుపు కూరిమి (గాఢమైన ప్రేమ)వున్నది. తన చెలికత్తెలకు నీ కబుర్లు చెప్పిచెప్పీ ఆ పరవశంలో కరిగిపోయి అలసిపోయింది, సొలసిపోయింది. (అట్టి మా అలమేలుమంగమ్మను అనుగ్రహించవయ్యా!)

మా అలమేలుమంగమ్మ,ఈడుగా (ఆలస్యమైన) నీరాకకోసం యెదురెదరు (ఎదురతెన్నులు) మేడ మీదనుంచి యెలా చూస్తున్నదో చూడవయ్యా! ఆమె సారెకు (మాటిమాటికీ), నీపై వలపు కురిపించీ నాట్యమాడీ ఆడీ, వాడు మోముతో (వాడిపోయిన మొగముతో) ఎలావున్నదో చూశావా? (నీకింకా దయరాదేమయ్యా?)

మా అలమేలుమంగమ్మ నీ ప్రియురాలవటంచేత నీ పేరును యెన్నిసార్లు పిలిచిందో లెక్కలేదు. మేరమీద (అమితముగా) నీ నామస్మరణ చేస్తూనే వున్నది. ఓ శ్రీవేంకటేశ్వరా! ఆమె ఈ విధంగా నేడు నిన్ను గూడినది. నీ సాంగత్యంలో మా అలమేలు మంగ అన్నిటిలోనూ ఆరితేరింది ప్రభూ! (మా అమ్మ సంతోషమే... మా సంతోషం)

**3-71**

## మున్నుడి

విశిష్టాద్వైతం స్వీకరించి అన్నమాచార్యులయిన అన్నమయ్య ఆ మతం చెప్పే వేదాంత రహస్యాల గురించి, ఆ గురువుల విశిష్టత గురించి అనేక కీర్తనలు చెప్పారు. మూడుమాండ్లు తొమ్మిది మాటలలో వేదాంత రహస్యమంతా గురువులను వేడుకొని గ్రహించారట. మూడు మాటలు ఏమిటి? జీవుడు, దేవుడు, ప్రకృతి. సరే...జీవుని గురించిన 'జ్ఞానము", 'ఆచార్యునిపై విశ్వాసం' వలన వస్తుంది. అలాగే దేవునిపై 'భక్తి' 'శరణాగతి' వలన వస్తుంది. అదే విధంగా... ప్రకృతియందు 'వైరాగ్యం' 'భగవద్దాస్యం' వలన కలుగుతుంది. వేదాంత రహస్యం అంతా ఈ విధంగా, మొత్తం మూడు మూండ్లు తొమ్మిదే మాటలట.

**ఉ॥ మాటలు మూడు మూండ్లనుట మాత్రము నిక్కము తొమ్మిదౌనురా**
**దీటుగ శ్రద్ధతో గురుని దీవెన పొంది గ్రహింపుమన్నియున్**
**పాటను పాడుచున్ తెలిపె మంచిని ప్రాజ్ఞుడు అన్నమార్యుడున్**
**సాటి మరేది? శ్రీహరికి సాగిలి మ్రొక్కుడు జన్మధన్యమౌ**

**రాగం : ఖమాస్**

మూడే మూటలు మూడు ముళ్ళు తొమ్మిది
వేడుకొని చదువరో వేదాంత రహస్యము ॥మూడే॥

జీవస్వరూపము చింతించి యంతటాను
దేవుని వైభవము తెలిసి
భావించి ప్రకృతి సంపద యిది యెరుగుటే
వేవేలు విధముల వేదాంత రహస్యము ॥మూడే॥

తనలోని జ్ఞానము తప్పకుండా దలపోసి
పనితోడి నందువల్ల భక్తి నిలిపి
మనికిగా వైరాగ్యము మరువకుండుటే
వినవలసిన యట్టి వేదాంత రహస్యము ॥మూడే॥





వేడుకతో నాచార్య విశ్వాసము గలిగి
జాడల శరణాగతి సాధనముతో
కూడి శ్రీవేంకటేశ్వరు గొలిచి దాసుడౌటే
వీడని బ్రహ్మానంద వేదాంత రహస్యము ॥మూడే॥

**భావామృతం :**

వేదాంతమునందు రహస్యమైన మాటలు మొత్తం మూడు మూండ్లు తొమ్మిది మాత్రమే కలవు అని జిజ్ఞాసువులైన వారు గురువులను వేడుకొని చదివి, గ్రహించారు. ఆ వేదాంత రహస్యములను మీరుకూడా గ్రహించండి.

జీవుని స్వరూపమెట్టిదో చింతించెదము. సర్వాంతర్యామియైన దేవుని వైభవమును గ్రహించవలెను. భావించుచూ ప్రకృతి సంపద యెట్టిదో యెఱుంగవలెను. ఈ మూడింటినీ గ్రహించిన వేదాంతరహస్య గ్రహణయందు మొదటి మూడు మెట్లు యెక్కి , వివిధమైన వేదాంత రహస్యములను నేర్చినట్లే యగుచున్నది.

తనలోని జ్ఞానమును తప్పకుండా భావించవలెను. ప్రయత్నపూర్వకంగా ఆ జ్ఞానము స్థిరపడితే, భక్తిని (దేవునిపై) నిలుపుట సాధ్యమవుతుంది. ఆ భక్తి దృఢమై వైరాగ్యమే జీవిత సారమని గ్రహింపు కలిగి మరువకుండా ఆ వైరాగ్యంతో వేదాంత రహస్యములన్నీ వినవలసినవి విని స్థిర చిత్తుడవ్వాలి.

అప్పుడు ఆనందముతో ఆచార్యునిపై నమ్మకం నిలుపవలెను. దానివలన ఆయన భగవంతుని శరణాగతి పొందుటెట్లో నేర్పుతారు. (దాన్ని తెలుసుకొన్నంతమాత్రాన సరిపోదు, సాధన చేయాలి) ఆ శరణాగతితో భగవంతుడైన శ్రీ వేంకటేశ్వరుని కొలిచి దాస్యం చేయాలి. అప్పుడేం జరుగుతుందో తెలుసా.... ఎన్నడు విడువని బ్రహ్మానందము కలుగుతుంది. ఇంతకంటే... వేదాంత రహస్యం ఏముంటుందయ్యా?

## 3-72

## మున్నుడి

తండ్రి బాటలోనే నడచిన అన్నమాచార్యులవారి పుత్రుడు పెదతిరుమలయ్య కూడా ఎన్నో చక్కటి కీర్తనలు అవి అన్నమయ్యవేమో అని భ్రమపడేలా చెప్పారు. అదే భక్తి వైరాగ్యం తొణికిసలాడటం, అదే శ్రీవేంకటేశ మకుటం వుపయోగించటం వల్ల అలా భావించటం సహజమే. ఈ కీర్తనలో 'చతురుడైన శేషాచల నివాసుని శ్రీనివాసుని అది ఒక వ్రతము అని భావించి ఆయననే పాడెదను (కీర్తించెదను) అంటున్నారు. ఎవ్వరిని సనకాదులు, శుకుడు, ధృవుడు, నారదుడు, విభీషణుడు, భీష్ముడు, ప్రహ్లాదుడు, వసిష్ఠుడు, వ్యాసుడు, అర్జునుడు, అలమేల్మంగ-వీళ్ళంతా కొలిచారు? శ్రీవేంకటేశ్వరునే...

**చం॥ అనిశము శ్రీశుకుండు, సనకాదులు నెమ్మది గొల్చి రెవ్వనిన్**
**వినయముతో విభీషణుడు, భీష్ముడు పొందిరి వేని సత్కృపస్**
**మునుపు కిరీటియున్ అతని ముందరి భక్తులు వేడి రెవ్వనిన్**
**అనఘుడు వానినే తిరుమలయ్యను గొల్చెను అన్నమార్యుడున్**

**రాగం : సరస్వతి**

అతని పాడెదను అది వ్రతము
చతురుని శేషాచల నివాసుని ॥అతని॥

సనకాదులు ఏ సర్వేశు గొలిచిరి
అనిశము శుకుడెవ్వని దలచె
మును ధృవుడే దేవుని సన్నుతించె
ఘన నారదుడే ఘనుని పొగడెను ॥అతని॥

ఎలమి విభీషణుడే దేవుని శరణనె
తలచె భీష్ముడే దైవమును
బలు ప్రహ్లాదుని ప్రాణేశుడెవ్వడు
ఇలలో వశిష్ఠుడే మూర్తి దెలిసె ॥అతని॥





పురిగొని వ్యాసుడే పురుషుని చెప్పెను
తిరముగ అర్జునుని దిక్కెవ్వడు
మరిగిన అలమేల్మంగపతి యెవ్వడు
గరిమల శ్రీవేంకటేశుడీతడు ॥అతని॥

**భావామృతం :**

(ఓ ప్రజలారా!) చతురుని (అత్యంత చాతుర్యంగల) శేషాచలనివాసుని కీర్తించెదను. అది నాకు వ్రతము.

ఆది నుంచి సనకాది మహర్షులు ఏ సర్వేశ్వరుని పూజించారు? అనిశము (ఎల్లప్పుడు) శుకమహర్షి యెవ్వనిని తలచుకొనే వాడు? మును(కృతయుగంలో) ధృవనక్షత్రమై జగద్విఖ్యాతిగాంచిన ధృవుడు యే దేవుని సన్నుతించాడు? ఘనుడు, బ్రహ్మమానస పుత్రుడైన నారదుడు యే ఘనుని ప్రతి క్షణం పొగడుతుంటాడు? (వానినే నేనూ ప్రార్థిస్తాను).

ఎలమి (సంతోషముతో) తన అన్న రావణుని కాదని త్రేతాయుగంలో అతని తమ్ముడు విభీషణుడు యేదేవుని శరణుజొచ్చాడు? ద్వాపరయుగంలో కురుపితామహుడైన భీష్ముడు, తనని చక్రంతో ఖండిస్తానని వచ్చిన యే దేవుని 'తెరలి చనుదెంచు దేవుండు దిక్కు నాకు" అని వేడుకొన్నాడు? బలు ప్రహ్లాదుని (అతిశయించిన ప్రహ్లాదుని) ప్రాణేశ్వరుడై నీడవలె కాపాడినది యే దేవుడు? ఈ భూమిపై సప్తఋషులలో ఒకడైన వశిష్ఠుడు ఏ మూర్తిని జగద్రక్షకుడని తెలుసుకొన్నాడు? (అదిగో... ఆయననే నేనూ ప్రార్థిస్తాను.)

పురిగొని (దిట్టముగా) వ్యాసుడు యే పురుషుని ఇతడే పురుషోత్తముడని చెప్పాడు? ఆయన (వ్యాసుడు) సంతతివాడైన అర్జునుడు ఎవ్వరిని దిక్కని నమ్మాడు? శ్రీమహాలక్ష్మి అవతారమైన జగన్మాత అలమేల్మంగమ్మ క్షణం కూడా వీడలేక హృదయ వాసినియై ఎవ్వరి గుండెల్లో తిష్టవేసికొని వుంటుంది? అదిగో... అల్లదిగో... గరిమల (మహిమాన్వితుడైన) ఆయనే శ్రీవేంకటేశ్వరుడు. ఈయనే మన సర్వస్వం.

**3-73**

## మున్నుడి

శ్రీరామచంద్రుడు రావణ సంహారం జరుపవలసిన సమయమాసన్నమైనది. ఆయనకోసం స్వర్గం నుంచి 'మాతలి' సారథిగా తన స్వంత రథం పంపించి జగముల నుద్ధరించమని వినుతించాడు దేవేంద్రుడు. శ్రీరాముడు ఆ దివ్యరథం యెక్కి బయలుదేరాడు. ఆ దృశ్యాన్ని మన కళ్ళకు కడుతున్నారు ఆచార్యులవారు. దీనినిబట్టి ఆయన సంపూర్ణ రామాయణం కీర్తనలలో చెప్పి వుంటారని, మన దౌర్భాగ్యం కొలది అది లభించడం లేదని తెలుస్తోంది. కనుల యెదుట వున్న రత్నాన్ని రాయి అనుకోవడం పారవేసుకోవటం, ఇంకొక డొచ్చి ఆ సంగతి చెబితే యేడవడం, తెలుగువాడి తెగులే కదా!

**ఆ.వె॥ వినుడిదే రఘుపతి విజయము లిన్నియు**
**పనుపడి దనుజులిడు బాధలుడిగె**
**చుక్కలెల్ల'డల్లె'స్రుక్కె' భూతములన్ని**
**అన్నమయ్య పాట అంత సులువె?**

**రాగం : ఆరభి**

వినుడిదె రఘుపతి విజయములు
పనుపడి రాక్షస బాధలుడిగెను ॥వినుడిదె॥

కులగిరులదరెను కుంభిని వడకెను
యిల రాముడు రథమెక్కినను
కలగె వారిధులు కంపించె జగములు
బలు విలునమ్ములు వట్టినను ॥వినుడిదె॥

పిడుగులు దొరిగెనుపెనుగాలి విసరె
తొడిబడి బాణము దొడిగినను
ముడివడె దిక్కులు మొగ్గె దిగ్గజములు
యెడపక రావణ నేసినను ॥వినుడిదె॥





చుక్కలు డుల్లెను స్రుక్కె భూతములు
తొక్కి యసుర తల దుంచినను
గక్కున శ్రీవేంకటగిరి నిలువగ
అక్కజమగు శుభమందరి వోదవె ॥వినుడిదె॥

**భావామృతం :**

(ఓ ప్రజలారా!) ఇదిగో రఘుకుల పతియైన శ్రీరామచంద్రుని విజయమునెట్లు దేవతలు వీక్షించారో... ఆపైన, పనుపడి రాక్షస బాధలు (రాక్షసులవల్ల కలిగిన బాధలు) వుడిగెను (క్షీణించినవి). ఆ సమాచారం వినండి.

ఆ శ్రీరామచంద్రుడు బలు విలునమ్ములు (అసమాన్యమైన కోదండమును బాణములను) పట్టుకొనగానే... కులగిరులు (హిమాలయము,వింధ్యవంటి పర్వతములు)అదిరిపోయినవి. భూమి వణికిపోయి కంపించింది. కోదండపాణియైన ఆయన రథము నెక్కగానే "కలిగె వారధులు" (సముద్రములు సంక్షోభించినవి). జగములన్నియు కంపించినవి.

ఆ శ్రీరాముడు బాణము దొడిగిన వెంటనే, పిడుగులు రాలిపోయి నేలపై దొరికినవి. పెనుగాలి తొడబడి విసరె (పెద్దగాలి చలించి పోవునట్లు వీచింది). ఆయన యెడపక (వెనువెంటనే) రావణుని వధించాడు. అప్పుడు దిక్కులు ముడివడెను, (దిక్కులు గడ్డకట్టి పోయాయి). దిగ్గజములు మొగ్గె (మ్రొగ్గె అంటే మోకరిల్లినవి). (అటువంటి సంక్షోభం జరుగగా ఆయన రావణుని సంహరించాడు.

అప్పుడు ఇంకా ఏం జరిగిందంటే... చుక్కలు డుల్లెను. (నక్షత్రాలు ఆకాశం నుంచి, వూడిపడ్డాయి).

స్రుక్కెభూతములు (సమస్త ప్రాణులు భయపడిపోయాయి.) ఆ విధంగా శ్రీరాముడు అసురుని తలతొక్కి త్రుంచివేశాడు. ఆశ్చర్యకరంగా ఆ వెంటనే ఆయన శ్రీవేంకటాద్రి నివాసుడై పోగానే ప్రజలందరికి శుభములు కలిగినవి.

(వావిలిపాడులోని వీరరామచంద్రునిపై చెప్పిన కీర్తన అయివుంటుంది).

# 3-74

## ముస్నుడి

"నారీ నారీ నడుమ మురారి" అనే రాసకేళి దృశ్యం మన మనోఫలకం మీద ముద్రిస్తుందీ అన్నమాచార్య కీర్తన. కృష్ణుడి 'పోకడలకు' కినుక వహించిన గొల్లెతలు అతనిని దెప్పిపొడుస్తున్నారు. ఒక్కొక్క దాని మధ్య వొక్కక్క రూపంలో వుంటావు. కృష్ణా! నిన్ను చూడబోతే అసాధ్యుడిలావున్నావు. నిన్నెట్లా నమ్మమంటావు? అంటున్నారా అమ్మాయిలు. ఒక దానితో మాట్లాడితే ఒక దానికేసి జంకూగొంకు లేక చూస్తాడట. ఒకదానికి కన్ను కొడతాడట, ఒకదాన్ని కౌగలిస్తాడట. వెన్నతిన్న నోటితోనే ముద్దలిస్తాడట. అందరితోనూ రాసక్రీడలో పాల్గొంటాడట. అయినా శ్రీవేంకటేశ్వరుడివి నిన్ను గాక ఎవర్ని నమ్మమంటావయ్యా.......

**కం॥ ఒక్కొక్క భామ నడిమిని**
**ఒక్కొక రూపంబుదాల్చి ఒదిగే కృష్ణా!**
**యెక్కడ నిను నమ్మేదిర?**
**చక్కగనా అన్నమయ్య సంకీర్తించెన్.**

**రాగం : మలహరి**

ఒక్కొక్క సతి నడుమ నొక్కక్క రూపుగైకొని
యెక్కువైతి కృష్ణా నిన్నెట్ట నమ్మేదిరా ॥ఒక్కొక్క॥

మాటలాడే వొకతెతో మళ్ళి చూచేవొకతెను
వోటలేక నవ్వునవ్వే వొకతెతోను
కూటువై గొల్లెతలము గుంపుగూడున్నారమిదే
యేటిది నీ మోహమిక నెందని నమ్మేదిరా ॥ఒక్కొక్క॥

కన్నుగీటేవొకతెకు కాగిలించే వొకతెను
వెన్నదిన్న మోవిచ్చేవు వేరొకతెకు
వున్నతి రాసక్రీడలున్నార మిందరము
ఇన్నిటిలో నీ వలపు యెందని నమ్మేదిరా ॥ఒక్కొక్క॥





తమ్మవెట్టే వొకతెకు తగమెచ్చే వొకతెను
సమ్మతించ చేసొకతె చన్నులంటేవు
యెమ్మెల శ్రీవేంకటేశ ఇందరి మమ్ము గూడితి
విమ్ములఁ నేనమ్మితిగా కెటుల నమ్మేదిరా ॥ఒక్కొక్క॥

**భావామృతం :**

శ్రీకృష్ణా! ఒక్కొక్క భామ మధ్య ఒక్కొక్క రూపము దాల్చి యెక్కువైయున్నావు. (అసలు కృష్ణుడు ఎవరో కూడా తెలియటం లేదు) నిన్నెట్లు నమ్మేదిరా?

ఒకవైపు చూస్తే ఒకానొక గోపికతో మాట్లాడుతూ కనిపిస్తాడు. ఒకవైపు ఏదో యొక గోపికకేసి తిరిగి తదేకంగా చూస్తూ కనిపిస్తావు.

ఒకదానితో, వోటులేక (జంకూగొంకూ లేక) పకపక నవ్వుతూ కనిపిస్తాడు. అందుకనే మేం గోపికలమందరమూ కూటవై (గుంపుగా) గుమిగూడివున్నాము. ఇది ఎట్లాంటి మోహమో గాని ఎక్కడని నిన్ను నమ్మేదిరా? ఓ కృష్ణా! ఏమిటిరా నీ మాయ?

పోనిలే...అనుకుంటే... ఒకగోపికకు కన్నుగీటు...తున్నావు. ఎవరేమనుకొంటారో అని కూడా చూడక ఒక దాన్ని కౌగలిస్తావు.ఇంకొక గోపికను నీ వెన్న దిన్న పెదవులతోనే ముద్దపెట్టుకొంటున్నావు. అందరమూ పొడవుగా బారులు దీరి రాసక్రీడలో వున్నాము.

ఇన్నింటిలో మాయ వేషాలు వేసే నిన్ను ఎట్లా నమ్మేదిరా కృష్ణా!

మరీ విడ్డూరమేమంటే ఒకతెకు నీ అర్ధాంగి వలె నీ నోటి తాంబూలం పంచి ఇస్తావు.ఒకదాన్ని తెగ మెచ్చుకొంటావు. ఒకదాన్ని ఎలాగో అంగీకరింప చేసి దాని వక్షొజాలను తాకుతావు. ఎంత టక్కరివి? అయాని యెమ్మల (విలాసవంతుడవైన) శ్రీవేంకటేశ్వరుడవై మమ్మల్నింతమందిని కూడియున్నావు. అందుచేత నమ్మను అంటూనే...నిన్నేనమ్ముతున్నాను, నమ్ముతాను.

**3-75**

## మున్నుడి

అహోబల నరసింహస్వామి పై అన్నమాచార్యులవారు చెప్పిన కమనీయమైన కీర్తన ఇది. అహోబల అంటే ఔ(ను) భళా! అనే అర్థం. సగం సింహం సగం నరుడు అయిన ఆకారం ఆశ్చర్యం కలిగించక మానదుదు కదా! అత్యద్భుతమైన ఆ సింహాన్ని "ఔభళనారసింహా!" అని కీర్తిస్తున్నారు. సింహాసనంపై నవ్వులొలికిస్తూ కూర్చున్న మోక్షదాత. ఆయన విడిచే ఊపిరి వెదజల్ల బడుతూవుంటుంది. ఆర్తుల అట్టడి (తిప్పలు) నివారించే, ఆఅడి సింహము (వ్యర్థము చేసే నరసింహము) అంటున్నారు.

**చం॥ పరగెను గద్దెపై కనుడు బాగుగ నవ్వెడి సింగ మిద్దిరా**
**సిరులతొ 'ఔభళా నరుడు సింగముతానగు అన్నమయ్యనెన్**
**పరమముయైన సింహమిది బల్లిదుడౌటనెరింగి రందురున్**
**విరివిగ ఆతడే వెలసి వేంకట సింగము ఔను తాననెన్.**

**రాగం :శంకరాభరణం**

పరగీ నిదివో గద్దెపై సింహము వాడె
పరమైన ఔభళ నారసింహము ॥పరగీ॥

తెల్లని మేని సింహము దేవసింహము
మెల్లని చిరునవ్వుల మేటి సింహము
చల్లేటి ఊరుపులతో జయసింహము వాడె
బల్లిదుడై వెలసే ఔభళ నారసింహము ॥పరగీ॥

నిలుచున్న సింహము నిత్యసింహము
అలరు కొండల మీద ఆదిసింహము
వెలుపల కడపపై వీర సింహము
పలుకు పంతముల ఔ భళ నారసింహము ॥పరగీ॥





పుట్టు (ట్ట) జడలసింహము పూర్ణసింహము
అట్టడి ఆర్తుల ఆఅడి సింహము
జట్టిగొన్న దాసులకు శాంతిసింహము
పట్టపు శ్రీవేంకట ఔభళ నారసింహము ॥పరగీ॥

**భావామృతం :**

(ఓ భక్తులారా!) ఇదిగో సింహాసనంపై పరగీ ( ప్రవర్తిల్లుచున్న)సింహము. ఈయన పరమైన (శ్రేష్ఠమైన) ఔ భళ నారసింహము (అహోబల నరసింహుడు. ఈయన శరణము పొందండి).

ఈ సింహము ఎట్లావున్నదో చూశారా? ఈయన తెల్లని శరీరం గల సింహము, దేవదేవుడైన సింహము మెల్లని (సన్నటి) చిరునవ్వులు చిందించేసింహము. అత్యంత శ్రేష్ఠమైన సింహము. విజయము. ఉచ్ఛ్వాస నిశ్వాసలు తీసికొనే సింహము. విజయము స్వంతం చేసికొనిన సింహము. బల్లిదుడు(అతి బలవంతుడైన) సింహము. ఇన్ని సుగుణములున్న ఈయనే ఔ భళనారసింహము. (ఈయన శరణు పొందండి.)

ఈయన విశిష్ఠతను గమనించారా?

ఈయన నిత్యుడై నిలిచియున్నాడు. (ఆది మూలము మరియు అనంతుడు కావున నిత్యుడై నిలిచియున్నాడని ఒక అర్థం) ఈయన కొండల మీద వెలసిన ఆదిదేవుడైన నరసింహుడు. హిరణ్యకశిపుడు ఇంట్లో తన చావు రాకూడదన్నాడు కాబట్టి, ఇంటి వెలుపల కడపపై (గడప మీద )కూర్చొని వాడిని భీకరంగా గోళ్ళతో చీల్చిచంపిన వీరసింహము. అందుకే ఈయన పంతము పలుకుల అహోబల నారసింహుడు. ఆ రాక్షసుడేం కొరితే ఈ 'పలుకునకు' పంతంతో విరుగుడు చేశాడు. ఔ భళ నారసింహుడంటే మరి మాటాలా?

ఇతడు పుట్ట జడల సింహము. (పెద్దపుట్ట వలె కనుపించు జూలు గల నరసింహుడు) ఈయన పూర్ణుడు. (పరిపూర్ణతగలవాడు). ఆర్తుల యొక్క అట్టడి (తిప్పలు లేక బాధలు) నివారించు ఆఅడి సింహము వ్యర్థముచేసే నరసింహము. జట్టిగొన్న (అమ్ముడు బోయిన, లేక దాసోహం అనిన) దాసులకు శాంతిని ప్రసాదించే సింహము. నేడు శ్రీవేంకటాద్రి పై పట్టము గట్టుకొనిన ఔ భళ నారసింహము ఈయనే సుమా!

**3-76**

## మున్నుడి

గీర్వాణ భాషలో అన్నమాచార్యులవారు చెప్పిన మధురమైన కీర్తన ఇది. దేవదేవుడైన శ్రీమన్నారాయణుని పావనమైన గుణగణము లన్నీ భావస్వరూపముగా కలవానిగా కీర్తించి స్వామికి నమస్కరిస్తున్నారు. సూర్యచంద్రులు రెండు కన్నులగా కల ఆ స్వామి అధరం ఎఱ్ఱని సూర్య బింబంలావుందట. శ్రీవేంకటగిరి శిఖరం మీద విహరిస్తుంటాడట ఆ శ్రీనివాసుడు. శ్రీవనితా హృదయాధినాథుడయిన ఆ స్వామి స్తుతి హంసధ్వని రాగంలోవున్నది.

**ఆ.వె॥పావన గుణములవి భావస్వరూపంబు**
**దాల్చినట్టి దేవ! దండములివె**
**అమర కీర్తనంబు అన్నమయ్యది విని**
**వేంకటగిరి నాథు వేడరేల?**

**రాగం : హంసధ్వని**

దేవ నమో దేవ
పావన గుణగణభావా ॥దేవనమో॥

జగదాకారా చతుర్భుజా
గగన నీలమేఘశ్యామా
నిగమ పాదయుగ నీరజనాభ
అగణిత లావణ్యానన ॥దేవనమో॥

ఘనవేదాంతైర్గణన వుదార
కనక శంఖ చక్ర కరాంక
దినమణి శశాంక దివ్యవిలోచన
అనుపమ రవి బింబాధరా ॥దేవనమో॥





భావజ కంజభవ జనక
శ్రీవనితా హృదయేశ
శ్రీవేంకటగిరి శిఖర విహార
పావన గుణగణ భావా ॥దేవనమో॥

**భావామృతం :**

ఓ శ్రీవేంకటేశ్వరా! దేవా! నీకు నమస్కారములు. ఓ దేవా! పుణ్యప్రదమైన గుణగణములన్నీ భావస్వరూపముగా కలమహానుభావా! నీకు వందనములు.

నీవు జగత్తే ఆకారముగా గలవాడవు. నిన్ను సాకారుడిగా భావించువారికి నాలుగు భుజములు గల నీల గగనఘనశ్యాముడవు. వేదములే పాదములై నీకు ఆధారమైనవి. పద్మము నాభియందుగల పద్మనాభుడవు. నీ పదనము యొక్క లావణ్యము గణించుటకు అసాధ్యమైయున్నది. అట్టి నీకు అనేక వందనములు.

ఓ తిరుమలనాథా! నీవు ఘనులైన వేదాంతుల చేత మాత్రమే ప్రతిపాదింప దగినవాడవు. బంగారు శంఖ చక్రములను కరయుగళమునందుగల దివ్యరూపుడవు. సూర్యచంద్రులు నీకు దివ్య నేత్రములై దీప్తించుచున్నారు. ఎఱ్ఱని సూర్యబింబము వంటడి నీ అధరమును వేరొక దానితోపోల్చుటకు అలవికాకున్నది. అట్టి నీ దివ్య రూపమునకు వందనములు.

ఓ దేవదేవా! నీవు భావమునుంచి జనించు మన్మధునికి పద్మమునుంచి పుట్టిన బ్రహ్మదేవునికి తండ్రివి. శ్రీలక్ష్మీ హృదయాధినాథుడవు. శ్రీవేంకటాద్రి శిఖరముపై విహరించు మహనీయుడవు. పుణ్యప్రదమైన గుణగణములన్నీ భావస్వరూపముగా కల సర్వేశ్వరుడవు. అట్టి నీకు వందనములు.

**3-77**

## మున్నుడి

అన్నమాచార్యులవారు శ్రీవేంకటేశ్వరునే సూటిగా అడుగుతున్నారు. తాము నీరుపోసి పెంచిన చెట్టుని సరిగా పెరగలేదని ఎవరన్నా పీకి పారేస్తారా? నేను మంచివాడిని కాను, నిజమే. కానీ నేను నీ బిడ్డనయ్యా! నన్ను నీవు క్షమించకపోతే ఇంకెవరు క్షమిస్తారు? నీవే నానేరాలన్నింటినీ లెక్కించి శిక్షిస్తానంటే సమస్త సృష్టికి యేలికవు నిన్ను కాదని నన్నెవరు రక్షిస్తారు? మా మొరలు వేల సంఖ్యను మించిపోయాయి వాటిని నీవు విచారించక పోతే ఇంకా ఎవరు పట్టించుకుంటారు? రావయ్యా తండ్రీ! నన్ను రక్షించు అంటున్నారు.

**ఉ॥ పెంచినచెట్టునెవ్వడును పీకడు ఆవలపారవేయగా**
**మంచి నరుండుగాడనుచు మన్నన వీడకు వేంకటేశ్వరా!**
**యెంచకు నాదు నేరములు యేలిక నీవు సమస్త సృష్టికిన్**
**మించినమామొరల్‌వినుము మేలునను జేయుముఅన్నమయ్యనెన్.**

**రాగం : వరాళి**

పెంచి తమ పెట్టు జెట్టు-పెరికివేయరెవ్వరు
మంచివాడగాకున్న- మన్నించకుండేవా ॥పెంచి॥

తెరవు దప్పియడవి-దిరిగేటివారి దెచ్చి
తెరువున బెట్టెదురు-తెలిసిన వారలు
నరుడనై నేరక-నడిచేటి నన్ను నీవు
మరిగించి కావక- మానవచ్చునా ॥పెంచి॥

దిక్కుమాలినట్టి వారి-దెచ్చిదయగలవారు
దిక్కయి కాతురు వారి-దిగదోయరు
తక్కక మాయలోబడి-దరిదాపులేని నన్ను
వెక్కసాన రక్షించక-విడిచేవా నీవు ॥పెంచి॥





ఆవల భయపడ్డవా-రంగడి బడితే దొర
లో వ(వు?)ల విచారించి- వూరడింతు రంతలోనే
శ్రీవేంకటేశ నీవు-సృష్టికల్లా నేలికవు
వేవేలు మామొర నీవు- విచారించకుండేవా ॥పెంచి॥

**భావామృతం :**

తామే స్వయంగా నాటి,నీరు బోసి పెంచిన చెట్టుని (దారికడ్డమొస్తున్నదని) ఎవరన్నా పీకి అవతలపారవేస్తారా? నేను మంచి వాడను కాను. (ఆ మాట నిజమే. కానీ నేను నీ బిడ్డను). అందుకని నన్ను నీవు మన్నించవా? (మరి నన్నెవరు రక్షిస్తారు?)

అడవిలో ప్రయాణించే వారు దారి తప్పటం సహజం వాడిదారిన వాడు పోతాడులే అని దారితెలిసిన వారు వాడిని వదలివేస్తారా? నేను నరుడను. కామక్రోధముల వంటి వాటిచే పీడితుడను. తెలియక తప్పుదారిలో పోతున్నాను అటువంటి నన్ను ఇంకా వాటికి నన్ను మరిగించి (అలవాటు చేసి) రక్షించకుండా వుండవచ్చునా? ఇది నీకు న్యాయమేనా?

దయగలిగిన వారు దిక్కులేని అనాధలను తెచ్చి వారికి తామే దిక్కయి రక్షిస్తారు. వాళ్ళని దయలేక దిగదోయరు (విడనాడరు) తక్కక (విడువక) మాయలో బడి, దశ దిశలేని నన్ను మిక్కిలి దయామయుడవై రక్షించక, పోతేపోయాడులే అని నన్ను విసర్జించవచ్చునా? ఇది నీకు తగిన పనియేనా తండ్రీ!

ఎవరన్నా భయపడిన వాళ్ళు అంగడిబడి (తమ కొలువుకు) వచ్చి ఆశ్రయిస్తే దొరలయిన వారు వాళ్ళభయం పోగొట్టి, ఓవల (ఉచితరీతిని) రక్షిస్తారు కానీ వదలివేస్తారా? ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు సృష్టి కర్తవు, సృష్టి భర్తవు. అనంతుడవు. అనంతములైన మా మొరలను విని ఈ సంసారపీడితులమైన మమ్ము రక్షించాలి గాని మాగతి విచారించకుండా విడిచి పుచ్చవచ్చునా? వద్దు తండ్రీ! మమ్మల్ని విడిచిపెట్టకు.

## 3-78

## మున్నుడి

శ్రీ వేంకటేశ్వరునికి నిత్యకళ్యాణ సంప్రదాయాన్ని అన్నమాచార్యులవారే ప్రారంభించరని పెద్దలంటారు. మనం చేసికొన్న పుణ్యమేమో నేడు ఆ నిత్య కళ్యాణవైభవాన్ని కళ్ళారాచూస్తున్నాం మనం. ఒకానొక కళ్యాణ సందర్భంలో అన్నమయ్య ఆ కళ్యాణంలో వివిధ పుష్పాలతో అమ్మవారు అయ్యవారు పుష్పతలంబ్రాలు (సేసలు) చల్లు కొంటుంటే ఆ పుష్పాలు వారిపై పడ్డాక ఎలా అగుపిస్తున్నాయో సరసంగా భావించారు. ఎంత అద్భుతమైన భావనంటే... కళ్ళు మూసుకొని మీరు తిరుమలలో చేరండి...ఎన్ని పుష్పాలో! అవెట్లావున్నాయంటే ...ఆ అందములు 'అదన'య్యాయుట అంటే...సమయానికి తగ్గట్లు మారిపోయాయట...అంటే....

**కం॥ "కందువ మీ కళ్యాణపు**
**అందంబుల్ ఆయెనదను" అన్నయనెరా**
**ఇందీవరాక్షు గొలిచెను**
**సుందరమగు కీర్తనంపు సొంపును గనుడీ**

**రాగం : దేశ్**

కందువ మీ నిచ్చ కళ్యాణమునకు
అందములాయను అదననివి ॥కందువ॥

కలువల సేసలు కలికికి నీకును
సొలవక చూచేటి చూపులివి
చిలుకుల మొల్లల సేసలు మీలో
నలుగడ ముసిముసి నవ్వులివి ॥కందువ॥

తామరసేసలు తలకొనె మీకును
మోము మోమొరయు ముద్దులివి
సేమంతి సేసలు చెలియకు నీకును
చేమరి గోళ్ళ చెనకులివి ॥కందువ॥





సంపెంగ సేసలు సమరతి మీకును
ముంపుల వూర్పుల మూకలివి
యింపుల శ్రీవేంకటేశ చెలి కలసి
సంపద తేలితి చనవులివి ॥కందువ॥

**భావామృతం :**

తండ్రీ! శ్రీ వేంకటేశ్వరా! మీ నిత్యకళ్యాణ వైభవం యొక్క అందాలు అన్నీ అదనయ్యాయి (క్షణ క్షణానికి సమయానికి తగ్గట్లు మారి పోతున్నాయి.) వాటి వివరాలు విను స్వామీ!

అతివేగంగా సేసలు (తలంబ్రాలు) పోసుకొని అలసిపోయి మీరు ఒకరినొకరు చూచుకొంటున్నారు. మీరు పోసుకొంటున్న 'కలువపూల సేసలు' అదిగో నీవూ అమ్మవారు చూసుకునే చూపుల్లావున్నాయి. నలుదిక్కుల ప్రసరించుచున్న మీ ముసిముసి నువ్వుల కాంతులలే'చిలుకలు మొల్లల సేసలు (చల్లుకొనుచును) మొల్ల పుష్పముల తలంబ్రాలు)

మీ ఒరయుమోములు (ఒరిపిడినొందిన వదనములు) ముఖపద్మములై నందున చుంబనములచే ఎర్రబడి తామరపూవులై మీరు చల్లుకొనుచున్న తామరపూల సేసల వలెనున్నవి. మీ చేమిరి గోళ్ళు చెనకులు'(మీ మీ వాడి గోళ్ళు గీట్లు) నీ చెలికీనీక్తూ చామంతి పూల రేకులు విడిపోయి ఒంటిపై విస్తరించి, ఆ నఖ క్షతములే ఈ చామంతి రేకులా అన్నట్లున్నవి. (చేమిరి, అంటే, కాగిన పాలు తోడుపెట్టేటప్పుడు మజ్జిగ చుక్కలు మొనగోటితో వేయటం)

మీ సమరతి కూటమిలో ముంచుకొని వస్తున్న మీ నిట్టూర్పులెలావున్నాయంటే ఇప్పుడు మీరు చల్లుకొంటున్న సంపెంగపూల సేసలే ఆ వూర్పులా అన్నట్లున్నాయి. అవే ఇవి, ఇవే అవి అనిపించుట చేత ఎంతో ఇంపుగానున్నవి. ప్రభూ! తిరుమల నాయకా! నీవు నీ చెలితో కూడి ఐశ్వర్యములలో తేలుతున్నావు. మీ అనురాగములే మీ వైభోగములై అలరారుచున్నవి.

**3-79**

## మున్నుడి

జాజర అంటే వంచన అని అర్థం. ప్రేయసీ ప్రియులు, బావామరదళ్లు సరసంగా ఒకరిపై ఒకరు రంగులు, వసంతం పూల పుప్పొడి చల్లుకొని నృత్య గానాలతో పరవశించే వేడుకని జాజర అని పిలుస్తారు జానపదులు. శృంగార పురుషుడైన శ్రీవేంకటేశుని వలచి వేదనకు గురైన ఒక భామిని, ఇక నీ జాజర చాలు స్వామీ! ఈ జాజర 'జావి బరచెను' నన్ను అంటోంది. 'జాలి బరచెను' అంటే అసలు అర్థం... మనఃఖేదము అప్పుగా ఇస్తున్నదని అంటే నీ జాజర చివరకు నాకు దుఃఖాన్నే మిగులుస్తుందని. అన్నమాచార్యులవారేవొక భామిని అయి, ఈ విధంగా భావిస్తున్నారు.

**ఆ.వె॥'జాలిబరచు' నీదు జాజర చాలురా**<br>
**వలపు వేదనలకు వాడిపోతి**<br>
**తివిరి వేంకటేశు 'కవుగిటి' కబ్బితి**<br>
**అన్నమయ్య పాట అద్భుతమురా**

**రాగం : ముఖారి**

చాలు చాలునీ జాజర నన్ను<br>
జాలి బరచె నీ జాజర ॥చాలు చాలు॥

వలపు వేదనల వాడేను యీ-<br>
తలనొప్పులచే దలకేను<br>
పులకల మేనితో బొరలేను కదు-<br>
జలిగొని చల్లకు జాజర ॥చాలు చాలు॥

బల్లని నినుగని వుడికేను నీ-<br>
చిల్లర చేతల జిమిడేను<br>
కల్ల గందవొడి గాగేను<br>
జల్లకు చల్లకు జాజర ॥చాలు చాలు॥





తివిరి వేంకటాధిప నేను నీ-<br>
కవుగిటి కబ్బితి గడు నేను<br>
రవ రవ చెమట గరగి నేడుయిదె<br>
చవులాయను నీ జాజర ॥చాలు చాలు॥

**భావామృతం :**

ఓ శ్రీవేంకటేశ్వరా! నీ ఈ వలపు జాజర ఇక చాలుచాలు. అది చివరికి నాకు మనఃఖేదమునే ఎరవుగా నిస్తుంది. (అప్పు ఇస్తుంది) అటువంటప్పుడు నాకెందుకీ తలనొప్పి).

(అయినా నాకు బుద్ధిలేదు). నీ వలపు నాకు కలిగించే పరితాపంలో వాడిపోతూనే వుంటాను. ఆ తలనొప్పితో తలకేను (చలించిపోతూనే వుంటాను)

నా శరీరం పులకరింతలతో పొరలుతూనే వుంటాను ఈవిధంగా 'జలిగొని' (అతిశయించి) నాపై నీవు జాజర చల్లవద్దు స్వామీ! (నేను తట్టుకోలేను).

స్వామీ! బల్లని (బలవంతుడవైన) నిను గని వుడికెను. (ఉక్రోషంతో వుడికిపోతాను). ఇకనీ చిల్లర వేషాలకి చిమిడేను (జావగారి పోతాను). నీ అబద్ధాలతో కందువడి (తపించిపోయాను) పోయాను, కాగిపోయాను. ఇక చాలు చాలు. నాపై నీ జాజర చల్లవద్దు. (నన్నింకా మోసం చేయవద్దు).తివిరిఇక్కడ 'తివిరి' అంటే కుతూహలముతో అనే భావంతో అన్నమయ్య ఈ పదం వాడారు. ఓ శ్రీవేంకటేశ్వరా! నేను చివరికి (దొరికి పోయాను). నీ పెనగులాటలో పట్టిన చెమటలో ఈరోజు కరగిపోయాను. అందుకని, ఇదివరకు నన్నెంత ఏడిపించినా నీ జాజర చాలా ఆసక్తికరంగానే వున్నది ప్రభూ!

**3-80**

## మున్నుడి

ఆత్మకు, దేహం తోడులేకపోతే శ్రీహరిని చేరే మార్గమే లేదు. కానీ దేహాన్ని ధరించగానే ఈ ఆత్మను 'హరిమాయ' ఆక్రమించి రుచుల మీద, కోరికల మీద, సుఖముల మీద ధ్యాస పోతుంది. అవి తీరక క్రోధం కలుగుతుంది. ఈలోగా కాలం 'టిక్‌టిక్' మని గడిచి పోతూనే వుంటుంది. ఇక సరే నిద్ర తమోగుణ నిలయమే. కానీ మూడవవంతు జీవితం దానికోసమే వెచ్చిస్తున్నాము, కదా! మరి ఇవన్నీ సత్యరూపుడైన ఆత్మకు రోత కలిగించే విషయములే. కర్మల ఫలంగా జన్మలు తప్పటంలేదు. ఇదంతా ఒక 'లంపటం' అయింది ఆత్మకు. దిక్కెవరు? అంటున్నారు అన్నమాచార్యులవారు.

**చం॥ హరిశరణాగతొక్కటియె ఆయన చెంతకు జేర్చు 'ఆతుమమని'**
**అరయగ ఇంద్రియములాత్మను దూరము చేయుతోడవన్**
**మురియగ జేయు భోగములు ముద్దుల భామలు అన్నమయ్యనెన్**
**తిరుమలనాథు సత్కృపయె దీటు ప్రమాణము ఆత్మనెంచగన్**

**రాగం : కళ్యాణి**

హరిశరణాగతి యాతుమది
సరుస నిదియ పో సతుమయ్యోడిది ॥హరి॥

దినదిన రుచులివి దేహమువి
చెనకేటి కోరిక చిత్తముది
యెనసేటి కాంతలు యింద్రియంబులవి
పనివి యాత్మకివి పనిలేదయ్యా ॥హరి॥

పదలే(రే)టి కోపము పాపముది
అదన కాలములు అనాదివి
నిదుర తమోగుణ నిలయముది
యెదుట నాత్మకివి యెరవెరవయ్యా ॥హరి॥





కాయపు జననము కర్మముది
మాయ లంపటము మమతలది
యేయెడ శ్రీవేంకటేశుడితని కృప
పాయని యాత్మకు ప్రయాణమయ్యా ॥హరి॥

## భావామృతం

శ్రీహరిని 'శరణు' అనుటయే ఆత్మను ఆయన సరుసకు (సమీపమునకు) చేర్చుటయగును. ఇదియే పో గొప్ప సత్యము. ఓ తిరుమలయ్యా! ఇది చిత్తగించుము.

ప్రతిదినము అనేక రుచులను కాంక్షించునది దేహము (ఆత్మ కాదు సుమా!). ఆకర్షణకు లోబరచి కోరికలను కలిగించేది చిత్తము (ఆత్మకాదు). కాంతల వంటివి ఇంద్రియములు (వాటిగోల వాటిదే కాని నీ మంచి చెడ్డలు ఆలోచించవు). 'పనివి ఆత్మకు' (నియోగించబడిన ఆత్మకు ఈ దేహాదులతో పనిలేదయ్యా! స్వామీ!

తొందర పాటు కలిగించు ఆగ్రహము (పదలేటి కోపము) గొప్ప పాపము. ఇకపోతే కాలమునకు ఆది అనునదియే లేదు. మనిషి నిదురించే కాలమంతా నిరుపయోగమైన తమోగుణ ప్రధానమైనది. దానివల్ల నష్టమే కాని లాభంలేదు. ప్రత్యక్షముగానున్న ఆత్మకు ఇది యెరవెరవయ్యా! (రోత కలిగించు విషయము) అందువలన యేమో, ఆత్మ ప్రత్యక్షముగా తోచదు.

ఆత్మ శరీరం ధరించి జన్మించుటకు కారణమెవరు? పూర్వజన్మలలో అది చేసికొన్న కర్మ మాత్రమే. ఇకపోతే మమత వలన మాయదారి లంపటాలు (తగులములు) కలుగుతున్నాయి. ఎక్కడెక్కడైనా ఆ శ్రీవేంకటేశ్వరుని కృప ఈ ఆత్మకు విడువని ప్రమాణము, అనగా ఆ స్వామి కరుణ సత్యమైన సాక్ష్యము.

## 3-81

## మున్నుడి

తండ్రి అన్నమయ్య బాటలో నడిచి, అనేక అద్భుత కీర్తనలు శ్రీవేంకటేశ్వరునిపై చెప్పిన పెదతిరుమలయ్య అహోబల నృసింహుని (ఔ భళ నరసింహుని) శ్రీవేంకటేశ్వరునిగా భావించి చెప్పిన అమృత వాహిని ఇది. భయంకరంగా హిరణ్యకశిపుని చీల్చి చంపినెత్తురు తాగిన వాడు కూడా, ప్రహ్లాదుని భక్తికి, శ్రీసతి సౌందర్యానికి లొంగిపోయి భక్తునికి వరాలు, నళినాక్షికి వలపు ఇచ్చాడు. పనిలో పనిగా అనాధలకూ నాధుడై జగన్నాధుడై సిరిసంపదలే కాక అర్థులకి అల్లదిగో వైకుంఠం కూడా ఇచ్చాడు.

**ఆ.వె॥ ఔను జాణడవుర ఔ భళ నరసింహ**
**ఆనలిట్లు వెట్టకనెను పెద్ద-**
**తిరుమలయ్య కొలిచె తిరుమలేశుగ నెంచి**
**తండ్రి బాట నడుచు తనయుడతడె.**

**రాగం : తిలంగ్**

ఔనయ్యా జాణడవు ప్రహ్లాద వరద
ఆనలు వెట్టకుము ప్రహ్లాద వరద ॥ఔనయ్యా॥

వేసరక శ్రీసతితో వేడుక నవ్వులు నవ్వీ
ఆసలు చూపేవు ప్రహ్లాద వరద
సేస వెట్టిన చేతుల చెరగువట్టి తీసేవు
ఆ సుద్దులు చెప్పేను ప్రహ్లాద వరద ॥ఔనయ్యా॥

నంటున తొడమీదను నలినాక్షినెక్కించుక
అంటేవు సిగ్గులు ప్రహ్లాదవరద
గెంటక ఏ పొద్దును కేలు కేలు కీలించుక
అంటువాయ వదివో ప్రహ్లాద వరద ॥ఔనయ్యా॥





కందువతో కొగిలించి కైవసము సేసుకొంటి
వందముగ నీకెను ప్రహ్లాద వరద
పొంది శ్రీవేంకటమున పొంచి ఔభళములోన
అంది వరాలిచ్చేవు ప్రహ్లాద వరద ॥ఔనయ్యా॥

**భావామృతం**

ఓ ప్రహ్లాద వరదా! అహోబల నృసింహా! ఔనయ్యా! నీవు జాణతనంగలవాడవే. మాకు ఆనలు (నిర్బంధము కలిగించు షరతులు) పెట్టవద్దు తండ్రీ! (నీవు పెడితే మేం తట్టుకోలేము, మేము పెడితే నీవు అవలీలగా దాటివేస్తావు).

వేసరక (సునాయాసంగా) శ్రీలక్ష్మీతో విలాసముగా నవ్వులొలక బోస్తున్నావు. ఆమెకు ఆస (అపేక్ష) చూపుచున్నావు. ప్రహ్లాదుని దీవించావు. సేసవెట్టిన (అక్షతలు చల్లన) ఆ చేతులతోనే నిర్బంధించి హిరణ్యకశిపుని ప్రాణలు తీసేవు. ఓ ప్రహ్లాద వరదా! నేను ఆ సుద్దులు చేప్పును (ఆ కథలను వివరిస్తాను.

ఓ ప్రహ్లాద వరదా! పద్మనేత్రియైన శ్రీలలనను నంటున (స్నేహముతో) నీతొడపై కూర్చుండబెట్టుకొని ఆమె సిగ్గులను (లజ్జను) స్పృశించెదవు. ఏ సమయముననైనా ఆమెను గెంటక (నెట్టివేయక), కేలుకేలుకీలించి (చేయి చేయి తగలించి), అంటువాయవు (విడనాడవు)

కందువతో (సామర్థ్యముతో) అందముగ ఈకెను (ఆమెను) కౌగలించి నీ వశము చేసికొంటివి. శ్రీవేంకటగిరిపై ఈమెనా విధముగా పొంది, ఇక్కడ ఈ ఔభళములో (అహోబలంలో) అంతులేని వరములను అనుగ్రహించుచున్నావు.

**3-82**

## మున్నుడి

అన్నమాచార్యులవారి తత్త్వ బోధాత్మకమైన చక్కటి సంకీర్తన ఇది.స్వచ్ఛతకు, పవిత్రతకు, సత్త్వగుణానికి హంసను ఒక గుర్తుగా చెబుతారు. అటువంటి గుణములున్న గొప్పయోగులను పరమహంస అని కూడా అంటారు. అన్నమయ్య యోగులకే పరమయోగియైన గీతాచార్యుని, పరమాత్మస్వరూపుని హంసతో పోల్చి, జీవుల పాపపుణ్యములనే నీటినీ పాలనీ వేరుచేసి పాలు (పుణ్యం) మాత్రమే గ్రహించి పాపము అనే నీటిని వదలివేస్తాడు అంటున్నారు. అది ఆయన 'వాసుదేవా' తత్త్వం. ఎంత చెప్పినా దీని వివరణ ఆమూలాగ్రం చెప్పటం అసాధ్యం. ఉదాహరణకి ఈ పద్యమే.... తలకెక్కదు. భావామృతం చదివిప్రయత్నించండి.....

**కం॥ ఉబ్బుజలంబులదేలెను**
**అబ్బురముగ నొక్కహంస అన్నయ్యనెరా**
**దిబ్బలు వెట్టుచు తిరిగెను**
**అబ్బో! తలమునకలైతి నర్థము తెలుపన్.**

**రాగం : ఖరహరప్రియ**

దిబ్బలు వెట్టుచు దేలిన దిదివో
ఉబ్బు నీటిపై నొక హంస ॥దిబ్బలు॥

అనువున కమల విహారమె నెలవై
ఒనరియున్నదిదె ఒక హంస
మనియెడి జీవుల మానవ సరసుల
వునికి నున్నదిదె ఒక హంస ॥దిబ్బలు॥

పాలు నీరు వేర్పఱచి పాలలో
నోల లాడెనిదె వొక హంస
పాలుపడిన యీ పరమ హంసముల
ఓలి నున్న దిదె వొక హంస ॥దిబ్బలు॥





తడవి రోమ రంధ్రంబుల గ్రుడ్లను
ఉడుగక పొదిగీ నొక హంస
కడువేడుక వేంకటగిరి మీదట
వొడలు పెంచె నిదో వొక హంస ॥దిబ్బలు॥

## భావామృతం

ఒక హంస ఉబ్బునీటిపై (సముద్రము మీద) దిబ్బలు వెట్టుచున్ తేలినది (అది ఒక ఉన్నతమైన భూ భాగమా అనునట్లు తేలి యాడినది).

(అనగా ఆ హంసకు సముద్రమనిన వెఱపులేదు. చెడును మంచినుంచి వేరు చేసి, జీవుల మంచిని మాత్రమే గ్రహించి చెడును వారి 'కర్మ'కే వదలి వేసే పరమహంస ఇది). దాని తత్త్వాన్ని వినండి.

అది ఒకానొక హంస. అది అనవున (సౌకర్యముగా) కమల విహారము (పద్మముల మధ్య విహరించుట) నెలవై (దాని స్థానమై) ఒనరియున్నది (ఒప్పుచున్నది). హంసగా అది దాని ప్రవృత్తి. పరమహంసగా అనగా శ్రీమన్నారాయణునిగా దాని కమల విహారము, కమల (లక్ష్మీదేవి) మానసమందు విహరించుటయే. జీవుల మానస సరోవరములందు మనియెడి (వుండే అలవాటుగల) ఆ హంసవునికి ఇదియే. అనగా పరమహంసయైన ఆ పరమాత్మకు ఆశ్రయం జీవుల 'మానస' సరోవరములే.

హంసయెలాగైతే పాలనుండి నీటిని విడదీసి స్వచ్ఛమైన పాలను మాత్రమే గ్రహిస్తుందో, ఈ పరమహంస పాప పుణ్యములు కలిసియున్న జీవుల కర్మలలోనుంచి వారి పుణ్యమనే పాలను విడదీసి పాపమనే నీటిని వదలివేస్తాడు. అది పురాకృత కర్మగా వారు అనుభవించాక స్వచ్ఛమైన ఆ జీవాత్మయే పరమాత్మలో ఐక్యమై వాసుదేవ సిద్ధి పొందుతుంది. అట్లు ఒకహంస, పాలుపడిన పరమహంసల (తననాశ్రయించిన పరమయోగుల) ఓలి నున్నది (వరుసలో నున్నది). అనగా పరమాత్మ పరమయోగులందరి దగ్గరగా వుంటాడని అర్థం.

ఒక హంస, తడవి (అనురాగముతో స్పృశించుచూ) రోమరంధ్రములలో ఒక్కొక్క బ్రహ్మాండం చొప్పున అసంఖ్యాకమైన గ్రుడ్లను పొదుగుచున్నాడు. అవి మళ్ళీ జీవుల నిలయాలై వర్ధిల్లుతున్నాయి. ఇది అనంతం. నేడు మనందరికోసం, ఒక హంస మిక్కిలి వేడుకతో వేంకటాద్రిపై వొడలు పెంచుకొనినది. (రెక్కలను విస్తరింప చేసి హంస యెలా తన 'కూన'లను రక్షిస్తుందో, అట్లు వ్యాపించి కూనలమైన మనని రక్షిస్తోంది. ఆ హంసయే శ్రీవేంకటేశ్వరుడు.

**3-83**

## మున్నుడి

గీతాచార్యుడైన శ్రీకృష్ణపరమాత్మ యజ్ఞమునందు యజ్ఞమూర్తి (యజ్ఞరూపుడు), యజ్ఞ భోక్త (స్వీకరించువాడు), యజ్ఞకర్త (నిర్వహించేవాడు), యజ్ఞఫలప్రదాత అన్నీతానే నన్నాడు. అన్నమయ్య అదే పునరుద్ఘాటిస్తున్నారు ఈ కీర్తనలో. జీవులలో ప్రాణం రూపంలో వున్నవాడే మన పూజలన్నీ స్వీకరిస్తున్నాడు.ఆయన పాదములనుండి పుట్టిన గంగవలననే జీవుల దాహం తీరుతున్నది. ఆయన నెలకొల్పిన పుణ్యతీర్థాల వలననే అనుక్షణం పాపాలు చేసే జీవులు నరకం తప్పించుకొంటున్నారు. వేదములను రక్షించి తిరిగి మానవుల కిచ్చిన ఆయన నివేదమంత్రాలతో పూజించటం మన కనీస ధర్మం కదా! నేడు ఆయనే శ్రీవేంకటేశ్వరుడైతే.. ఇంకా ఆలోచన దేనికి?

**ఉ॥ యజ్ఞపు కర్తవయ్య హరి! యజ్ఞపు భోక్తవు యెంచి చూడగా**
**యజ్ఞపు మూర్తివీవనుచు అన్నయపాడెను కీర్తనంబు, ఆ**
**యజ్ఞ ఫలంబు రూపయిన ఆతడు వేంకటనాథుడంచనెన్**
**విజ్ఞత వేదమంత్రముల విష్ణుని గొల్చెదరెల్లరీభువిన్**

**రాగం : ఖమాస్**

యజ్ఞమూర్తి యజ్ఞకర్త యజ్ఞభోక్త విన్నిటాను
యజ్ఞాది ఫలరూప మిటు నీవై వుండవే ॥యజ్ఞ॥

పరికించ జీవులకు ప్రాణమలైన నీకు
నిరతి ప్రాణ ప్రతిష్ఠ నేము సేసేమా
మరిగి మా పూజలంది మమ్ము గాచెడి కొరకు
హరినీ మూర్తి ప్రాణమావహించవే ॥యజ్ఞ॥

జగతికి నీ పాద జలమే సంప్రోక్షణ
జిగినీకు సంప్రోక్షణ సేయువారమా
పగటున నన్ను నేడు పావనము సేయుటకు
అగు పుణ్యతీర్థముల అభిషేక మందవే ॥యజ్ఞ॥





వేదములు తెచ్చిన శ్రీవేంకటేశ నేము నీకు
వేద మంత్రముల పూజావిధి సేసేమా
యీ దెస నీ దాసులమైన మమ్ముగాచుట కొరకు
వేదమూర్తివై యిందే విచ్చేసి ఉండవే ॥యజ్ఞ॥

**భావామృతం**

స్వామీ! యజ్ఞమూర్తివి, యజ్ఞ భోక్తవు, యజ్ఞకర్తవు, ఆ యజ్ఞఫలప్రదాతవు కూడా నీవే. ఇవన్నీ నీవై వుండగా ఇంకా భగవంతుడవు నీవు కాక మరెవ్వరు?

మేమెంత బుద్ధిహీనులమయ్యా!! పరికించి చూస్తే జీవులన్నిటిలోనూ ప్రాణం రూపంలో వున్నదెవ్వరు? నీవే. అట్టి నీకు ఏము(మేము) నిరతితో (అత్యంతాసక్తితో) ప్రాణ ప్రతిష్ఠ చేసి పూజిస్తున్నాము. నీకు ప్రాణమివ్వటానికి మేమెవ్వరం తండ్రీ! అయినా మమ్మల్ని క్షమించి మా పూజల్ని స్వీకరించటానికి మమ్మల్ని రక్షించటానికి ఈ మూర్తి రూపాల్లో ప్రాణ రూపంలో ఆవహించివుండు ప్రభూ!

ఈ సమస్త సృష్టికీ నీపాద జలమైన గంగానది, దాహం తీరుస్తున్నది. దాన్ని సంప్రోక్షించుకొని (నెత్తిపై చల్లుకొని) మేము పాపవిముక్తులమవుత్నూము. కాని మేము జిగితో (గొప్పగా) నీకు సంప్రోక్షణచేసి పూజిస్తున్నాము. ఇది ఎంత అవివేకమైన పని? అయినా నేడు నన్ను సగటున (బాహాటముగా) పాప విముక్తుని చేయుటకు అన్ని పుణ్యతీర్థములలోనూ నాచేత అభిషేకములను స్వీకరించి నన్ను అనుగ్రహించు. నీ అంతటివాడిని అభిషేకించాననే తృప్తి నాకు కలిగించు. శ్రీవేంకటేశ్వరా! వేదములను తెచ్చిన (సోమకాసురుని మత్స్యావతారంలో సంహరించి తెచ్చినవాడు శ్రీహరి). అట్టి నీకు, ఏము (మేము), (నేము అనే పాఠంలో వున్నది. నేము అంటే ధాన్యం చెరుగుట అని అర్థం) వేదమంత్రాలు వల్లిస్తూ పూజచేస్తున్నాం. సరే మా అజ్ఞానమాది. అయినా ఓ మహానుభావా! ఈ చోట మమ్మురక్షించుటకు నీ దాసులమైన మమ్ము కరుణించి ఈ మూర్తిలోనికి వేదమూర్తివై వచ్చి ఇందులోనే నెలకొని మమ్ము ధన్యులను చేయుము తండ్రీ!

## 3-84

## మున్నుడి

అన్నమాచార్యులవారు చక్కటి సందేశం ఇస్తున్నారు ఈ కీర్తనలో. భూమిమీద యెన్ని తపస్సులు చేసినా హరిని కీర్తించిన వాడు మాత్రమే పూజ్యుడు. పండినదే విత్తనం , రాజు మెచ్చినదే పట్టపురాణి, యజమాని మెచ్చిన వాడే మేలైన బంటు. దానంచేసిందే అక్కరకొచ్చే ధనం. ధర్మవర్తనుడే నిజమైన కొడుకు. శ్రీవేంకటేశ్వరుని సన్నుతించేదే వున్నతమైన చదువు. ఈ కీర్తనలో అన్నమయ్య చేసినాను, జల్లినాను, కొలిచినాను, కలిగినాను – వంటి ఉత్తమ పురుష ఏకవచన ప్రయోగాలు చేశారు. అవి అట్లు భ్రాంతి కలిగిస్తాయి. కానీ 'చేసినను', జల్లినను – అనే అర్థం చేసికొనవలెను.

**చం॥ ధరణి మరెందరో మునులు తాపములెన్ని యొనర్చి వేగినన్**
**హరికృప గాంచువాడె తగనన్నిట బూజ్యుడు అన్నమయ్యనెన్**
**సిరియది యెంత గల్గినను చేయక దానము సాయమీయునా?**
**తిరుమలనాధు గొల్వనిదె దేనికి ఆ చదువంత కాల్వనా?**

**రాగం : దేసాళం**

ధరణినెందరెన్ని – తపములు చేసినాను
హరికృప గలవాడే – అన్నిటా బూజ్యుడు ॥ధరణి॥

మితిలేని విత్తులెన్ని – మేదినిపై జల్లినాను
తతితో విత్తినవే – తగ బండును
ఇతర కాంతలు మఱి – యెందరు గలిగినాను
పతి మన్నించినదే – పట్టపు దేవులు ॥ధరణి॥

పాలుపడి నరులెన్ని –పాట్లుబడి కొలిచినా
నేలికి చేపట్టిన వాడే –యెక్కుడు బంటు
మూలనెంత ధనమున్నా – ముంచి దాన ధర్మములు
తాలిమితో నిచ్చినదే – దాపురమై నిల్చును ॥ధరణి॥





ఎన్నికకు గొడుకులు – యెందరు గలిగినాను
ఇన్నిటా ధర్మపరుడే – యీడేరును
ఉన్నతి జదువులెన్ని – వుండినా శ్రీవేంకటేశు
సన్నుతించిన మంత్రమే – సతమై ఫలించును ॥ధరణి॥

**భావామృతం**

ఈ లోకంలో యెందరెన్ని తపస్సులు చేసినప్పటికీ, హరికృప పొందినవాడు మాత్రమే అన్నింటిలోను పూజకు అర్హుడు.

తతితో (అదనుతో) విత్తనాలు భూమిలో నాటకుండా యెన్ని విత్తనాలు చల్లినా లాభమేముంది? బాగుగా దున్నిన నేలలో అదను చల్లిన విత్తనమే మొలకెత్తుతుంది. ఒకరాజు చేరదీసిన స్త్రీలెంత మంది వున్నా అతని మన్నింపు పొందినది మాత్రమే పట్టపు రాణిగా పరిగణించబడి రాజ్యాన్నేలుతుంది.

ఒక ఏలిక (ప్రభువు) వద్ద యెంతమంది భృత్యులు వూడిగం చేస్తున్న వారంతా పాలుపడి, పాట్లుపడి కొలిచినా వ్యర్థమే. ఆయన నమ్మిన బంటు మాత్రమే ముఖ్యమైన అధికారి అవుతాడు. తక్కినవారంతా జీతం తీసికొనే పనివాళ్ళు మాత్రమే. మూలనెంత ధనం వున్నా ( ఆరోజుల్లో ధనవంతులు ఇంట్లో వొక మూల త్రవ్వి, బిందెల్లో నాణెముల రూపంలో వున్న ధనం పోసి, ఒక వస్త్రంతో మూసికట్టి, పాతిపెట్టి దాచి వుంచేవారు. ఒక బిందెకు ఇంకొక బిందెకు 'లంకె' వేసి ఇంకో తాడు కట్టేవాళ్లు. అవి వాళ్లకి ఉపయోగపడక ఆ తరువాత యెవరికో దొరికి వారికి వుపయోగపడేవి. అవే 'లంకెబిందెలు' అనేవారు. అది నిరుపయోగమే. తాలిమితో (శ్రద్ధతో), ముంచి (అతిశయించి) దానధర్మం చేసినది మాత్రమే దాపరమై (ప్రాప్తమై) జన్మాంతరములలో అక్కరకొచ్చును.

ఎన్నికకు (లెక్కించుటకు) ఎంతమంది కొడుకులున్నా వాళ్లు నిరుపయోగులే. ఇన్నిటా (ఇందరిలోనూ) ధర్మవర్తనుడు మాత్రమే ఈడేరుతాడు (తల్లిదండ్రిని, కడతేరుస్తాడు) అహో!! అన్నమాచార్యా! ఆరువందల ఏళ్లక్రిందనే, ఎంత సత్యం చెప్పావయ్యా!) ఉన్నతమైన చదువులు యెన్నివున్నా శ్రీవేంకటేశ్వరుని సన్నుతించె మంత్రం (ఓం నమో వేంకటేశాయ) ఒక్కటే సతమైన (శాశ్వతమైన) ఫలితాన్నిస్తుంది. తక్కినవన్నీ వ్యర్థమైన చదువులే అవి బిరుదులవలె పేరు వెనకాలో ముందరో తగిలించుకోటానికి తప్పించి ఆ స్వామి కరుణ పొందటానికి అస్సలు... ఉపయోగపడవు)

**3-85**

## మున్నుడి

అన్నమాచార్యుల వారి కీర్తనల్లో గూఢార్థం ఒక్కొక్కప్పుడు ఒక పట్టాన అర్థమవదు. ఉదాహరణకి ఈ కీర్తనలో 'అంగపు' నన్నేచూచి అంతరాత్మ గంటి అనే వాక్యం. దేహము ధరించినది ఎవరు? అంతరాత్ముడు. 'నేను' అని అనుకుంటున్నది కూడా వాడే. దేన్ని 'నేను' అనుకుంటున్నాడు? దేహాన్ని. అంటే, అంగములు వున్న నన్ను అంతరాత్ముడు అని గుర్తించాను – అని ఆ వాక్యానికి అర్థం. మనలో శ్రీవేంకటేశ్వరుడే అంతర్యామిగా వున్నాడు. జీవ భావము తొలగిపోయి, మనలోని ఆ స్వామిని గుర్తించగలిగిననాడు ఆయన శ్రీపాదం తప్ప ఇంకేమీ కనిపించవు. ఆ స్థితి చేరగలమా?... ఏమో...

**కం॥ ఇన్నాళ్లునందు నందున**
**ఎన్నగ నేనేమి గంటి? హే శ్రీరమణా!**
**అన్నయ్య కీర్తనము విను,**
**"అన్నిటనే శరణుజొచ్చి హరిగంటి" ననెన్**

**రాగం : కాంభోజి**

ఇన్నాళ్ళు నందు నందు నేమిగంటిని
అన్నిటా శరణుచొచ్చి హరి నిన్నుగంటిని ॥ఇన్నాళ్ళు॥

అంగనల పస జిక్కి అలయికలే కంటి
బంగారు వెంటదగిలి భ్రమ గంటిని
ముంగిటి క్షేత్రాలంటి ముంచి వెట్టిసేయగంటి
అంగపు నన్నేచూచి అంతరాత్మగంటి ॥ఇన్నాళ్ళు॥

చుట్టాలజేరి చూచి సుద్దుల వావులు గంటి
మట్టులేని వయసుతో మదము గంటి
వట్టి కామములు సేసి వరుస మాయలు గంటి
పట్టి నారాయణాయని భక్తి నిన్నుగంటిని ॥ఇన్నాళ్ళు॥





వింత చదువుల వల్ల వేవేలు మతాలు గంటి
సంత కర్మముల వల్ల సాము గంటిని
యింతట శ్రీవేంకటేశ యిటు నా జీవ భావము
చింతించి అందులోన నీ శ్రీపాదాలు గంటి ॥ఇన్నాళ్ళు॥

**భావామృతం :**

ఓ శ్రీవేంకటేశ్వరా! ఇన్నాళ్ళూ, అందునందున్ (అక్కడక్కడా) ఏమేమి కంటిని (చూచితిని)? నీకు శరణు చొచ్చి (శరణని), అన్నింటిలోను హరివైన నిన్నే చూచాను. (ఇందుగలడందు లేడని సందేహము వలదు... అంటే ఏమిటో తెలిసింది).

నా తొలి జీవితంలో, స్త్రీల పస జిక్కి (చాతుర్యానికి లొంగిపోయి) అలయికలే గంటి (శ్రమ మాత్రమే పొందాను). బంగారము వెంట పరుగులు తీసి భ్రమ పడ్డాను. ముంగిటి క్షేత్రాలు (మధ్య ప్రదేశాలలో గల పొలాలు) కోసం ఎంతో, వెట్టి సేయగంటి (చాకిరీ చేశాను). కానీ... నేడు, అంగపు నన్నేచూచి (దేహం ధరించియున్న నన్ను గ్రహించి) నాలోని అంతరాత్ముని చూచాను.

పూర్వం నా బంధువర్గములందరితో కలిసి, సుద్దుల వావులు గంటి (వాయింపులవంటి వారి ఉచిత సలహాలు, మాటలు విన్నాను) వయస్సువల్ల కలిగిన మట్టులేని (అంతులేని) మదమును పొందాను. వ్యర్థమైన కోరికల వలన, వరుసగా అనేక మాయలకు లోనయ్యాను. నేడు అవన్నీ వదిలిపెట్టి నారాయణా అని భక్తితో నీ శరణుచొచ్చి నిన్ను కనుగొన్నాను. ఓ ప్రభూ! వింతగొలిపే అనేక చదువులు (శాస్త్రాలు) వలన ఏవేవో మతాలు చూశాను. సంత కర్మముల వల్ల సాముగంటి (ఏవేవో విధ్యుక్త ధర్మాలు అనుకొని వాటితో అనేక వ్యాయామాలు చేశాను). అంతా.. అయిపోయింది. స్వామీ! ఏడుకొండలవాడా! ఇంతట (ఇప్పుడు), ఇటు నా జీవ భావము (నేను జీవిని అనే భావమును) చింతించి (గ్రహించి) అందులోనే నీ శ్రీపాదములను చూచాను. తండ్రీ! నేను ధన్యుడనయ్యాను.

**3-86**

## మున్నుడి

పవనపుత్రుడైన ఆంజనేయుని అన్నమాచార్యులవారు కపీశ్వరా! శరణు అని కీర్తిస్తున్నారు. సరవి యెంచి చూచిన ఆయన సాటివాడు లేడని అంటున్నారు. పుట్టిన వెంటనే ఆయన సూర్యుణ్ణి పండు అని పట్టుకోబోతే లోకాలు తల్లడిల్లి పోయాయట. మెరయుచున్న సంపదలు కలిగిన సంజీవని పర్వతాన్ని తీసికొని వచ్చిన నీపెంపు సొంపు పేర్కొన సాధ్యమా అన్నారు. ఈ చరణం వ్రాస్తుంటే నేటి మన చలన చిత్రాల్లో సంజీవని పర్వతంపై మెరిసె 'లైట్లు' యెందుకు పెడుతున్నారో అర్థమయింది. ఎవరి భావన వారది మరి!!

**మ॥ శరణంబో కపినాయకా! పవనజా! సామాన్యమా నీ కథల్**
**సరవిన్ యెంచగ నీదు బోంట్లు కలరే!! అన్నయ్య కీర్తించెరా**
**అరయంగా ఇపుడీవు వేంకటపతిన్ ఆరాధనల్ సేయుచున్**
**వరభక్తాళికి అండవైతివి కదా! పాడేము నీ సేతలన్.**

**రాగం : చారుకేశి**

శరణు కపీశ్వర శరణంబ నిలజ
సరవి నెంచ నీ సరి యిక వేరీ ॥శరణం॥

పుట్టిన వాడే భువనము లెరగగ
పట్టితి సూర్యుని పండనుచు
ముట్టిన చుక్కలు మోపుగ బెరిగితి
విట్టి ప్రతాపివి యెదురేదయ్యా ॥శరణం॥

అంపిన యప్పుడె యంబుది దాటితి
వింపులు సీతకు నిచ్చితివి
సంపద మెరయుచు సంజీవి దెచ్చితి
పెంపును సొంపును బేర్కొన వశమా ॥శరణం॥





చెదరక నేడే శ్రీవేంకటగిరి
గదిసి రాముకృప గైకొంటి
వదలక నీ కృపవాడనైతి నిదె
యెదటనే కాచితి విక గదవేమి ॥శరణం॥

**భావామృతం :**

కపిశ్రేష్ఠుడవైన ఓ ఆంజనేయా! శరణు జొచ్చెదను. పవనకుమారా! యెంచి చూడగావినీ సాటియైన వాడెవరూ సరవి (క్రమముగా) నాకు కనిపించుట లేదు.

ఈ భువనములు (లోకములు) అన్నియు తెలుసుకొను విధముగా, పుట్టిన వెంటనే పండు అని భ్రమపడి సూర్యుని పట్టుకొంటివి. ముట్టిన చుక్కలు (నక్షత్రములను తాకునట్లు నీ శరీరమును పెంచితివి. ఇట్టి ప్రతాపశాలివైన నిన్ను ఎదురించు వాడెవడు? నీకు ఎదురే లేదు.

శ్రీరామచంద్రుడు నిన్ను పంపించగానే శతయోజన విస్తీర్ణమైన సాగరమును లంఘించి దాటితివి. సీతాదేవికి వైభవముల నొసంగితివి. సంపదల వంటి అనేక దివ్య ఓషధులు ప్రకాశించు సంజీవని పర్వతమును పెకలించి తెచ్చితివి. అటువంటి నీ సొంపును పెంపును (సౌందర్యమును, అతిశయమును) పేర్కొనుట మా వల్ల అయ్యే పనియేనా?

నేడు ఈయనెవరా అని చెదరిపోక శ్రీవేంకటగిరి వాసుడైన వేంకటేశ్వరుడే నీ శ్రీరామచంద్రుడని కదిసి (సమీపించి) ఆయన కరుణ బొందితివి. ఇక వదలక నీ కృప పొందిన వాడనయ్యాను. నా యెదుటనే నిలచి నన్ను కాచుచుంటివి. ఇక నాకేం తక్కువ తండ్రీ!

**3-87**

## మున్నుడి

శ్రీరంగంలో వెలసిన రంగనాథస్వామిపై అన్నమాచార్యులు చెప్పిన అమరమైన సంకీర్తన ఇది. స్వామిని శ్రీరంగ శిశువని కీర్తిస్తున్నారు. నాలుగు వేదములూ నాలుగు తాళ్ళులాగా కట్టుబడిన వుయ్యాలలో ఆదిశేషుడు తొట్టెగా అమర్చబడిన చక్కటి వూయలలో వూగుతున్నాడు. ఆ చక్కటి నల్లని శిశువు. వాడే శ్రీదేవితో కలిసి వేంకటాద్రిపై సేద తీరుతున్నాడట. ఆ శ్రీరంగ శిశువు కమలభవాండమను (బ్రహ్మాండమను) తొట్టెలో బ్రహ్మాండమైన నీటి తరంగాలలో వూపుతుండగా స్థిరమైన సిరులతో వూగుతున్నాడట.

**ఉ॥ తొల్లిట మఱ్ఱియాకుపయి తోయజనాభుడు చిన్నిపాపగా**
**చెల్లుబడై తనూగెనట చిత్రముగా నొక తొట్టెయట్లుగా**
**నల్లని రంగనాయకుని నాణ్యత గొల్చెను అన్నమార్యుడన్**
**చల్లటి మాటగా శిశువు చక్కటి వేంకటనాథుడంచనెన్**

**రాగం : రాగమాలిక**

తొల్లియును మఱ్ఱాకు తొట్టెలనె యూగె గన
చెల్లుబడి నూగీని శ్రీరంగ శిశువు ॥తొల్లియును॥

కలికి కావేరి తరగల బాహు లతలనే
తలగకిటు రంగమధ్యపు తొట్టెలన్
పలుమారు తను జూచి పాడగా గీని
చిలుపాల సెలవితో శ్రీరంగ శిశువు ॥తొల్లియును॥

అదివొ కమలజుని తిరువారాధనం బనగ
అదన కమలభవాండమను తొట్టెలన్
ఉదధులు తరంగముల నూచగా నూగీని
చెదరని సిరులతోడ శ్రీరంగ శిశువు ॥తొల్లియును॥





వేదములె చేరులై వెలయంగ శేషుడే
పాదుకొను తొట్టెలై పరగ గాను
శ్రీదేవితో గూడి శ్రీవేంకటేశుడై
సేదదీరెడి వాడె శ్రీరంగ శిశువు ॥తొల్లియును॥

**భావామృతం :**

పూర్వం ఒక మఱ్ఱి ఆకు తొట్టెవలె భాసించి దానిపై శ్రీరంగనాథస్వామి శిశువు వలె వూగినాడు కదా! అట్లు చెల్లుబడియైన ఆ మహానుభావుని కీర్తించెదము.

కావేరీనది కలికివలె (యువతివలె) బాహులతలవంటి తన తరంగములపై నదీ మధ్యమంలో అమర్చబడిన వేదిక అనే తొట్టెలో ఈ శ్రీరంగ శిశువు వూగుచున్నాడు. తనను చూచి అనేక కీర్తనలు పాడుచుండగా, చిలుపాల సెలవితో (చిక్కగా మరగబెట్టిన పాలచారికలు మూతిపై గల) శ్రీరంగ శిశువు వూగుచున్నాడు.

అదిగో కమలభవుని తిరునాళ్ళ సమయంలో బ్రహ్మాండమును ఈ తొట్టెలో, బ్రహ్మాండమైన నీటితరంగములు వూచగా (వూపుతుండగా) చెదరని (స్థిరమైన) సిరిసంపదలతో ఈ శ్రీరంగశిశువు కనుల పండువుగా వూగుచున్నాడు. దర్శించి తరించండి.

చతుర్వేదములైన సామ, ఋక్, యజుర్, అథర్వణ వేదములు నాలుగు చేరులై (కట్టుడు త్రాళ్ళయి) భాసించగా ఆదిశేషుడు చక్కగా అమర్చబడిన తొట్టెయై విలసిల్లగా తనదేవేరి శ్రీదేవితో కూడి తిరుమల శ్రీవేంకటేశ్వరుడై ఈ స్వామియే సేదదీరుచున్నాడు. (విశ్రాంతి తీసుకొనుచున్నాడు) వాడే శ్రీరంగ శిశువైన ఈ శ్రీరంగనాథుడు. ఈ స్వామిని సేవించి మీ జన్మ చరితార్థం చేసికొనండి.

**3-88**

## మున్నుడి

గోవుల్ని కాచే గోపాలకృష్ణయ్యే శ్రీవేంకటేశ్వరుడని భావించి అన్నమాచార్యులవారు చెప్పిన అద్భుతమైన కీర్తన ఇది. ఘుమ్మనే శృతితో నేతులు కమ్మగా కాగి ఆనందంలో ముంచెత్తాయట. అన్నమయ్య కవిత ఛందోబద్ధమని నిరూపించటానికే ఈ కీర్తనను యధాతథంగా సీసపద్యంలోకి మార్చాను.

**సీ॥ నీలవర్ణుండని నీరజాక్షుండని**
**బాలుని పాడేరు పడతులచట**
**బానల కాగుల పాలు పితుకుచును**
**త్రచ్చుదురు పెరుగు తరుణులచట**
**మందరధరుడని మాధవుడనుచు గో-**
**విందుని పాడేరు వెలదులచట**
**నందవ్రజంబున నలుగడ నావుల-**
**మందల రవములు పొందుమీర**

**ఆ.వె॥ఘుమ్మనియెడి శృతుల కూడ గరమ్మని**
**నేతులెల్లకాగె, ప్రీతి గొలుప**
**వేంకటేశు నందుబిడ్డగా భావించి**
**అన్నమయ్య పాడె నద్భుతముగ**

**రాగం : పూర్వి కళ్యాణి**

ఘుమ్మనియెడి శృతి కూడగను
కమ్మని నేతులు కాగగ చెలగె ॥ఘుమ్మని॥

నీల వర్ణుడని నీరజాక్షుడని
బాలుని నతివలు పాడేరో
పాలు పిదుకుచును బానల కాగుల
సోలి పెరుగు త్రచ్చుచు చెలరేగె ॥ఘుమ్మని॥





మందరధరుడని మాధవుడని గో-
విందుని పాడేరు వెలదులిదే
నంద వ్రజమున నలుగడ నావుల
మందల పేయల మంచిరవముల ॥ఘుమ్మని॥

వేంకటపతియని వేదనిలయుడని
పంకజనాభుని పాడేరు
అంకుల చేతను అలరు రవంబుల
బింకపు మాటల బృందావనమున ॥ఘుమ్మని॥

**భావామృతం :**

ఘుమ్మనే శృతి బద్ధమైన ధ్వనితో పెద్ద పెద్ద కాగులలో నేతులు కాగుచున్నవి. (గోపాలకృష్ణుని నందవ్రజము శోభిలినింది. ఆ వివరం వినండి...)

గోపభామినులందరూ ఆ గోపబాలుని నీలవర్ణుడని నీరజాక్షుడని కీర్తించుచు పాడినారు. పాలు పిదుకుచు కొందరు గోపికలు బానలు కాగులు నింపసాగిరి. కొందరు స్త్రీలు పెరుగును సోలి(వివశులైపోయి) చిలుకుచూ చెలరేగి కాననైరి.

గోవిందుడని పేరు గాంచిన ఆ శ్రీకృష్ణుని గోపికలు (వెలదులు) అందరూ మందరగిరి ధరుడని (గోవర్ధన పర్వతమును తన చిటికిన వ్రేలిపై ఎత్తిన వాడని), మాధవుడని పాడి కీర్తించెడివారు. నందవ్రజమున (రేపల్లెలో) నలుదిక్కులా, మంచి ధ్వనిగల ఆవులు మందలను పేయలను (దూడలను) కాచినాడు.

ఇపుడు పద్మనాభుడైన ఆ మహానుభావుని శ్రీవేంకటపతియనియు, వేదములే నిలయముగాగల శ్రీమన్నారాయణుడనియు భక్తితో పాడి జనులు కీర్తించుచున్నారు. ఆ విధముగా బృందావనమున అంకుల చేతను (విశిష్టమైన ఆభరణములు గల చేతులతోను) బింకపు మాటలతోను గర్వముగల మాటలతో జగతి విలసిల్లినది.

**3-89**

## మున్నుడి

ఈశ్వర తత్త్వం పూర్తిగా ఆకళింపు చేసికొనిన అన్నమాచార్యుల వారు ఆ పరమాత్మను యెవ్వరు. యే పేరుతో పిలిచినా యెలా భావించినా భక్తి, శరణాగతి అనే రెండు చేతులతో పట్టుకుంటే ఘోరమైన సంసార ఝరినుంచి రక్షింప బడవచ్చును అంటున్నారు. వారు సామెతలను రాగబద్ధమైన కీర్తనలలో చెప్పటం చూస్తే ఆయన పాండిత్యానికి ముగ్ధులవుతాం "అంతరాంతరము లెంచి చూడ 'పిండంతే నిప్పటి' యున్నట్లు" – అంటే లోలోపలి బేధములు పరిగణించితే, నిప్పటి (నిప్పుమీద కాల్చిన రొట్టె) ఎంతవుంటుంది అంటే 'పిండంతే' (పిండి ఎంతవుందో అంత).

**ఉ॥ ఈతని యెంతమాత్రమున యెవ్వరు యెంచిన అంతమాత్రమే**
**ఈతడు సర్వరక్షకుడు ఈశ్వరుడింతటి సృష్టికంతకున్**
**ఈతడె బ్రహ్మయున్ హరుడు ఈతడె శక్తియు అంతకుండుతా**
**నీతడె వేంకటేశ్వరుడు ఇంపుగ జెప్పెను అన్నమార్యుడున్**

### రాగం : ద్విరాగమాలిక

ఎంతమాత్రమున నెవ్వరు దలచిన–అంతమాత్రమే నీవు
అంతరాంతరములెంచి చూడ బిం–దంతే నిప్పటి యన్నట్లు ॥ఎంత॥

కొలుతురు మిము వైష్ణవుల–కూరిమితో విష్ణుడని
పలుకుదురు మిము వేదాంతులు–పరబ్రహ్మంబనుచు
తలతురు మిముశైవులు–తగిన భక్తును శివుడనుచు
అలరిపొగడుదురు కాపాలికులు–ఆదిభైరవుడనుచు ॥ఎంత॥

సరి నెన్నుదురు శాక్తేయులు–శక్తిరూపు నీవనుచు
దరిశనములు(ల) మిము నానావిధులను తలపుల కొలదులు భజింతురు
సిరుల మిమునే యల్పబుద్ధిదల–చినవారికి నల్పంబవుదువు
గరిమల మిమునే ఘనమని తలచిన–ఘనబుద్ధులకు ఘనుడవు ఎంత॥





నీవలన కొరతే లేదు మరి–నీరు కొలది తామరవు
ఆవల భాగీరథి దరి బావుల–ఆ జలమే వూరినయట్లు
శ్రీవేంకటపతి నీవైతే మము–జేకొని వున్న దైవమని
యీవలనే నీ శరణనియెదను–యిదియే పరతత్త్వము నాకు ॥ఎంత॥

### భావామృతం :

ఓ ప్రభూ! నిన్ను ఎవ్వరు ఎంతమాత్రముగా భావించిన అంతమాత్రమే, అదే విధముగా నీవుంటావు. లోలోపలి భేదము నెంచి చూచినచో నిప్పటి (నిప్పుల మీద కాల్చిన రొట్టె) యెంతవుంటుందంటే పిండంతే (పిండి యెంతవుందో అంతే) అనే చెప్పుకోవలసి వుంటుంది).

దేవా! మిమ్ము వైష్ణవులు విష్ణుమూర్తి అని ప్రేమగా కీర్తిస్తున్నారు. వేదాంతులందరూ మిమ్మల్ని పరబ్రహ్మ అని అంటున్నారు. ఇంకొకవైపున శైవులందరూ మిమ్మల్నే శివుడు అని భక్తులై కొలుచుచున్నారు. కాపాలికులు మిమ్మల్నే ఆదిభైరవుడనే పేరుతో పూజిస్తున్నారు.

స్వామీ! శాక్తేయు నిన్ను సరియైన విధముగా శక్తిరూపముతో వున్నవాడవని ఎన్నిక చేసి యున్నారు. మిమ్ముల్ని అందరూ వారివారి భావాలకు తగ్గట్లుగా (వారి వారి మతానుసారముగా) దర్శించుచున్నారు. సిరి పతివైన నిన్ను అల్పబుద్ధిలెవరైనా అల్పముగా భావిస్తే వారికి అల్పముగానే తోచెదవు. మహిమాన్వితుడవైన నిన్ను ఘనుడవని భావిస్తే వారికి ఘనునిగానే కనుపించెదవు.

ప్రభూ! నీవలన ఏవిధమైన కొరతాలేదు. నీవు నీరుకొలది తామరవు (భక్తి కొలది ఫలమొసగు పరమాత్మవు) పవిత్రమైన గంగానది ఒడ్డున మరియు పరిసర ప్రాంతాలలో కల బావులలో ఆ గంగానది జలమే వూరుతుంది కదా! ఓ శ్రీవేంటేశ్వరా! మమ్మల్నందరినీ చేపట్టి రక్షించు దైవము నీవేనని గుర్తించి నిన్నే శరణని నీ దాసుడనైతిని. ఇదియే మాకు గొప్ప పరతత్త్వమై విలసిల్లుచున్నది.

**3-90**

## మున్నుడి

చక్కటి సరస శృంగార కీర్తనలో తల్లి అలమేల్మంగ స్వామి నెలా ఆకట్టుకొన్నదో వివరిస్తున్నారు అన్నమాచార్యులవారు. శృంగారం స్వామిని అలరిస్తుంది అని నమ్మిన ఎందరో మహానుభావులు ఇటువంటి కీర్తనలనెన్నో చెప్పారు. ఆ పలుకులు వారి హృదయాంతరాళాల్లోంచి వెల్లువలా వస్తాయి. (బుర్రలోంచి కాదు). "కాటుక కంటినీరు చనుకట్టు పయిన్ బడనేల యేడ్చెదో.." అని ఓదార్చే పోతన గారికి సరస్వతీదేవి తల్లిగా కనిపించింది, స్త్రీగా కాదు. అలా కనిపించిన వాడినే ఆ తల్లి బిడ్డగా స్వీకరిస్తుంది. అలమేల్మంగమ్మ కూడా అంతే...

**ఆ.వె॥ చిత్తగించు మిదియె చెలియ విలాసంబు**
**పొత్తులు కలిపేను భోగములకు**
**అమ్మమంగ సొగసు హరిమది నలరించు**
**అన్నమయ్య పాట అద్భుతమురి.**

**రాగం : శివరంజని**

చిత్తగించుమిదె చెలియ విలాసము
పొత్తులు గలపీ భోగంబులకు ॥చిత్తగించు॥

వెన్నెలరేకులు వెద చల్లీనదె
సన్నల సెలవుల సకియా
కన్నుల మొక్కులు కానుక లొసగీ
నిన్ను జూచి యిదే నివ్వెరగులను ॥చిత్తగించు॥





జక్కవ పిట్టల నంతము సేసీ
అక్కున గప్పుచు నతివా
చక్కని మోవిని చవులటు గొలపీ
నెక్కొని నీపై నేస్తంబులను ॥చిత్తగించు॥

పలుకు తేనియలు పలుమరు చిలికీ
మెలుపు రతుల నలమేల్మంగ
యెలమిని శ్రీవేంకటేశ కూడితివి
అలరీ నీతో నదె సరసములా ॥చిత్తగించు॥

**భావామృతం :**

ఓ శ్రీవేంకటేశ్వరా! ఇదిగో ఈ చెలియ విలాసమును గమనించుము ప్రభూ! నీతో భోగించుటకు ఈమె నీ జత కలిసినది.

ఈ నీయొక్క సఖియ, వెన్నెల తెరకలను వెదజల్లినట్లు సన్నలు సెలవులు చేస్తోంది. (సంజ్ఞలూ చేయుచూ ఆజ్ఞాపించు చున్నది). నిన్నుజూచి ఇదిగో నివ్వెరగులను, (పారవశ్యముతో) కన్నులతోనే నీకు మొక్కుచున్నది. నీకొక్కనికే అర్థమవునట్లు ఎన్నో కానుకలు సమర్పించుకొంటున్నది. ఆమెను చిత్తగించుము తండ్రీ!

ఈ అతివ, జక్కువ పిట్టలను అంతముచేసి(గుండ్రటి కుదిమట్టసపు జక్కువ పక్షులతో జవ్వని పయోధరములను పోల్చుచున్నారు అన్నమయ్య) తనయెదను కప్పుకొనుచున్నదా అనిపించుచున్నది. నీపై నెక్కొని నేస్తంబులను (పాదుకొనిన చెలిమితో) కలిగిన ఆమె చక్కని అధరము చవులూరించు చున్నది ప్రభూ!

అమె తీయని మాటలతో పలుమార్లు తేనెలను చిలకరించుచున్నది. ఆ తల్లి అలమేల్మంగమ్మ. పెనవేయు రతులతో మిక్కిలి సంతోషముతో నిన్ను కూడినది. ఓ శ్రీనివాసా! మనోజ్ఞమైన సరసములతో ఆమె నీతోచేరి ఆనందించినది తండ్రీ!

## 3-91

## మున్నుడి

తాతగారైన అన్నమాచార్యులవారి ఒరవడిలోనే ఆయన మనుమడు తాళ్లపాక చిన్న తిరుమలయ్య శ్రీవేంకటేశ్వర మకుటంతో అనేక భక్తి శృంగార కీర్తనలు తిరుమలనాథునిపై రచించి, వినిపించి, తరించారు. ఈ మేలుకొలుపు కీర్తనలో చిన్న తిరుమల "ఓ గోవిందా! నిదుర మేలుకొనవయ్యా! వశపరచుకొనే భోగాలు నీకు లెక్కలేనన్ని వున్నాయి. శ్రీదేవి భూదేవి చెరొకవైపున వున్నా మనస్సులో స్థిరంగా ఉండే నీళాదేవి శృంగార లీలలు మఱువవు. 'నాలి' తనంతో కొంటెపనులు మానలేవు. శ్రీవేంకటేశ్వరా! అవన్నీ చాలించి, లేచివచ్చి ఈ నీ లోకాలను, దాసులను పాలించు తండ్రీ!" అంటున్నారు.

**కం॥ గోవిందా! మేల్కొనవే**
**కావించిన భోగములవి కడమా స్వామీ!**
**కోవిదుడు చిన్న తిరుమల**
**ఈ వేంకటపతిని నిదుర ఇక చాలుననెన్.**

**రాగం : సామ**

గోవిందా మేల్కొనవయ్యా
కావించి భోగము కడమా నీకు ॥గోవిందా॥

కమలజ చల్లని కౌగిట దగిలి
సతురతి బాయగ జాలవు
కమలభవాదులు కడు నుతియింపగ
విమలపు శయనము విడువగ లేవు ॥గోవిందా॥

భూసతితోడుత పొందులు మరిగి
వేసర విదె నీ వేడుకలా
వాసవముఖ్యులు వాకిట నుండగ
పాసి వుండనని పవళించేవు ॥గోవిందా॥





నీళామనసిజ లీలల తగిలి
నాలితోడ మానగలేవు
వేళాయను శ్రీవేంకటనాథుడ
పాలించి దాసుల బ్రతికించగను ॥గోవిందా॥

**భావామృతం :**

ఓ గోవిందా! నీవు నిద్ర చాలించి త్వరగా మేల్కొనవయ్యా! కావించి భోగము (సాధారణమైన భోగములు కావించునవే, లోబరచుకొనేవే) అవి నీకు కడమా? (వాటికంతేమున్నది ప్రభూ!)

కమలము నుండి పుట్టిన లక్ష్మీదేవి యొక్క చల్లటి పరిష్వంగములో సమరతి భోగముల దగిలిన నీవు వదల లేవు. నిజమే.. కానీ ఇంకొక ప్రక్క పద్మసంభవుడైన బ్రహ్మ మొదలైన వారు వచ్చి నిన్ను ఎంతో కీర్తిస్తున్నారు. నిర్మలమైన నీ పాన్పుని వదలి రాలేకున్నావు. ఇదేమి ప్రభూ!

ఇటువైపు ఇదిట్లుండగా అటువైపు భూకాంతతో కూటములు అలవాటయి నీవు వేసరవు. (నీకు విసుగు కలగదు). ఇదే నీకు ఒక వేడుక వలె నున్నది. పోనీ, అటువైపన్నా నీవు స్థిమితంగా సుఖించకుండా, వాసవ ముఖ్యులు (దేవేంద్రుడు మొదలైన ముఖ్యమైన దేవతలు నీ బంగారు వాకిలి బయట కాచుకొని వున్నారు. అయినా నీవు భూసతిని పాసివుండనని (విడిచి పెట్టనని) పవ్వళించే యున్నావు. ఇట్లాగైతే యెలా ప్రభూ! నిదురలేవయ్యా మహానుభావా!

సరే! వారిరువురూ నీ కిరువైపులా వున్నారనుకో... ఇంకొక ఆమె వున్నది. ఆమెయే 'నీళాదేవి' ఆమె నీ మనసిజ. మనస్సులోనే వుంటుంది. ఆమెతో నీలీల ఒరవడిలో తగిలి 'నాలి' తోడ (టక్కరి తనముతో) (నీ కొంటె పనులు) మాననే మానవు. శ్రీవేంకటనాథుడవైన ఓ సర్వేశ్వరా! ఎంతో వేళయింది ప్రభూ! నిదురలేచి నీ దాసులమైన మమ్ము పరిపాలించి మమ్మల్ని బ్రతికించు తండ్రీ!

**3-92**

## మున్నుడి

శ్రీ వేంకటేశ్వరునిపై అన్నమాచార్యులవారు చెప్పిన అజరామరమైన కీర్తన ఇది. ఈయన ఒక్కడే సర్వేశ్వరుడు. తెల్లని కమల నయనుడైన ఈ తిరుమలనాథుని మించిన నాథుడు లేడు, లేడు, లేడు అంటున్నారు. ముగ్గురు వేల్పుల మూలము ఇతడే అంటున్నారు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ఈ విశ్వపు సృష్టి, స్థితి, లయల కోసం భగవంతుడైన పరబ్రహ్మచే నిర్దేశించబడిన ముగ్గురు వేల్పులు. మరి ఈ శ్రీవేంకటేశ్వరుడు వారికి మూలమైన పరబ్రహ్మ. అయినా, కృష్ణయ్యగా ఆయనే రేపల్లెలో గొల్ల భామలకు కౌగిటి సౌఖ్యమయ్యాడు. అది వాళ్ళ అదృష్టం.

**చం॥ ఇతడొకడే జగద్విభుడు ఈశ్వరుడందరి మోక్షదాతయున్**
**సితకమలాక్షుడీ హరియె శ్రీపతి వేంకటశైలనాథుడున్**
**జతగొని గోపభామినుల సందిట జేర్చిన కృష్ణమూర్తియున్**
**అతిమధురంపు కీర్తనకు నాకృతినిచ్చెను అన్నమార్యుడున్**

**రాగం : మోహన**

ఇతడొకడే సర్వేశ్వరుడు
సితకమలాక్షుడు శ్రీవేంకటేశుడు ॥ఇతడొకడే॥

పరమయోగులకు భావనిధానము
అరయ నింద్రాదుల కైశ్వర్యము
గరిమ గొల్లెతల కౌగిటి సౌఖ్యము
సిరులొసగే ఈ శ్రీవేంకటేశుడు ॥ఇతడొకడే॥

కలికి యశోదకు కన్న మానికము
తలచిన కరికిని తగు దిక్కు
అల ద్రౌపదికిని ఆపద్బంధువు
చెలరేగిన యీ శ్రీవేంకటేశుడు ॥ఇతడొకడే॥





తగిలిన మునులకు తపముల సత్ఫలము
ముగ్గురు వేల్పులకు మూలము
ఒగి నలమేల్మంగ కొనరిన పతి యితడు
జిగిమించిన యీ శ్రీవేంకటేశుడు ॥ఇతడొకడే॥

**భావామృతం :**

ఓ భక్తులారా! వినండి...

ఇతడొక్కడే సర్వేశ్వరుడని కీర్తించదగినవాడు. ఈయన సితకమలాక్షుడు (తెల్లని పద్మనయనుడు). ఈయనే శ్రీవేంకటేశ్వరుడు. అందరికీ ఈయనే ఆధారము, గతి, దిక్కు అయ్యాడు.

ఇతడు పరమయోగులకు భావనలలోని నిధానము (నెలకొని యున్న రూపము). ఇంద్రుడు మొదలైన దేవతలకు ఐశ్వర్యముల నొసగే దేవదేవుడు. రేపల్లెలో గొల్ల భామలకు గొప్ప కౌగిటి సౌఖ్యప్రదాత. ఇన్ని చేసిన ఈయన వేరెవరో కాదు. మనందరికి సిరిసంపదల నొసగే శ్రీవేంకటేశ్వరుడు.

ఇతడు యశోదాదేవికి బిడ్డయైన మాణిక్యము. తననే తలచి 'రావే ఈశ్వర! కావవే... వరదా! సంరక్షించు... నీవే తప్ప ఇతఃపరంబెరుగను...' అని గజేంద్రుడు మొరబెట్టుకున్న తగుదిక్కు. అక్కడ ద్రౌపదీదేవికి మానసంరక్షణ చేసి ఆపదల నివారించిన బంధువు. ఇన్ని విధముల విజృంభించిన ఈ మహానుభావుడే శ్రీవేంకటేశ్వరుడు.

ఈయన తననే అంటిపెట్టుకొనిన మునులకు వారి తపములిచ్చిన సత్ఫలితము. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులని కీర్తించబడుతున్న ముగ్గురు వేల్పులకు, మూలకారణమైన పరబ్రహ్మము ఈయనే. క్రమముగా జగజ్జనని అలమేల్మంగమ్మకు కలిగిన, మగడు ఈయన. ఈ సర్వేశ్వరుడే అసదృశమైన కాంతులతో విరాజిల్లే మన శ్రీవేంకటేశ్వరుడు.

## 3-93

## మున్నుడి

విభిన్నంగా కనుపించే ఈ కీర్తనలో అన్నమాచార్యుల వారు, ఒక తమాషా సందేశమిస్తున్నారు. దనుజులు శ్రీహరిపై ద్వేషంతో అన్యదేవతలకోసం తపస్సుచేసి అనేక వరాలు పొందికూడా చెడి నశించారు. కాని చివరికి శ్రీహరినే చేరుకొని మేలు పొందారు. వేదాంతులు మొదలైన వారు అన్యదేవతలని కొలిచి పొందే పుణ్యంనిరుపయోగమైనది. దానికంటే హరినిందతో పొందే పాపమే నయము. మనల్ని శిక్షించినా రక్షించినా శ్రీవేంకటేశ్వరుడొక్కడే. ఊరిలో వుండే 'దేవుళ్ళు' ఈతని సరిసమానమా అని అంటున్నారు.

**తరళము॥దనుజులున్ గనివారు తత్త్వము తాము కాదని శ్రీహరిన్**
**వినిచెనన్నయ భక్తకోటికి విష్ణుతత్త్వము దెల్పుచున్**
**పనిచి అన్యులమేలుగా స్తుతి పాడుచున్ ఘనపుణ్యముల్**
**గొనుటకంటెనుపేంద్రు దిట్టగ కూడు పాపమె మేలనెన్**

**రాగం : శంకరాభరణం**

దనుజులు గనిరి తత్త్వమిది
వనజాక్షుని కృప వసించ నేలా! ॥దనుజులు॥

హరి పరమాత్ము డనాది పురుషుడు
సురులకు నరులకు సులభుడు
హరి కోపముతో నన్యుల వరములు
సరిగా వెంచగ జగములలోన! ॥దనుజులు॥

వేదాంత విదుడు విష్ణుడు కృష్ణుడు
శ్రీదేవికి బతి శేఖరుడు
పోది బరస్తుతి పుణ్యముకంటే
పాదుగ హరి దిట్టే పాపము మేలు! ॥దనుజులు॥





నారాయణు దున్నతు దచ్యుతుడుప
కారుడు శ్రీవేంకటవిభుడు
చేరి యీతడే శిక్షించ రక్షించ
వూరదయివములు వొగి నితని సరా! ॥దనుజులు॥

**భావామృతం :**

(ఓ మానవులారా! సురులు విష్ణుభక్తులనే భ్రమతో అసురులు విష్ణు విరోధులయ్యారు. విష్ణుభక్తులను హింసించి, పాపకార్యాలు చేసి హరిచే శిక్షింపబడ్డారు. అందువల్ల మరింత హరిని ఎదుర్కొనటానికి అన్యదేవతల కోసం తపస్సు చేసి వరాలు పొంది హరితోపోరి, హరిచేతిలో నశించి ఇదివరకు తాము హరి నిందతో మూటగట్టుకొన్న పాపం నశించి, పుణ్యంతో వైకుంఠం పొందారు. ఆ దనుజులకు అన్యదేవతల మేలుకంటే హరి చేసిన కీడే పరమ సుఖాన్నిచ్చింది. అవునా?) దనుజులు ఈ విచిత్రమైన తత్త్వమును ఆకళింపు చేసికొనిరి. వనజాక్షుడు (పద్మనయనుడు) అయిన శ్రీహరి కృపతో వసించనేలా! (మనము వుండటమెందుకు?)

నిజం ఆలోచిస్తే, శ్రీహరి పరమాత్ముడు, ఆదిపురుషుడు. ఆయన సురులకు, నరులకు, సులభుడు (సులభంగా వరములిచ్చే పక్షపాతి) అని భావించి, హరిపై కోపముతో ప్రపంచంలో అన్యుల (ఇతర దేవతల) వరములను యెంచగా (పొందాలనుకోవటం) సరికాదు. (అదివారికి హానికరమే అవుతుంది).

వేదాంతుల చేత తెలుపబడినవాడే కృష్ణుడయిన (నీలవర్ణుడైన) విష్ణువు. ఆయనే శ్రీలక్ష్మి వల్లభుడు, అత్యున్నతుడు. పరస్తుతి చేసి (అన్య దేవతలను కీర్తించి) పోది (పోగుచేసికొనిన) పుణ్యము కంటే, పాదుగా (నిలచి) శ్రీహరిని తిట్టే పాపమే మేలు. (చివరికి అది విష్ణుపురిని ప్రాప్తింప చేస్తుంది)

శ్రీమన్నారాయణుడు ఉన్నతమైనవాడు. నాశనములేని అచ్యుతుడు. ఎంతో ఉపకారము చేయువాడు. ఆయనే శ్రీవేంకటేశ్వరుడు. ఆయన నాశ్రయించినచో మనం చేసికొన్న పాపపుణ్యాలను బట్టి, శిక్షిస్తాడో రక్షిస్తాడో ఆయన ఇష్టం. అంతేకాని, వూరినిండా లెక్కకు, మిక్కుటంగా క్రమముగా వుండే ఇతర దేవతలెందుకు? వారు ఈ ఏడుకొండలవాడితో సమానమా?

**3-94**

## మున్నుడి

అహోబల నృసింహునిపై అన్నమాచార్యులవారు చెప్పిన చక్కటి కీర్తన ఇది. అన్నమయ్య వాడిన కొన్ని పదాలు 'నభూతో నభవిష్యతి' అనునట్లుంటాయి. నరసింహునిది 'వాడి ప్రతాపము' అని అందరూ అంటే, అన్నమయ్య 'వేడి ప్రతాపము' అంటున్నారు. స్వామి 'బగివాయని శ్రీపతి' అట. అంటే ఆదిలక్ష్మిని తోడు వీడని భర్త అని అర్థం. 'దెసల పరాత్పర తెజము' అంటే... దిక్కులన్నిటా వ్యాపించిన శ్రేష్ఠమైన తేజస్సు - అని. ఏదో తెలుగుపాట ఇందులో ఏముంది అనుకుంటే... అది మన అమాయకత్వమే.

**ఆ.వె॥ ఇతని గొలిచి మనుడు ఇలలోని జనులార!**
**అఖిలవందితుండు అయిన దితడె**
**ఇహ పరంబులిచ్చు ఈ అహోబలపతి**
**పాడెనన్నమయ్య పరవశించి**

**రాగం : శంకరాభరణం**

అహోబలేశ్వరుడు అఖిల వందితుడు
మహి నితని గొలిచి మనుడిక జనులు ॥అహో॥

మూడు మూర్తులకు మూలం బీతడు
వేడి ప్రతాపపు విభుడీతడు
వాడి చక్రాయుధ వరదుండీతడు
పోడిమి పురాణ పురుషు డీతడు ॥అహో॥

అసురులకెల్ల కాలాంతకుడీతడు
వసుధ దివ్య సింహంబితడు
విసువని ఏకాంగ వీరుడీతడు
దెసల పరాత్పరతేజం బీతడు ॥అహో॥





నిగిడి శ్రీవేంకట నిలయుడీతడు
బగివాయని శ్రీపతి యీతడు
సొగిసి దాసులకు సులభు డీతడు
తగు ఇహపరముల దాతయు నీతడు ॥అహో॥

**భావామృతం :**

ఓ జనులారా! ఈ అహోబల నరసింహస్వామి సర్వులచేత నుతింపబడెడివాడు. ఈ భూలోకంలో ఈయనను సేవించి జీవింపుడు. (మీ జన్మధన్యమవుతుంది).

ఈ నృశింహుడు మూడు మూర్తులకు మూలము. అనగా బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు ఆది మూలమైన పరమాత్మ. తాపము కలుగజేయు ప్రతాపము కలిగిన జగన్నాథుడు. పదునైన చక్రాయుధం ధరించిన వరప్రదాత. ఇల నవతరించిన పురాణ పురుషుడు ఈ అహోబల నృసింహస్వామి. ఈయనను సేవించండి.

ఈ మహానుభావుడు రాక్షసుల పాలిటి కాలయముడు. భూమిపై అవతరించిన దివ్యమైన సింహము ఈయను. ఇదివరకెన్నడైనా, యెక్కడైనా మనిషి శరీరంతో తలమాత్రమే సింహాకారంగల రూపాన్ని చూశారా! ఈయన విసువని ఏకాంగ వీరుడు (విసుగుపుట్టని అసహాయ శూరుడు). అన్ని దిక్కులకు వ్యాపించిన, పరాత్పర తేజము (శ్రేష్ఠుడైన తేజోమూర్తి). (ఈ స్వామిని అనన్య భక్తితో ధ్యానించండి). ఈ స్వామియే నిగిడి (వ్యాపించి), శ్రీవేంకటాద్రి నిలయుడై వెలసినాడు. ఈయన బగివాయని (ఎన్నడూ తోడు విడువని) శ్రీపతి. ఈ పురాణపురుషుడే సొగిసి దాసులకు (ఇంపుగా తన దాసులకు, సులభముగా అనుగ్రహించు దాత. మరి ఎటువంటి దాత? ఇహలోకమున కావలసిన కోరికలను దీర్చి, పరలోకమున కైవల్యము నొసగే దాత. ఇటువంటి దాతవుంటాడా? లేదుగాక లేదు. ఈ అహోబలేశ్వరుని శరణనండి.

**3-95**

## మున్నుడి

జానపద శైలిలో నడిచిన ఈ కీర్తనలో తల్లి అలమేల్మంగ తన స్వామి 'వలపు వేదనలో' వాడి పోయింది, అయ్యో! అని, ఆమె చెలికత్తెలలో తనూ ఒకతెగా భావించుకొని మా 'శిన్నెకా' (చిన్నక్క) ఎంత బాధపడుతోందో! అని వాపోతున్నారు. అన్నమయ్య నిఘంటువే కాక, పెద్దలు కూడా సహకరిస్తేనే నా బోటి సామాన్యునికి ఈ కీర్తన అర్థమవుతుంది. అద్భుతంగా మలచిన రాగయుక్తమైన ఈ జానపద తేనె జల్లులో ప్రతిపదార్థం వివరించాలంటే.. పచ్చి వెలక్కాయ గొంతుకడ్డం బడుతుంది... నిజంగా..

**కం॥ చెలువపు సేతల చిన్నది**
**వలపుల వేదనల రగిలి వాడీనయ్యో!**
**తెలిపెను అన్నయ కీర్తన**
**చెలి వేంకటనాథు గవయు శిన్నెక్కనియెన్.**

**రాగం : దేశ్**

చెలువపు సేతల శిన్నెకా పెద్ద
వలపు వేదనల వాడీనయ్యో ॥చెలువపు॥

మొగమున కెగరెడి మొనవాడి గుబ్బల
చిగురు పెదవులాడి శిన్నెకా
నిగనిగ మెరిచేటి నీలిమేనివాని
సొగసు చూచి వాని సొలసీనయ్యో ॥చెలువపు॥

మొగ్గల మొలకల మురిపెపు కన్నుల
శిగ్గుల చిరునవ్వు శిన్నెకా
ఉగ్గున రేపల్లె వుసురుగొనేటి వాని
దగ్గరి తమకాన తడవీనయ్యో ॥చెలువపు॥





చంకల బంగారు చల్లిన మెఱుగుల
చింత బెదురులాడి శిన్నెకా
వేంకటపతి గూడి వేడుక తోడుత
సుంకుల సోగల సొలసీనయ్యో ॥చెలువపు॥

## భావామృతం

ఈ 'శిన్నెకా' (చిన్నక్క), అందమైన సేతల (పనులను) నిర్వహించు భామిని. ఈమె ఎంతో అధికమైన వలపు వేదన (విరహ బాధ)లో వాడిపోతున్నది. అయ్యో! పాపం!

ముఖమువైపునకు చొచ్చుకొని వచ్చునట్లు మొనదేలు కుచగిరులున్న జవ్వని ఈ శిన్నెకా. అంతేకాక, చిగురు- టధరముల చిన్నది. పాపం, ఈమె నిగనిగ మెఱయుచున్న నీలవర్ణ శరీర ఛాయగల శ్రీనివాసుని చూచి, వాని సౌందర్యానికి వశురాలై, వేదనకు గుఱి అయింది.

అయ్యో పాపం!! మొలకెత్తుచున్న మొగ్గలవంటి సొగసరి నయనములు కల ఈ శిన్నెకా చిరునవ్వులలో సిగ్గులు మొగ్గలై పూస్తున్నాయి. (ఎక్కడో మధురానగరం కారాగారంలో పుట్టి), ఆపై రేపల్లెలో ఉగ్గుపాలు త్రాగి, జీవించి పెద్దవాడయిన వాడి, జతకట్టు వలన కలిగిన మోహముతో అధికమైన విచారమునకు గురి అయినది. అయ్యో శిన్నెకా!

వెదజల్లిన బంగారము వలె మెఱయుచున్న బాహుమూలములుగల ఈ శిన్నెకా, బెదురు చూపుల మృగనయని. రసికుడైన ఈ శ్రీవేంకటేశ్వరుని యొక్క సుదీర్ఘము మరియు ప్రతిబంధకమైన కూటములతో, వేడుక పొందిననూ అయ్యో! పాపం ఈ శిన్నెకా విపరీతంగా అలిసిపోయింది.

**3-96**

## మున్నుడి

శ్రావ్యమైన సంస్కృత సంకీర్తనను వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. ఆయన యెన్నుకొన్న పదములు మరెవ్వరికీ తోచను కూడా తోచవు. ఆయన "రాముడు సుర సార్వభౌముడనటం" 'ప్రాసకోసం' కాదు. సార్వభౌముడు తన ప్రజల్ని అనేక రకాలుగా అనేకమార్లు రక్షించి ఆదుకొన్నట్లు సురులను ఆదుకొన్నాడని ఆచార్యుల భావన. 'శూరాధారాచార సుగుణోదారం' అంటే యేమిటో చెప్పగలిగిన వారికి నా ప్రణతులు. చెప్పలేని వారు శ్రమపడి నిఘంటువులు వెదకనక్కరలేదు. భక్తితో భావామృతం చదివితే చాలునండీ...

**తే॥ రాము డిందీవరశ్యాము డమర విభుడు**
**పరమధాముండు నతడని నిరుపమముగ**
**అన్నమార్యుడు వినుతించె నమరమందు**
**తిరుమలేశుడై జనులకు పరిచితుడనె.**

**రాగం : మిశ్రమలహరి**

రామ మిందీవర శ్యామం పరాత్పర-
ధామం సురసార్వభౌమం భజే ॥రామమ్॥

సీతావనితా సమేతం
పీత వానర బల వ్రాతం
పూతకాసల్యా సంజాతం
వీత భీత మౌని విద్యోతం ॥రామమ్॥

వీరం రణరంగ ధీరం
సారధర్మకు లోద్ధారం
క్రూరదానవ సంహారం
శూరాధారాచార సుగుణోదారం ॥రామమ్॥





పావనం భక్త సేవనం
దైవిక విహగ వధావనం
రావణానుజ సంజీవనం
శ్రీవేంకట పరిచిత భావనం ॥రామమ్॥

**భావామృతం:**

ఓ శ్రీరామచంద్రా! నీవు నల్ల కలువల శ్యామవర్ణం (మెరుపు కలిగిన నీలిరంగు మిశ్రమమైన నలుపు) తో కూడిన దేహచ్ఛాయకలవాడవు. మోక్షమునకు స్థానమైన వాడవు. దేవతలందరికీ సార్వభౌముని వంటివాడవు. అట్టి నిన్ను నేను భజింతును గాక!

ఓ స్వామీ! నీవు సీతాదేవితో కూడి యున్నవాడవు. పసుపు పచ్చని దేహచ్ఛాయగల వానరసైన్యముచే కొలువబడిన వాడవు. పవిత్రురాలైన కౌసల్యాదేవి యొక్క గర్భమున జన్మించిన కులదీపకుడవు మునిజనులకు భయమును పారద్రోలి, తేజోరూపుడవై ప్రకాశించిన వాడవు.

ఓ మహానుభావా! నీవు వీరాధివీరుడవు. రణరంగ ధీరుడవు. నీవు రసవత్తరమైన ధర్మకులమునకు ఉద్ధారకుడవై యున్నవాడవు. అతి క్రూరులైన రాక్షసులను నిర్జించి సంహరించినవాడవు. నీవు శూరులకు తగినటువంటి సుగుణములను ఆచారముగా కలిగిన ఉదార స్వభావుడవు.

ఓ దాశరధీ! నీవు పవిత్రమైన పుణ్యప్రదుడవు. నీవు భక్తులచే అనునిత్యం సేవింపబడెడి వాడవు. దైవాంశ సంభూతమైన విహంగము (జటాయువు) ను వధచే పొందిన మృత్యువునుండి తప్పించి ముక్తి నొసగినవాడవు. రావణుని కనిష్ఠ సోదరుడైన విభీషణుని, సంజీవని మృతులనుద్ధరించినట్లు ఉద్ధరించిన వాడవు. ఓ కరుణామయా! నీవు శ్రీవేంకటేశ్వరునిగా పరిచయమయ్యే భావన కలిగినవాడవు.

**3-97**

## మున్నుడి

"మురి అనే అసురునికి శత్రువైన శ్రీమన్నారాయణుని సహజంగా ఏ కల్మషమూ లేకుండా సంకీర్తంచవలెను. ఇది ఒక్కటే ఇహమున (జీవించియున్న లోకంలోను), పరమున (మన మరణానంతరం పరలోకములలోను) చక్కటి సాధనమై కాపాడుతుంది" అంటూ మన తాళ్ళపాక అన్నమాచార్యులవారు నామ సంకీర్తన విశిష్ఠతను తెలియజేస్తున్నారు. శ్రీహరినామ సంకీర్తనము మన అజ్ఞానము అనే దానికి 'పులివాకట్టు' అంటున్నారు. పులి నోటికి బిగించి కట్టిన బంధనం అని అర్థం.

**కం॥ ఇహపర సాధన మొకటే**
**సహజంబుగ మురవిలోధి సంకీర్తనయే,**
**మహి లేదన్యము, అన్నయ**
**అహరహమా హరిని గొల్వుడనెనిది వినుడీ**

**రాగం : మలయమారుతం**

ఇహపర సాధన మిదియొకటే
సహజపు మురారి సంకీర్తనొకటే ॥ఇపహర॥

భవసాగరముల బాపెడిది తేప
భువి నజ్ఞానము పులివాకట్టిది
జవళి నాశాపాశములకు కొడువని
నవనీత చోరు నామం బొకటే ॥ఇహపర॥

చింతా తిమిరము చెరిచేటి సూర్యుడు
అంతట దరిద్ర హతపు నిధానము
వింత మరణభయవినాశ మంత్రము
మంతుకు హరినామం బిది యొకటే ॥ఇహపర॥

మించు దుఃఖముల మృత సంజీవని
అంచల పంచేంద్రియముల కంకుశము
ఎంచగ శ్రీవేంకటేశు దాసులకు
పంచిన పాళ్ళ పరగిన దొకటే ॥ఇహపర॥





### భావామృతం

ఓ జనులారా! శ్రీమన్నారాయణుని నామ సంకీర్తనము ఇహలోకమున మరియు పరలోకమున కూడా వుద్ధరించగల ఒకే ఒక సాధనము. అయితే... ఆ మురారియైన ఆయన సంకీర్తన సహజముగా ఏ కల్మషమూ లేకుండా త్రికరణ శుద్ధిగా వుండాలి. (నోరు నొప్పి పుట్టేట్లు అరుస్తూ భజన చేస్తే ఆయాసం తప్ప ఏమీ మిగలదు). దాని విశిష్ఠత వినండి.

శ్రీహరి నామ సంకీర్తనము, ఈ భవ సాగరము (సంసార జలధి) ను దాటించ గలిగిన తేప (పడవ). ఈ లోకంలో అజ్ఞానమునకు శ్రీహరి నామ సంకీర్తనము 'పులివాకట్టు'

ఏవేవో భ్రమలను కలిగించి ఆశ అనే పాశము మనల్ని కట్టి పడేస్తే, ఆ రకరకాల కట్లను త్రెంచగల కొడవలి. వెన్నదొంగయైన ఆ సర్వేశ్వరుని నామ సంకీర్తన యొక్కటే ఇవన్నీ చేయగలదు.

శ్రీ రమణుని నామ సంకీర్తనము, చింత (విచారము) అను అంధకారమును రూపుమాపగల సూర్యుడు. మన దరిద్రమునంతటినీ నాశనము చేయగలిగిన ఐశ్వర్యము ఇదే. తప్పక వస్తుంది అని తెలిసికూడా ప్రతివాడూ చచ్చేదాక, చావంటే చచ్చేభయం పడుతూనే వుంటాడు. అది ఒక వింత భయం. పనిచేస్తుందో లేదో తెలియక పోయినా మంత్రం వేస్తే భయం పోతుంది. ఆ మృత్యుభీతికి నామమంత్రమే విరుగుడు. ఇవన్నీ అంతం కావాలంటే మనకి ఆ నారాయణుని నామ సంకీర్తన మొక్కటే గతియైనది.

అధికమైన దుఃఖము చివరికి మృత్యువునిస్తుంది. సంజీవని అనే మందు మృత్యువుని దూరం చేస్తుంది. కాబట్టి ఆ వైకుంఠనాయకుని నామసంకీర్తన దుఃఖమునకు సంజీవనిలా విరుగుడు. మన పంచేంద్రియములూ సుఖాలకు మనల్ని మచ్చిక చేసి మదపుటేనుగులై స్వైరవిహారం చేస్తూ పీడ కలిగిస్తాయి. శ్రీహరి నామసంకీర్తన అంకుశం వలె అంచల (మనవైపునుండి) ఆ పంచేంద్రియాలను అదుపుజేస్తుంది. ఆ శ్రీవేంకటేశ్వరుడు తన దాసులమైన మనకు యెంచి (లెక్కకట్టి) పంచి ఇస్తే మన పాళ్ళైన (వంతువచ్చిన) పరగీ నిదొక్కటే (ప్రీతిని కలిగించేది ఇదొక్కటే...)

**3-98**

## మున్నుడి

ఆనాడు దేవ దానవులు సాగర మథనం చేస్తే తొలుదొల్త హాలాహలము, ఆ తరువాత కల్పవృక్షము మొదలైన అనేక దివ్యోపకరణములు, నక్షత్రములు, చంద్రుడు, పిమ్మట శ్రీలక్ష్మి, చిట్ట చివరకు అమృతము లభించాయని పురాణాలు చెబుతున్నాయి. నేడు మన్మథుని వేదనతో అలమేల్మంగమ్మయొక్క చింతాకవితమైన మనస్సులో సాగరమథనం జరుగుతోంది. మరి ఇప్పుడు కూడా గరళము ఇత్యాదివి జనించాయి. ఓ వేంకటేశ్వరా! శ్రీకాంతుడా! ఇప్పుడు నీవు అవేమిటో చిత్తగించి ఆమెను నీ కౌగిట్లోకి తీసుకో అంటున్నారు అన్నమాచార్యులవారు.

**తే॥ మనసిజ సముద్రమున జేయు మథనమిదియె**
**కనుగొనుము నీవు ఇంతటన్ కమలనాభ!**
**నేడు శ్రీవేంకటేశుడై కూడి తరుణి**
**పొందినావనె అన్నయ్య పులకరించి**

**రాగం : శంకరాభరణం**

మనసిజ సముద్ర మథనమిదె
కనుగొన మింతట కాంతుడనీవు ॥మనసిజ॥

సతి చింతామణి జలనిధి తరువగ
అతిగరళపు విరహము బొడమె
తతినా పిమ్మట తమకపు కోర్కుల
లతల కల్పకపు లాకలు వొడమె ॥మనసిజ॥

పొలతి కూరిముల పొంగులు వొంగగ
పులకల తారలు వొడమెనవె
ఫలమై సాత్త్విక భావపు చంద్రుడు
నిలువున వొడమగ నేరుపులలరె ॥మనసిజ॥





సుదతి తానెనీ చొక్కపు కౌగిట
అదనున నిందిరయై పొడమె
కదిసిన శ్రీవేంకటపతి నీదెస
అధరామృతమయ్యతివకు వొడమె ॥మనసిజ॥

### భావామృతం

ఓ శ్రీవేంకటేశ్వరా! శ్రీకాంతుడా! ఇదే మనసిజ సముద్ర మథనము (మన్మథుడొనరించు సాగర మథనం). ఇంతట నీవు కనుగొనవయ్యా! మహానుభావా! ఆ వివరముల నందిస్తాను. మా అమ్మ అలమేల్మంగ మనస్సులో కూడా సాగర మథనం జరిగింది.

నీ సతీమణి వ్యాకులచిత్తయైనది. జలనిధి (చిలక బడినది) అప్పుడు అతి విరహము అనే గరళము పెల్లుబికి వచ్చింది. ఆ పిమ్మట, తతి తమకపు కోర్కెలు (అధికమైన పారవశ్యముతో కూడిన కోరికలు) లతల వలె వ్యాపించి, లాకలు వొడమి (శాఖోపశాఖలై), అదివొక కల్పవృక్షమా యేమి? ఈ చింతా సాగరమథనంలో ఇప్పుడే పుట్టిందా!! అనిపిస్తోంది. శ్రీనివాసా! ఇది గమనించవయ్యా!

ఆ పొలతి (యువతి), ప్రేమాతిశయముతో, వొంగగ (వినమ్రురాలైనది). ఆమె తనువు పులకరించి తనువెల్లా రోమాంచితమైనది. నక్షత్రముల వలె తోచుచున్న ఆ పులకలు ఆమె మానస సాగరమథనంలో జనించినవా యేమి!! అనునట్లుండెను. నీ ధ్యానము ఆమె వ్యాకులత దూరముచేసి సాత్త్విక భావములు కలిగినవి. దాని ఫలితంగా, నేర్పుగా ఆమెలో నిట్టునిలువుగా సాత్త్విక చంద్రోదయమై, ఈ సాగరమథనంలో కూడా చంద్రుడు పుట్టాడే!! అనిపించింది.

ఓ ఏడుకొండలవాడా! ఈ సుదతి (సుందరి) తానే నీ కౌగిట కరగి పోయి ఈ సమయంలో ఇందిరాదేవియై (సముద్ర మథనంలో పుట్టిన లక్ష్మీదేవి) వలె భాసించినది. కదిసిన (దగ్గరయైన) తిరుమలరాయా! మీ అనురాగ సాగర మథన ఫలితంగా ఆమెకు లభించిన అమృత మేమిటో నేను వేరే చెప్పవలెనా? నీ అధరామృతమే ఆమెకు లభించినది. (దీనిని దర్శించిన నా జన్మ కూడా తరించింది తండ్రీ!)

## 3-99

## మున్నుడి

అజ్ఞానం ఆవరించినప్పుడు చేయకూడని పనులు చేస్తారు మానవులు. అలాగే చేయవలసిన పనులు చేయరు. కరువు కాలంలో జీవించటానికి తిండికూడా దొరక్క సరిగ్గా అలాగే చేస్తారు. దైవభక్తి కూడా నశిస్తుంది. ఏడుకొండల వాడా? అట్లాంటి పాడు కాలాన్ని 'వెడలదొబ్బి' మా భీతిని తీర్చి, మమ్మల్ని ఆదుకో తండ్రీ! అంటున్నారు అన్నమాచార్యులవారు. ఇది కలియుగం, ఆకలియుగం. కాస్త 'యెండ గాయవయ్యా!' అంటున్నారు. నాకు తెలిసినంతవరకు అన్నమయ్యలాగ స్వామిని 'లలితంగా' ఇట్లా శరణు వేడినవారు లేరు.

**చం॥ కడబడ జ్ఞానమే కరవు కాలమిదే యిటు దాపురించెరా**
**వెడలగ దొబ్బి మా వెఱపు వేగమె దీర్పవె తాళలేనురా**
**వడిగొనె మారుడన్ 'అగడు వాయువు' సైపను అన్నమయ్యనెన్**
**విడువక చొచ్చితిన్ శరణు వేంకటనాయక! చిత్తగించుమా.**
***కడబడ = అంతమైపోగా**

**రాగం : లలిత**

కడు నజ్ఞానపు - కరవుకాల మిదె
వెడల దొబ్బి మా - వెరపు దీర్పవే ॥కడునజ్ఞాన॥

పాపపు పసురము - బందెలు మేయగ
పోపుల పుణ్యము - పోలివోయ
శ్రీపతి నీకే - చేయి చాచెదము
యేపున మమ్మిక - నీదేర్చవే ॥కడునజ్ఞాన॥

ఇల గలియుగమున - యెండలు గాయగ
చెలగి ధర్మమను - చెరువింకె
పొలసి మీ కృపాం-బుధి చేరితిమిదె
తెలిసి నా దాహము - తీర్చవే ॥కడునజ్ఞాన॥





వడిగొని మనసిజ-వాయువు విసరగ
పొడవగు నెఱుకలు - పుటమెగసె
బడి శ్రీవేంకట-పతి నీ శరణము
విడువక చొచ్చితి - వెసగావగదే ॥కడునజ్ఞాన॥

## భావామృతం

ఓ ప్రభూ! అధికమైన అజ్ఞానం అనే గొప్ప కరవుకాలము మాకు దాపురించింది. దానిని 'వెడలదొబ్బి' (వదలిపోవనట్లు 'తోసి' అవతల పారవేయుము) మా భయం తొలగించి మమ్ము కాపాడు.

మేము చేసికొనిన కొద్దిపాటి పుణ్యమనే పంటను, మా పాపము అనే పశువు బందులమేసింది. (దొంగతనంగా చొరబడి మేసేసింది). మా పోవులైన (రాసులైన) పుణ్యం నశించింది. ఓ శ్రీపతీ! చేయునది లేక దీనులమై చేయిచాచి నీ దయా భిక్షను వేడుకొంటున్నాము. ఇక నీవే దిక్కు. ఏపున (చొరవతీసికొని) మమ్మల్ని గట్టెక్కించు తండ్రీ!

ఈ కలికాలం ఆకలికాలం ప్రభూ! కలియుగమనే ఎండలు ఎక్కువై 'ధర్మము' అనే ప్రశస్తమైన చెఱువు ఇంకిపోయి, ఎండిపోయి బీటలు వారింది. మేము పొలసి (తిరిగి తిరిగి) నీ కరుణాసాగరము అనే మంచినీటి జలనిధిని చేరుకొన్నాం. మేము దాహంతో నీదయకోసం ఎంత తపించిపోతున్నామో తెలుసుకొని నా దాహం తీర్చవయ్యా! నన్ను కరుణించు తండ్రీ!

దేవా! వడిగొని (ఉద్ధృతముగా) మనసిజ వాయువు (మన్మధుడనే హోరుగాలి) వీచగా, పొడవగు నెఱుకలు పుటమెగసె (నేను సంపాదించుకొన్న విజ్ఞానమంతా కళ్ళుమూసి తెఱచు లోపల గాలి కెగిరిపోయింది.) ఇప్పుడు నేను అనాధను. వడిగా (శీఘ్రముగా) శ్రీవేంకటేశ్వరా! నేను నీ శరణు జొచ్చితిని "అన్యధా శరణం నాస్తి త్వమేవ శరణం మమ" - అని నీ అండ జేరాను. విడువక నన్ను రక్షించుము తండ్రీ!

## 3-100

## మున్నుడి

భజనద్వారా భగవంతుని ఆరాధించటం మన అనాది సంప్రదాయం. అన్నమాచార్యులవారు చెప్పిన అనేక భజన కీర్తనలలో ఇదికూడా తలమానికమైనది. 'ఈ రచనలను ఎవ్వరు తలచిన (అవి), ఇహపరమంత్రము లిందరికి' అని, ఓ నారాయణా! వివిధాత్మల రూపా! అట్టి నీకు 'నమో నమో' అని వందనములర్పిస్తున్నారు. ఇట్టి కీర్తనలలో భావామృత వివరణ అంత ప్రాధాన్యమైనది కాకున్నా, రెండు మూడు పదాలకు వివరణ ఇవ్వటం సమంజసం అనిపించి ఇవ్వటం జరిగింది. అనునిత్యం ఇటువంటి భజనలతో నారాయణుని సంకీర్తించండి, తరించండి.

**కం॥ ఈ రచన నెవరు తలచిన**
**నారాయణ ఇహపరములు నశియించునయా!**
**వరమైన మంత్రమదియే**
**గురుడౌ హరి నన్నమయ్య కొలిచె ప్రణతితో**

**రాగం : మిశ్రదేశ్**

నారాయణాయ నమో నమో
నానాత్మనే నమో నమో
ఈ రచనలనే ఎవ్వరు తలచిన
ఇహపరమంత్రము లిందరికి ॥నారాయణా॥

గోవిందాయ నమో నమో గోపాలాయ నమోనమో
భావజగురవే నమో నమో ప్రణవాత్మనే నమో నమో
దేవేశాయ నమో నమో దివ్యగుణాయ నమో నమో
ఈ వరుసలనే ఎవ్వరు తలచిన ఇహపరమంత్రము లిందరికి ॥నారాయణా॥

దామోదరాయ నమో నమో ధరణీశాయ నమో నమో
శ్రీమహిళాపతయే నమో నమో శిష్టరక్షణే నమో నమో
వామనాయ తే నమో నమో వనజాక్షాయ నమో నమో
ఈ మేరలనే ఎవ్వరు తలచిన ఇహపరమంత్రములిందరికి ॥నారాయణా॥





పరిపూర్ణాయ నమో నమో ప్రణవగ్రాయ నమో నమో
చిరంతనా శ్రీవేంకటనాయక శేషశాయినే నమో నమో
నరకధ్వంసే నమో నమో నరసింహాయ నమో నమో
ఇరవుగ నీగతి నెవ్వరు దలచిన ఇహపరమంత్రములిందరికి ॥నారాయణా॥

**భావామృతం :**

ఓ శ్రీమన్నారాయణా! నమోనమః నానాత్మల రూపుడవై భాసిల్లుతున్న పరమాత్మా! నమోనమః నీ రచనా చమత్కారంతో జగములన్నీ సృష్టించి, పోషించి, లయం చేస్తున్నావు. ఎవ్వరు నీ ఈ రచనలను తలచి నిన్ను భజిస్తారో... వారికి ఇహలోకంలో సుఖ సంతోషాలు, పరలోకంలో మోక్షప్రాప్తి కలిగి తీరుతాయి. నీ భజనలు ఇంతమంది జనులకు ఇహపరములిచ్చే మంత్రములు.

ఓ గోవిందా! నీకు వందనములు. గోవులను పాలించిన యదు నందనా! నీకు వందనములు. భావనలలోనే జన్మ కలిగిన మన్మధుని కన్నతండ్రీ! నీకు వందనములు. దివ్యమైన గుణములు కలిగిన దేవా! నీకు వందనములు. ఈ విధముగా నిన్ను ఎవ్వరు భజింతురో ఆ భజనలు వారికి ఇహపరములను సాధించగలిగిన దివ్య మంత్రములు.

ఓ దామోదరా! నీకు ప్రణతులు (నమస్కారములు). ఓ ధరణీశా! (భూదేవికి మగడా!) నీకు ప్రణతులు. ఓ శ్రీమహిళాపతీ! (శ్రీపతీ) నీకు ప్రణతులు. శిష్టులైన సన్మతులను రక్షించు అనాధ రక్షకా! నీకు ప్రణతులు. వామనునిగా బలి నణచి సుర రక్షకుడవైన దేవా! నీకు ప్రణతులు. ఓ పద్మనయనా! నీకు ప్రణతులు. ఈ మేరలనే (ఈ క్రమములోనే) నిన్ను ఎవ్వరు భజింతురో వారికి ఇహపరములలో సౌఖ్యము కలుగుతుంది. ఈ భజనలు ఇందరికీ ఇహపర సుఖములనొసగే మంత్రములు.

పరిపూర్ణుడవైన ఓ సర్వేశ్వరా! నీకు నమస్కారములు. ఓంకార స్వరూపా! నీకు నమస్కారములు. ఓ చిరంతనా! (ఆది అనునది లేని 'అనాది') గా ఆదిశేషుదు తల్పముగా క్షీరసాగర శయనుడవు అయిన శ్రీవేంకటేశ్వరా! నీకు నమస్కారములు. నరకాసురుని వధించిన శ్రీకృష్ణా! నీకు నమస్కారములు ప్రహ్లాదవరదుడవైన నరసింహస్వరూపా! నీకు నమస్కారములు. ఈ విధముగా నీవు నెలకొని యుంటివని ఎవ్వరు భావిస్తారో వారికి నీ ఈ భజనలు ఇహపరములనొసగే దివ్యమంత్రములు.

## 3-101

## మున్నుడి

మంగళం పాడుతున్నారు అన్నమాచార్యులవారు. దీనితో ఈ సంపుటిలో చిట్ట చివరి కీర్తనకు మున్నుడి మరియు భావామృతం వివరణ పూర్తి అవుతాయి. మాధవుడు, భూధవుడు అయిన శ్రీధరునికి చిన్మయమూర్తికి సాధుజన ప్రియునికి మంగళం పలుకుతున్నారు. ఎవ్వరూ ఇదివరలో వేంకటరమణుని చదువులమూర్తి అని కీర్తించలేదు. అలమేల్మంగమ్మను ఆయన ఛాయ (నీడ) అని కీర్తించలేదు. మా యింటి పతి అని కీర్తించలేదు. మన అన్నమయ్యకు సాటిలేరు, రాలేరు, రాబోరు...

**ఉ॥ మాధవ! నీకు మంగళము మన్మథు తండ్రికి మంగళంబహో!!**
**సాధుజనాళికిన్ ప్రియుదు సజ్జన వందితుడైన స్వామికిన్**
**భూధవుడైన దేవునికి పూజలు సేసెద నన్నమయ్యనెన్**
**శ్రీధర! చిన్మయా! జయము శ్రీకరుడౌ తిరువేంకటేశ్వరా!**

**రాగం : సురటి**

మాధవునకు మంగళం
సాధుప్రియునకు జయమంగళం ॥మాధవు॥

మదనగురునకును మంగళం, మా
మదిలో హరికిని మంగళం
మదరిపు హరునకు మంగళం
చదువులమూర్తికి జయమంగళం ॥మాధవు॥

మహిమాధికునకు మంగళం
మహామహునకు మంగళం
మహీధవునకు మంగళం
సహజతేజునకు జయ మంగళం ॥మాధవు॥





మాయారహితునికి మంగళం
మా యింటిపతికిని మంగళం
యీ యెడ శ్రీవేంకటేశ్వరు డీతని
చాయ శ్రీసతికి జయ మంగళం ॥మాధవు॥

## భావామృతం

మాధవుడైన శ్రీమన్నారాయణునకు మంగళమగు గాక! సాధుజనులకు ప్రియుడైన శ్రీహరికి జయమంగళము.

మన్మథుని తండ్రిగారైన మహానుభావునికి మంగళముగాక! హృదయాలలో స్థితుడై ఆత్మారామునిగానున్న శ్రీహరికి మంగళమగుగాక! మన శత్రువైన మదమును హరించు దేవదేవునికి మంగళమగుగాక! చదువులమూర్తికి (వేదములే మూర్తిగా అవతరించిన స్వామికి) మంగళము, జయమంగళము పలుకుచున్నాను.

అధికమైన మహిమలు గల దేవునకు మంగళము. మహామహుడైన జగన్నాథునకు మంగళము అగుగాక! వరాహమూర్తియై, మహిని ధరించిన స్వామికి మంగళమగు గాక! సహజ తేజస్సుతో వెలుగులు విరజిమ్మే ఆదిదేవునకు జయమంగళమగుగాక!

మాయకు ఏమాత్రమూ లొంగని ప్రభువునకు మంగళమగు గాక! మా ఇలవేల్పు అయిన స్వామికి మంగళమగు గాక! ఇక్కడ శ్రీవేంకటేశ్వరుడయిన ఈ మహానుభావునికి అతని నీడవలె వెంటనుండే అలమేల్మంగమ్మకు జయమంగళమగు గాక!

Author

*రచయిత :*

**అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు**

| | | |
|---|---|---|
| పిలవండి | : | **అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు** |
| పుట్టింది | : | **9-6-1945** |
| చదివింది | : | **M.Tech** |
| ఉండేది | : | ఫ్లాట్ నెం. 5, ప్లాటు నెం. 61,<br>సిద్దార్థ అపార్ట్‌మెంట్స్, సిద్దార్థ నగర్,<br>హైదరాబాద్–500 038. ఆం.ప్ర. భారతదేశం. |
| రంధి | : | భగవన్నామ సంకీర్తన |
| నచ్చింది | : | శాస్త్రీయ సంగీతం |
| నచ్చంది | : | నక్కజిత్తులు |
| మెచ్చింది | : | సజ్జన సాంగత్యం |
| రింగండి | : | **00919393021360** |
| చదవండి | : | **www.geetadeeksha.com** |
| ఇవ్వండి | : | **e-mail : geetadeeksha@gmail.com** |